అపరాధ పరిశోధన అనుబంధం—118

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ముసలి మొగుళ్లు-పడుచు పెళ్లాలు

రచన: వసుంధర

## కీర్తి కిరీటం

రచన: అజీజ్

## నేరాలు-శిక్షలు

రచన: టెంపోరావ్

## పులివేట

రచన: బి. రాజేశ్వరి

విషసర్పాలు - ఎనిమిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—118
అక్టోబర్, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ముసలి మొగుళ్లు—

# పడుచు పెళ్లాలు

వసుంధర

సోంబాబు మంచంమీద నడ్డి వాల్చేసరికి కళ్ళు మూసుకు పోయాయి. లోపల్నుంచి మరచెంబుతో నీళ్ళు తెచ్చిన అతడి భార్య చంప చెంబును బల్లమీద పెట్టి భర్తను చేత్తో కుదుపుతూ—"ఏమండీ—అప్పుడే అంత మొద్దు నిద్దరేంటండీ—" అంది.

సోంబాబు విసుగ్గా—"అబ్బ—నన్ను పడుకోనీ—" అన్నాడు.

"కర్మ—ముసలి మొగుణ్ని కట్టుకున్నాక తప్పుతుందా? కాస్త పక్కకైనా జరగండి—" అంది చంప.

ముసలి మొగుడు అన్నమాట వినగానే సోంబాబు మత్తు వదిలిపోయింది. అతడు చటుక్కున లేచి కూర్చుని "యాభై ఏళ్ళకే నేను ముసలివాణ్ణయిపోయానా? మా ఆఫీసులో అడుగు నా సంగతి—పాతికేళ్ళ కుర్రాళ్ళ

కంటె చలాకీగా పనిచేస్తాను—" అన్నాడు.

"మరి ఇంట్లో అలా వుండరేం?" అంది చంప.

"ఇంట్లోనా — ఇంట్లో ఏమగాదైనా ఇలాగే వుంటాడు...."

"నాకు మాత్రం మీ రిలాగుండడం నచ్చలేదు—మీ కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తూంటే మీరు వచ్చి ప్రేమగా ఒక్క మాటైనా అనరు. పేపరు చూసు కుంటూరు. అరుగుమీద చేరి వాళ్ళతోనూ వీళ్ళతోనూ పనికిరాని కబుర్లు చెబుతారు. ఆ తర్వాత భోంచేయగానే పడక—ఆ పడుకున్నది మళ్ళీ తెల్లవారి ఏడయ్యేదాకా లేవరు. అసలు మీరు పెళ్ళెందుకు చేసుకున్నారండీ?" అంది చంప.

సోంబాబుకు తాను పెళ్ళెందుకు చేసుకున్నాడో తెలుసు. కానీ అది భార్యకు చెప్పుకోలేడు.

సరిగ్గా రెండు సంవత్సరాల క్రితం అతడి భార్య పోయింది. అతడికో కూతురు, కొడుకు. ఇద్దరికీ పెళ్ళిళ్ళయి పోయాయి. ఇద్దరూ దూరప్రాంతాల వున్నారు. తల్లి పోయినప్పుడు వాళ్ళిద్దరూ వచ్చి భోరున ఏడ్చారు. ఇద్దరూ కూడా తండ్రిని ఉద్యోగం మానేసి తమతో వచ్చి వుండమని అన్నారు.

కూతురు దగ్గర వుండకూడదని సోంబాబుకు తెలుసు. మనశ్శాంతికోసం అతడు ఓ రెండు నెలలు సెలవుపెట్టి కొడుకు దగ్గరకు వెళ్లాడు. అప్పుడే అతడికో పరమ సత్యం తెలిసింది.

సంసార జీవితం ప్రారంభించినాక కొడుకు తనకు పరాయివాడే అవుతాడు. తను డబ్బు యివ్వగలిగితేనే ఆ యింట్లో తనకు గౌరవం వుంటుంది.

కొడుకు, కోడలు, పిల్లలు ఓ గిరి గీసుకుని అందులో బ్రతుకుతున్నారు. వారి సంసారంలో సోంబాబు ఇమడ లేకపోయాడు. అతడు తన సెలవును తగ్గించేసుకుని తిరిగి తన ఊరు చేరుకున్నాడు. అప్పుడతడికి భార్య అవసరం తెలిసివచ్చింది.

ఆ యింట్లో తనకెప్పుడూ లోటు జరుగలేదు. తన కెప్పుడేం కావాలో అన్నీ అడక్కుండానే అమర్చి పెట్టేది భార్య. ఆ యింట్లో మసలుతూంటే అనుక్షణం భార్యలేని లోటు ఫీలవుతున్నాడతడు.

ఈలోగా బంధువుల ఒత్తిడి ప్రారంభ మయింది రెండో పెళ్ళి చేసుకోమని. మొదట్లో ప్రతిఘటించాడు సోంబాబు.

ఒనాయనకు పాతిక్కిపైనా ముప్పైకు లోపూవుండే కూతురుంది. ఆమె చక్కని చుక్కే గానీ డబ్బులేక పెళ్ళికావడంలేదు. ఆమె పేరు చంప. చంప చెల్లెలిని యెవడో ప్రేమించాడు. అక్క పెళ్ళికోసం ఆమెదీ ఆగి పోవలసి వచ్చింది. చంప తండ్రి సోంబాబు చుట్టూ తిరగ సాగాడు. సోంబాబు శాస్త్ర మెత్తబడి అమ్మాయి అభి ప్రాయం అడగాలి అన్నాడు.

సోంబాబు, చంప ఏకాంతంలో మాట్లాడుకున్నారు. అప్పుడు చంప తొలిచూపులోనే సోంబాబును ప్రేమిం చేశానని చెప్పింది. అతడి వయసు యాభైకి ఒకటి తక్కువంటే నమ్మలేనంది. అయినా అంతకంటే ఎక్కువ వయసులో ధర్మేంద్ర హేమమాలినిని చేసుకున్నాడంది. ఆమె మాటలు సోంబాబుకు బాగా నచ్చాయి.

అన్నింటికీ కిమించి సోంబాబు ఎదురింట్లో ప్రకాశరావు వుంటున్నాడు. ఆయన కిప్పుడు యాభై అయి రేండ్లు. ఏడాది

క్రితం ఆయన మూడో పెళ్ళి చేసుకున్నాడు. ఆయన మూడో భార్య చంపకన్న చిన్నది. ఆయన చూపులకు తనకంటె పెద్దవాడిలా గుంటాడు. ఆయనకున్నదీ తనకు లేనిదీ డబ్బు మాత్రమే! ఏడాదిగా చూస్తున్నాడు—వారి సంసారం ఎంతో అన్యోన్యంగా వుంటున్నది.

మొత్తంమీద సోంబాబు చంపను పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళిచేసుకున్నాక తప్పుచేశానన్న భావం కలిగి ఓ ఏడాది పాటు చంపను అన్నివిధాలా సుఖపెట్టాలని ప్రయత్నించాడు సోంబాబు. అప్పుడు సోంబాబు రెండు విషయాలు గ్రహించాడు.

ఏటికి ఎదురీదడం కష్టం. నిండు యవ్వనంలో వున్న చంపకు శారీరకంగా పరిపూర్ణ తృప్తి కలిగించడం తన వల్లకాదు. ఇది మొదటిది. రెండవదేమిటంటే తనేమీ తప్పుచేయలేదు. పెళ్ళిచేసుకోవడంద్వారా చంపకు కన్నె చెర తొలగించాడు. అందుకామె తనపట్ల కృతజ్ఞతా భావం కూడా కలిగివుంది.

చంప అతడిని ఎప్పుడూ ఏమీ అనేదికాదు. తన అశక్తత తెలిసేక సోంబాబును ఉదాసీన భావం ఆవహించింది. ఆమెను వివాహమాడిన రెండు సంవత్సరాలకే మానసిక వ్యథో మరేకారణమో తెలియదుకానీ ఆయన జుత్తు ఒక్కసారిగా తెల్లబడిపోయింది.

"మీరు జుత్తుకు నల్లరంగు వేసుకోండి—" అంది చంప.

"నా వయసు తెలిసే నన్ను పెళ్ళిచేసుకున్నావు. అదింకా దాచడమెందుకూ?" అన్నాడు సోంబాబు.

"రామారావూ, నాగేశ్వర్రావూ అరవై ఏళ్లొచ్చినా పడుచు వేషాలేస్తున్నారు. ప్రజలకు వాళ్ళ

వయసు తెలుసుగదా అని మేకప్ మానేస్తున్నారా? శ్రీదేవి, జయసుధల పక్కన జోడుగా కనబడడంకోసం తగిన మేకప్ చేసుకుంటున్నారు. మీరూ అలాగే నా పక్కన నా భర్తగా కనబడడంకోసం జుత్తుకు రంగేసు కోవాలి. లేకపోతే అందరూ మనని భార్యాభర్తలను కోరు. మనని చూసినవారందరూ ఆ జంట బాగున్నదని అనుకోవాలి—" అన్నది చంప.

ఈ మాట సోంబాబుకు నచ్చింది. అయినప్పటికీ— "చూడు జుత్తు రంగువేసుకుంటే మాత్రం నా వయసు దాగుతుందా?" అన్నాడు.

"ఎందుకు దాగదు?" అని చంప అతడికంక ఆదోలా చూసి "అసలు మిమ్మల్ని చూడగానే నాకేమనిపిస్తుందో తెలుసా?" అన్నది.

"చెప్పు!"

"నన్నేడిపించడంకోసం మీరు జుత్తుకు తెల్లరంగు వేసుకున్నారని!"

ఈ మాటకు సోంబాబు ఉబ్బిపోయాడు. అయితే అతడికి జుత్తుకు రంగువేసుకోవడమంటే భయం. అలా చేయడంవల్ల క్యాన్సర్ వచ్చే అవకాశ మున్నదని ఎవరో అన్నారు. ఈ మాట పైకి అని భార్యకు చెప్పడం అతడి కిష్టంలేదు. అందుకని—"నీకు నా ముసలిరూపు నచ్చడం లేదు. ప్రేమకు బాహ్యరూపంతో నిమిత్తంలేదు. ప్రేమ మానసికం. ఉదాహరణకు ఎదురింటి ప్రకాశరావుగారి భార్య చూడు—" అన్నాడు సోంబాబు.

"ఎవరూ ఆ కోమలి సంగతేనా మీరు, చెప్పేది!" అన్నది చంప.

"ఆవిడ పేరు కోమలా? ఆ విషయం నాకు తెలియదు"

అన్నాడు సోంబాబు. ఆ వీధిలోని అందరి ఆడవాళ్ళ పేర్లూ అతడికి తెలుసును. అయినా తెలియదనడం ద్వారా భార్య మనసును కొంత సంతోష పెట్టగలనని అతడను కుంటాడు.

చంపకూ ఆ కోమలి విషయం ఆశ్చర్యంగానే వున్నది. ఆ భార్యాభర్తలిద్దరూ యెప్పుడూ యెంతో అన్యోన్యంగా వుంటారు. చూడ్డానికి కోమలి మరీ చిన్నపిల్లలా ఆ ముసలాయనకు మనుమరాలిలా వుంటుంది. కానీ కోమలి ఆయనవంక ప్రణయపూర్వకమైన ఆరాధనాభావంతో చూస్తుంది. ఆయన ఏదైనా మాటంటే సిగ్గుపడిపోతుంది. ఆ సిగ్గు సిగ్గుకే అందాన్నిస్తుంది.

కోమలి ఎప్పుడూ ఖరీదైన బట్టలు కేస్తుంది. మెడలో నగ లుంటాయి. ఆమెను చూడగానే గొప్పింటి మనిషని తెలిసిపోతుంది. ఆ డబ్బు, హోదాకోసం ఆమె ప్రకాశ రావుపట్ల అంతటి ప్రేమను నటిస్తున్నదా?

"మనకు వాళ్ళ విషయం వద్దు. మీరు మాత్రం ముసలి మొగుడిలావుంటే నాకు నచ్చదు—" అన్నది చంప.

ఆమె ప్రోత్సాహం అతడిమీద ఎక్కువగా పనిచేసేది కాదు. ముసలి మొగుడంటేమాత్రం అతడు కాస్త ఉడుక్కుంటాడు.

ఇప్పుడు చంప—"మీరు పెళ్ళెందుకు చేసుకున్నా రండీ?" అనడిగింది. అందుకు ఓ కొత్త జవాబు ఇవ్వాలను కున్నాడు సోంబాబు.

"ఆ ప్రకాశరావెందుకు చేసుకున్నాడో నేనూ అందుకే!"

చంప భర్తవంక చురుగ్గా చూసి—"ఇందుకు మాత్రం నేనొప్పుకోను. ఆ ప్రకాశరావుకూ మీకూ పోలికలేదు—".

అన్నది.

సోంబాబు ఉలిక్కిపడి—"ఎందుకని?" అన్నాడు.

"ఆయనకు డబ్బున్నది. డబ్బుతో కొనలేనిదేమున్నది ఈ రోజుల్లో!"

సోంబాబు చిరాగ్గా — "డబ్బుతో యేమైనా కొన వచ్చునేమోగానీ — పోయిన యౌవనాన్ని కొనలేదు కదా—" అన్నాడు.

"ఎందుకు కొనలేదు? ఆయ నిప్పుడదే చేస్తున్నాడు."

"అంటే?" అన్నాడు సోంబాబు ఆశ్చర్యంగా.

"కొద్ది మాసాల్లో ప్రకాశరావుగారి రూపురేఖలు పూర్తిగా మారిపోతాయి. ఆయన పాతికేళ్ళ యువకుడిగా తయారవుతాడు. అందుగురించి ఆయన లక్ష రూపాయలు వెచ్చిస్తున్నాడు. మీరాపని చేయగలరా?"

"యాభై అయిదేళ్ళ మనిషి ఇరవై అయిదేళ్ళ మనిషిగా మారడమా—ఇది నమ్మదగిన విషయమేనా?" అన్నాడు సోంబాబు.

"ఏమో—ఈ విషయం నాకా కోమలి చెప్పింది—" అన్నది చంప.

## 2

"మీరు మీరేనా?" అంది కోమలి సిగ్గుపడుతూ.

"ఏం?" అన్నాడు ప్రకాశరావు.

"మరీ అంతబలంగా కౌగలించుకుంటే నా వళ్ళు హూనమైపోయింది—" అన్నది కోమలి ఇంకా సిగ్గు పడుతూనే.

ప్రకాశరావు గర్వంగా భార్యవంక చూసి—"నిజంగా నీ వళ్ళు హూనమైపోయిందా?" అన్నాడు.

"అవును—ఏం?" అంది కోమలి.

"నాకు ఏమీ విశేషమనిపించలేదు. ఎప్పటిలాగా మామూలుగానే దగ్గరగా తీసుకున్నాను. అంతే!" అన్నాడు ప్రకాశరావు.

కోమలి ఆశ్చర్యంతో కళ్ళు రెపరెపలాడించి-"అయితే మరి మీ చేతుల్లోకి అంతటి బలం ఎలా వచ్చిందండీ!" అంది.

"నిన్న రాత్రి ఆ మందు వేసుకున్నాను-" అన్నాడు ప్రకాశరావు.

"అంటే ఆ మందు పనిచేస్తున్నదన్నమాట...." అన్నది కోమలి.

ప్రకాశరావు కళ్ళలో ఓ వింత మెరుపు మెరిసింది— "కోమలీ! ఓసారి అద్దం ఇలా పట్రా—" అన్నాడు.

కోమలి వెంటనే లోపలకు వెళ్ళి అద్దం తెచ్చింది.

ప్రకాశరావు తన ముఖాన్ని అద్దంలో చూసుకుంటూ మళ్ళీ నిరుత్సాహపడ్డాడు—"కోమలీ! నా ముఖం నాకు యెప్పటిలాగానే కనబడుతున్నది—"

కోమలి ఆయనవంకనే చూస్తూ—"అలా దిగులు పడతారేమండీ—ముందు శరీర బలం గురించి చూసుకోండి. సదానంథం యింకా మీకు హార్మోన్ ట్రీట్ మెంట్ ప్రారంభించలేదుగదా—మీ శరీరంలో భౌతిక మార్పులు అప్పుడే కదా కనబడతాయి—" అన్నది.

ప్రకాశరావు ఎదురుగా బల్లమీద వున్న ఆల్బంతీసి తెరిచి—"నేను మళ్ళీ నిజంగా ఇలాగే అవుతానన్న నమ్మకం నాకు కలగడంలేదు—" అన్నాడు.

కోమలి ఆయన్ను సమీపించి వెనుకనుంచీ ఆయన భుజాలమీదుగా చేతులు సాచి ఫోటోను చూస్తూ— "ఇప్పటికీ మీరు నాకు అంత అందంగానూ కనిపిస్తు

న్నారు. మీరెందుకు దిగులుపడతారో నాకు తెలియదు-"
అన్నది.

"నువ్వు చాలా మంచిదానివి కోమలీ! అందుకే నీ
కోసమే నేనీ నిర్ణయం తీసుకున్నాను. సదానందం నాకు
మాట ఇచ్చాడు. ఇది నేను పాతికేళ్ళప్పుడు తీయించు
కున్నప్పటి ఫోటో! నా రూపం మొత్తం ఇలా మారిపో
తుందంటున్నాడతను. అదే జరిగితే నా అంత అదృష్ట
వంతుడీ ప్రపంచంలో వుండడు—" అన్నాడు ప్రకాశ
రావు.

"అదృష్టం మీదికాదు—నాది!" అన్నది కోమలి.

ప్రకాశరావు ఆల్బంలోంచి ఫోటో బయటకు తీసి
పదేపదే దానికంక చూసుకుంటూ—"ఆ రోజుల్లో ఆడ
పిల్లలు చాలామంది నన్ను కల్లో వేసుకోవాలనీ, నన్ను
మంచి చేసుకోవాలనీ చూస్తూందేవారు. యౌవనం ఇంత
అశాశ్వతమైనదని అప్పట్లో నాకు తెలియక మహా గర్వ
పడుతుందేవాణ్ని—" అన్నాడు.

ఫోటోలో ప్రకాశరావు సినీ హీరోలా వున్నాడు.
ముఖంలో చెరగని చిరునవ్వు వున్నది. నిజం చెప్పాలంటే
ఫోటోలో ప్రకాశరావుకూ ఈ ప్రకాశరావుకూ పోలికలే
లేవనిపిస్తాయి.

"యౌవనం అశాశ్వతమైనది కాదని సదానందం
అంటున్నాడు. మనిషికి ఆయువును పొడిగించలేముకానీ
యౌవనం పొడిగించడం అసాధ్యంకాదని అతడంటు
న్నాడు. చూద్దాం — ఏం జరుగుతుందో!" అన్నది
కోమలి.

ప్రకాశరావు ఫోటోనూ, ఆల్బంనూ బల్లమీద పెట్టి
మళ్ళీ కోమలిని దగ్గరగా లాక్కున్నాడు. కోమలి విడి

పించుకుందుకు ప్రయత్నిస్తూ—"ఇలా మీరు మీ బలాన్ని నామీద ప్రదర్శించాలనుకుంటే—మిమ్మల్నామందు వేసు కోనివ్వను—" అన్నది.

ప్రకాశరావు ఆశ్చర్యపోతూ ఒకసారి తన చేతుల వంక చూసుకుని—"నిజంగా ఈ చేతుల కిప్పుడంత బలం వచ్చిందా?" అని మనసులో అనుకున్నాడు.

# 3

"నువ్వు చెప్పింది మావారికి చెబితే నమ్మలేదు—" అన్నది చంప.

"మీవారికీ విషయం చెప్పొద్దన్నాగా — యెందుకు చెప్పావు?" అంది కోమలి చిరుకోపంతో.

"అనుకుంటాంకానీ రహస్యాల్ని భర్తనుంచి దాచడం ఆడదానికి వీలుకాదు. యేదో క్షణంలో చెప్పాలనిపిస్తుంది. నీ సంగతి చెప్పు. నువ్వు నీ భర్తనుంచి రహస్యాల్ని దాచగలవా?" అనడిగింది చంప.

కోమలి తడబడుతూ-"ఏమో-ఇంతవరకూ రహస్యాలే నాకెదురు కాలేదు—ఎలా చెప్పగలను?" అన్నది.

"అదిసరే—మా ఆయన చెప్పిందాంట్లో నాకు సబబు కనబడింది. ఆ సదానందం మీవారిని మోసం చేస్తున్నాడు. ఉత్త పుణ్యాన లక్షరూపాయలు నష్టపోవడం మంచిదికాదు. యెందుకైనా మంచిదని నిన్ను హెచ్చరిద్దామని వచ్చాను—" అన్నది చంప.

కోమలి నవ్వి.— "సదానందం సంగతి తెలిస్తే నువ్వీ మాట అనుందేదానివి కాదు—" అన్నది.

"పోనీ ఆ వివరాలు చెప్పకూడదూ!" అన్నది చంప.

"సదానందంగారికి ఐహిక సుఖాలమీద మోజులేదు. చిన్నతనంనుండీ విరాగిలా పెరిగాడు. కొంతకాలం

మహేష్ యోగివద్దకు వెళ్ళి యోగం కూడా నేర్చుకున్నాడు. అప్పుడే హిమాలయ ప్రాంతాల్లో సాధువు పరిచయమై అతడికి కాయకల్ప చికిత్స నేర్పాడు. కానీ అడ్డమైన వాళ్ళకీ ఆ చికిత్స చేయవద్దనీ — సత్కార్యం అనిపించి నప్పుడే అది చేయాలనీ సాధువు అతడికి చెప్పాడు. యోగాభ్యాసానికి వెళ్ళక పూర్వం సదానందానికి వైద్య శాస్త్రంలో కొంత ప్రవేశముంది. పేరున్న ఓ డాక్టరు వద్ద అతడు రెండు సంవత్సరాలు కంపౌండర్ గా పని చేశాడు. ఇటీవల అతడి తండ్రికి ఆర్థికంగా యేవో చిక్కులువచ్చి ఓ లక్షరూపాయలు అవసరం వచ్చాయి. అతడు నాకు చిన్నప్పట్నించీ తెలుసు. నేనంటే ఎంతో అభిమానం. అందువల్ల యిటు చిన్ననాటి స్నేహితురాలికి మేలుచేసినట్లూ వుంటుంది—అటు తన తండ్రికి సాయ పడినట్లూ వుంటుందని అభిప్రాయపడి అతడిందుకు పూనుకున్నాడు. అతడిలా అంగీకరించడంవల్లనే అసలు నేను ఆయన్ను వివాహం చేసుకున్నాను—" అన్నది కోమలి.

"అంటే?"

కోమలి తన కథను చెప్పింది.

ఇది సుమారు మూడు సంవత్సరాలనాటి మాట!

కోమలికి తలిదండ్రులులేరు. బంధువుల ఇంట హీనంగా బ్రతుకుతున్నది. సదానందానిది ఆమె పక్కిల్లు. అతడికీ ఆమె పరిస్థితి చూస్తే జాలి వుండేది. తనే విరాగి కనుక అయ్యుండకపోతే కోమలిని వివాహం చేసుకుని వుండే వాడినని అతననేవాడు. తను కాయకల్ప చికిత్స నేర్చుకుని వచ్చేక అతడు కోమలికి ధైర్యం చెప్పాడు. ఎందుకంటే కోమలి అందం కారణంగా బంధువుల యింట్లోని ఇద్దరమ్మాయిలకు పెళ్ళికావడం కష్టంగా వున్నది. త్వరగా

కోమలిని ఏ ముసలివాడికో కట్టబెట్టాలని వారు చూస్తు న్నారు. అలా వచ్చింది ప్రకాశరావు సంబంధం.

సదానందం కోమలిని ఓదార్చి ఈ పెళ్ళికి ఒప్పుకోమని చెప్పాడు. ఆమె ఒప్పుకోకపోయినా ఆ పెళ్ళి జరుగుతుంది. అందుకే తానీ సంబంధాన్ని ఒప్పుకున్నట్లు చెప్పింది.

ప్రకాశరావుకూ కోమలికీ పెళ్ళి అయిపోయింది.

ప్రకాశరావు ఆమెను తనవారిమధ్యకు తీసుకుని వెళ్ళ లేదు.

“ఈ వయసులో పెళ్ళిచేసుకున్నానంటే మా వాళ్ళు హర్షించరు. నా పిల్లలందరూ ఎదిగి వాళ్ళ వ్యవహారాలు వాళ్ళు చూసుకుంటున్నారు. వాళ్ళకు అప్పజెప్పేవన్నీ అప్పజెప్పేసి కొంత డబ్బు తెచ్చుకుని వాళ్ళతో తెగ తెంపులు చేసుకుని శాశ్వతంగా నీ దగ్గరకు వచ్చేస్తాను. మనమిద్దరం యెవరితోనూ నిమిత్తం లేకుండా స్వతంత్ర జీవనం చేయవచ్చు—” అన్నాడాయన.

కోమలి, ఆయన కలిసి ఊళ్ళో కాపురం పెట్టారు. వారానికి రెండు రోజులు ఆయన తనవారిమధ్యకు వెళ్ళి వస్తూండేవాడు. ఆరు నెలల్లో ఆయన సుమారు ఏదెనిమిది లక్షల క్యాషుతో కోమలివద్దకు వచ్చేశాడు.

అప్పుడు సదానందం ఆయన్ను కలుసుకున్నాడు. ప్రకాశరావు వైద్యానికి సిద్ధపడ్డాడు. ఆ ఊరినుంచి ఈ ఊరు మకాం మార్చడం జరిగింది.

“తన ఎత్తు ధనంపోసినా ఇంకెవరికీ సదానందం కాయకల్ప చికిత్స చేయడు—” అన్నది కోమలి.

చంప ఆశ్చర్యంగా “నువ్వు నమ్ముతున్నావా—నీ భర్త తిరిగి యువకుడిలా మారగలడంటే—” అన్నది.

"రూపం మారకపోయినా—అప్పుడే కొన్ని మందుల ప్రభావం ఆయనపై కనిపిస్తున్నది. నావద్ద ఆయన యువకులకంటే ఉత్సాహంగా వుంటున్నాడు—"

"అలా ఎలా చెప్పగలవు? యువకులెంత ఉత్సాహంగా వుంటారో నీకేమీ అనుభవం లేదుగదా!" అన్నది చంప.

"మందు వేసుకున్న తర్వాత ఆయనలో వచ్చిన మార్పునుబట్టి నేనూహించాను—" అన్నది కోమలి. కానీ ఆమె తడబడుతూ—"నువ్వనేదాకా నాకు స్ఫురించనే లేదు. ఆడవాళ్ళ మాటలను చాలా జాగ్రత్తగా తూచి తూచి వాడాలి. ఆయనలో వచ్చిన మార్పు గురించి నీతో అన్నట్లే ఆయనతో అన్నాను. అదృష్టంకొద్దీ ఆయన నీకులా అడగలేదు. అలా అడిగితే సిగ్గులో నా కళ్ళు చచ్చిపోతుంది—" అని కూడా అన్నది.

"మొత్తంమీద మీ కథ విచిత్రంగా వున్నది—" అన్నది చంప.

కోమలి లేచివెళ్ళి ఓ ఫోటో తీసుకుని వచ్చి—"ఆయన ఇలా మారిపోతే ఇంకా విచిత్రంగా వుంటుంది కదూ—" అన్నది.

చంప ఆశ్చర్యంగా—"వయసు మనుషుల రూపాన్ని ఎంత దారుణంగా మార్చేస్తుంది? ఈ ఫోటోలోని మనిషి ఒకనాటి మీవారంటే నమ్మడం చాలా కష్టం—" అన్నది.

"రోజూ చూస్తున్న నాకే నమ్మకం కుదరదు. నువ్వలాగనడంలో ఆశ్చర్యమేముంది? అయితే నాకు తెలిసినవాళ్ళలో ఒకరిద్దరు వయసులో పూర్తిగా మారి పోవడం నాకు బాగా తెలుసు—" అన్నది కోమలి.

"మీ ఆయనలో మార్పు తెచ్చిన మందు కాస్త నాక్కూడా ఇవ్వకూడదూ—యువకుల ప్రవర్తన ఎలా వుంటుందో తెలుసుకుంటాను—" అన్నది చంప.

కోమలి ఓ క్షణం ఆలోచించి నెమ్మదిగా లోపలికి వెళ్ళింది. తర్వాత ఆమె గోలికాయంత మాత్రతో తిరిగి వచ్చింది. అది చంపకు ఇస్తూ—"దీని ప్రభావం అమోఘమైనది. అయితే మీవారికోసం బలమైన ఆహారం తయారు చేసి వుంచు. లేనిపక్షంలో నీరసించిపోతాడు—" అన్నది కోమలి.

బలమైన ఆహారం విషయంలో కూడా కోమలి సలహా తీసుకున్నది చంప. ఆమె వెళ్ళేటప్పుడు—"రేపు మళ్ళీ వచ్చి మరో మాత్ర కావాలంటావు నువ్వు. నాకు తెలుసు. కానీ అది సాధ్యపడదు. లక్షరూపాయల వైద్యంలోని ఓ భాగమిది. నీమీద అభిమానంకొద్దీ ఈ మాత్ర ఇవ్వడమే నేను చేసిన తప్పు అని నేననుకో కూడదు. అందుకని ఇంక అడక్కు—" అన్నది కోమలి.

## 4

సాయంత్రం భర్త రాగానే ఆ విషయం అతడికి చెబుదామనుకున్నది చంప. కానీ అంతలోనే ఆమె ఆలోచన మారిపోయింది.

ముందుగా చెబితే భర్త ఆ మాత్ర వేసుకోనకపోవచ్చు. ఆయనకు అసలే కోమలి అంటే సదభిప్రాయం తగ్గింది—ముసలి భర్తను పడుచువాడిగా మార్చాలనుకోవడం పతివ్రతా లక్షణం కాదుట. భర్త ఎలా వుంటే అలాగే ప్రేమించి—అతడలాగే వుండాలని కోరుకోవాలంటాడు సోంబాబు.

ఇది ఒక కారణం. రెండవదేమిటంటే అటువంటి

మాత్ర ఒకటి వేసుకుంటున్నట్లు భర్తకు తెలియకూడదు. తెలిస్తే రెండువిధాల జరుగవచ్చు. ప్రకాశరావుమీద పనిచేసిన మందు తనమీద పనిచేయదా అని భర్త లేని శక్తిని ప్రదర్శించవచ్చును. ప్రకాశరావుకు కొత్తగా కలిగిన శక్తి ఏమీ లేదనీ అది కోమలి కల్పన అనీ చెప్పడం కోసం భర్త ఆ మందు ప్రభావాన్ని నొక్కి పెట్టవచ్చును.

భర్తకు చెప్పకుండానే ఆ మందు ఇవ్వాలని నిర్ణయించుకున్నది చంప. యెన్నడూ లేనిది ఆమె భర్తకోసం ఆ రోజు సాయంత్రం ఉప్మా టిఫిన్ చేసింది. ఉప్మాలో జీడిపప్పు, వేరుశనగ గుళ్ళు కూడా వేసింది. కోమలి చెప్పినవిధంగా బాదంహల్వా చేసింది. ఆ తర్వాత భర్త కోసం యెదురుచూస్తూ కూర్చున్నదామె.

సోంబాబు మామూలుగా ఆఫీసునుంచి వచ్చి మామూలుగా లేని ఇంటి పరిస్థితి చూసి కాస్త కంగారుపడ్డాడు.

"ఇవన్నీ ఏమిటీ?" అన్నాడతను.

"మీకోసం ఉప్మా చేశాను. మొదటి ముద్ద నేనే తినిపిస్తాను—" అన్నది చంప. మొదటి ముద్దలో ఆమె కోమలి ఇచ్చిన మాత్రను వుంచింది.

ఇదంతా దేనికి దారితీస్తుందోనని భయపడుతూనే సోంబాబు ఉప్మా తిన్నాడు. ఆపైన బాదంహల్వా పుచ్చుకున్నాడు. తర్వాత మామూలుగా పేపరుతీశాడు. చంప అతడేం చేస్తాడోనని ఓరకంట చూస్తున్నది.

సోంబాబు కాసేపు శ్రద్ధగానే పేపరు చదివాడు. చదువుతూ చదువుతూ మధ్యలో ఓసారి భార్యవంక చూశాడు. అప్పుడు చంప పత్రిక చూస్తున్నది. ఆమె పైట జారి ఉన్నది. ఆ యింట్లో అది సహజమైన దృశ్య

మేమీ కాదు.

సోంబాబు ఓసారి చంపవంక చూసి మళ్ళీ పేపరు వంక చూశాడు. పేపర్లో అతడి దృష్టి వార్తలమీదకు వెళ్ళలేదు. ఏదో బ్రాసియర్ కంపెనీ అడ్వర్టయిజ్ మెంట్! చక్కని అంగసౌష్టవంగల వనిత బ్రా ధరి స్తున్నది!

సోంబాబు మళ్ళీ భార్యవంక చూశాడు. చూపుల నతడు మరల్చుకోలేక పేపరును మడిచి లేచాడు. నెమ్మ దిగా చంపను సమీపించాడు.

చంపకు జరుగుతున్నదంతా తెలుసు. కానీ తెలియనట్లే ఆమె పత్రికవంకే చూస్తున్నది. అతడామె భుజంమీద చేయి వేశాడు.

ఉలిక్కిపడినట్లు లేచిందామె.

అంతే! అంతవరకూ తానెరుగని బిగి కౌగిలి....

చంప ఆశ్చర్యపోయింది....

సోంబాబు కనులలో కాంతి.... చేతుల్లో బలం....

ఈ మార్పు ఒక్క క్షణంలో వచ్చింది. ఇదంతా ఆ మందు ప్రభావమే?

ఆ రోజు చంపకు కలిగిన సంతోషమింతా అంతా కాదు.

రాత్రి యొనిమిది గంటలకు సోంబాబు—"చంపా! భరించలేని నీరసం. ఆకలి విపరీతంగా వేస్తున్నది...." అన్నాడు.

సాయంత్రం టిఫిను తింటే రాత్రికి భోం చేయలేదు సోంబాబు. అతడికి భోజన పుష్టిలేదు, యెక్కువతింటే హారాయించుకునే శక్తిలేదు.

సాయంత్రం బీడిపప్పు ఉప్మాతిని మళ్ళీ కాసేపటి

లోనే ఆకలి అంటున్నాడు. ఇదంతా మందు ప్రభావ మేనా?

"భోజనం సిద్ధంగా వున్నది...." అన్నది చంప.

ఆమె చేసిన ఏర్పాట్లు చూసి ఆశ్చర్యపోయాడు. అయితే ఆమెను ప్రశ్నించే ఓపిక లేదతడికి. వద్ర సోపేతంగా వడ్డించబడిన — భోజనాన్ని అతడు ఆవు రావురుమంటూ తిన్నాడు.

రాత్రి ఇద్దరూ నిద్రకుపడ్డారు. సోంబాబుకు మళ్ళీ గాఢమైన కాంక్ష కలిగింది. తనలో యేం మార్పు వచ్చిందో, తనకేమయిందోనని అతడాలోచించడంలేదు. ఆ మార్పు అతడికీ, భార్యకూ సంతోషంగానే వున్నది.

ఆ రాత్రి భార్యాభర్తలిద్దరకూ కూడా కళ్ళు తెలియని నిద్రపట్టేసింది. మర్నాడుదయం యెనిమిదిదాకా ఇద్దరకూ మెలకువ రాలేదు.

అప్పుడైనా మెలకువ రాకపోయేది.

పాలవాడు తలుపుతట్టి విసిగిపోయి పక్కవాళ్ళింట్లో పాలుపోసి వెళ్ళాడు.

పక్కవాళ్ళు కూడా కాసేపు చూసి చూసి—యెనిమిదయ్యాక తలుపు తట్టారు.

అప్పుడైనా చంపకే మెలకువ వచ్చింది. సోంబాబు ఇంకా కళ్ళు తెలియకుండా నిద్రపోతున్నాడు. చంప లేచివెళ్ళి పాలు తీసుకుంది.

"ఏమిటమ్మా విశేషం—యెప్పుడూ లేనిది—ఇంతసేపు నిద్రపోయారు?" అన్నది పక్కింటావిడ. యెన్నడూలేనిది చంప ఆ మాటలకు సిగ్గుపడింది.

చంప త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకుని కాఫీకి నీళ్ళుపడేసి భర్తను లేపింది. సోంబాబుకు మత్తు వదల

డానికి చాలా సేపు పట్టింది. లేచాక అతడు టైము చూసుకుని కంగారుపడి త్వరత్వరగా తెమిలిపోయాడు.

అతడు స్నానంచేసి రాగానే భార్య అతడికి కాఫీ అందించింది.

కాఫీ అందుకుంటూ భార్య ముఖంలోకి చూసి ఉలిక్కిపడ్డాడు సోంబాబు. ఆమె కళ్ళలో అంతకాలం తాను చూసి ఎరుగని మెరుపు వున్నది.

ఆ మెరుపు అతణ్ని గతంలోకి పంపింది.

నిన్న తనకు ఏమయింది?

తనకు ఏమైనప్పటికీ అందు గురించి ఎంతో కొంత భార్యకు తెలుసు. ఇంటికి రాగానే టిఫిను, బాదం హల్వా! రాత్రికి విందు భోజనం ...

తను అలా ప్రవర్తిస్తాడని ఆమెకు తెలుసా?

"చంపా!" అన్నాడతను.

"ఊఁ" అన్నదామె.

"నిన్న నువ్వు నాకోసం చాలా ఏర్పాట్లు చేశావు. విశేషమేమిటి?"

చంప మాట్లాడలేదు. విశేషమేమిటని చెబుతుంది?

"కారణం చెప్పాలి!" అన్నాడు సోంబాబు.

"నా విషయం నేను చెబుతాను. మరి మీ విషయం మీరు చెబుతారా?"

"నా విషయమంటే?"

చంప నవ్వి—"నిన్న మీరు మీరేనా?" అన్నది. అలా అన్నాక ఆమె సిగ్గుతో ముఖం కప్పుకున్నది.

ఆమె సిగ్గును చూస్తే సోంబాబుకు ముచ్చటేసింది. ఈ వయసులో భార్యను తెచ్చుకుని తాను పొరపాటు చేశాడా అని అప్పుడతడికి అనిపించింది. కానీ—నిన్న

తనకు జరిగిన ఏర్పాట్లు ఏదో కారణంగా జరిగాయి. ఆ కారణం చంపకు తెలుసు.

అతడు నొక్కించాడు. ఆమె నిజం చెప్పేసింది.

సోంబాబు ఉలిక్కిపడ్డాడు.

ఇది నిజమా? ఇది సాధ్యమా?

డబ్బుతో పోయిన యౌవనం దొరుకుతుందా?

సోంబాబు భార్యను దగ్గరగా తీసుకుని—"చంపా—నీకు చాలా చాలా థాంక్స్! నేనూ ఓసారి ఆ సదానందంతో మాట్లాడా లనుకుంటున్నాను. ఆ మందులో ఇంత ప్రభావమున్నదని తెలిసింది కాబట్టి— నేను నా శక్తినంతా ధారపోసి అయినా యెలాగో అలా అవసరమైన డబ్బు సంపాదిస్తాను. ఆ ప్రకాశరావు భార్యనడిగి నాకూ సదానందం చేత వైద్యం జరిగే ఏర్పాట్లు చేయించు—" అన్నాడు.

## 5

"ఈ విషయం నీ భర్త కెందుకు చెప్పావు?" అన్నది కోమలి చిరాగ్గా.

"ఆయనకు చెప్పకుండా ఎలా వుండగలను?" అన్నది చంప దీనంగా.

"చెబితే చెప్పావుగానీ సదానందం గురించి మీరింకేమీ ఆశలు పెట్టుకోకండి. నేను ముందే చెప్పాను. తన కాయకల్ప చికిత్స గురించి ప్రచారం జరగడానికి సదానందం ఒప్పుకోడు. అతడా విద్యను డబ్బు గడించడంకోసం నేర్చుకోలేదు. ఈయనకు వైద్యం చేశాక అతడు తిరిగి హిమాలయాలకు వెళ్ళిపోవాలనుకుంటున్నాడు...." అన్నది కోమలి.

"ఈ విషయంలో ఆయన చాలా పట్టుదలగా వున్నారు.

ఎంత డబ్బయినా సాధించి తేగలనన్నారు. నువ్వు నాకు సాయం చెయ్యాలి—" అన్నది చంప.

కోమలి మెత్తబడలేదు. కాయకల్ప చికిత్స గురించి తప్ప మరే విషయంలోనైనా అడిగితే తను సాయపడ గలనని చెప్పిందామె.

"పోనీ — నిన్న నువ్విచ్చిన మాత్రలు మరికొన్ని ఇప్పించు—" అన్నది చంప.

"ఆ మాత్రల నీ విధంగా మధ్యాంతరంగా వాడడం నీ భర్తకు ప్రాణప్రమాదం. మనిషి వారం రోజుల్లో పూర్తిగా నీరసించిపోతాడు. అయినా ఆ మాత్రలు నేను నీకివ్వలేను. నా భర్తకు ఎన్నో విధాల వైద్యా జరుగుతున్నది. అందులోని ఒక భాగం మాత్రమే ఈ మాత్రలు — అందువల్ల నువ్వీ విషయం గురించి ఇంక నన్నడక్కు. అది నీకూ నాకూ మంచిదికాదు—" అన్నది కోమలి.

చంప నిరుత్సాహపడింది.

"రేపట్నించి నువ్వు మా ఇంటికి కూడా రాకూడదు. ఎందుకంటే ఆయనింక బయటకు వెళ్ళరు. కాయకల్ప చికిత్సలో చివరిభాగం రేపట్నించే ప్రారంభంకానున్నది. ఆ తర్వాత రెండు మాసాల్లో ఆ ఫోటోలో మనిషిలాగై పోతారు—" అన్నది కోమలి.

చంప ఆదోలా కోమలివంక చూసి—"నీకు నీ భర్త ఇప్పటిలాగుంటే నచ్చలేదా?" అనడిగింది.

"ఎందుకు నచ్చలేదు? వివాహానికి ముందైతే అంత నచ్చలేదు. ఇప్పుడాయన మంచి మనసు తెలిసాక ఆయన కోసం నా ప్రాణాలైనా అర్పించే విధంగా ప్రేమి స్తున్నాను. అయితే మా జంట ఇలాగుండడం ఆయనకే

నచ్చలేదు. రూపం మార్పు విషయంలో పట్టుదల ఆయనదే!" అన్నది కోమలి.

"అదృష్టవంతురాలివి...." అన్నది చంప. ఆ తర్వాత ఆమె అక్కడ ఎంతోసేపు వుండలేదు. నిరుత్సాహంగా వెనక్కుతిరిగి వెళ్ళింది.

ఆ వీధిలో చంప వయసువాళ్ళు చాలామంది వున్నారు. కానీ కోమలితో తప్ప ఆమెకు ఇంకెవరితోనూ స్నేహంలేదు. ఎందుకంటే ముసలి మొగుళ్ళు వున్నది వీరిద్దరికే!

భర్త వచ్చేవరకూ చంప దిగులుగా ఇంట్లో కూర్చుని వున్నది.

జీవితంలో తానేమి పోగొట్టుకున్నదో ఆమెకిప్పుడు అర్థమయింది.

శారీరక సౌఖ్యం స్త్రీకి మరీ అంత ముఖ్యంకాదు. సోంబాబు మానసికంగా కూడా ముసలివాడు. అతడామెను భార్యలాకాక కూతురిలా చూస్తాడు. కోలా ఆప్యాయంగా పలకరించి చిలిపిగా నాలుగు మాటలాడి తను స్త్రీ అన్న విషయాన్ని మాటల్లో పదే పదే గుర్తుతెస్తూ—అప్పుడప్పుడు కాస్త దగ్గరగా తీసుకుంటూంటే చాలు!

అసలతడికా ధ్యాసే వుండదు. తన పనులు తను చేసుకుని పోవడమే! శారీరకంగా అవసరమనిపించినపుడు తప్ప అతడు భార్యను భార్యగా చూడలేదు.

నిన్నటి దినం సాయంత్రం నుండీ తనకు జరిగిన అనుభవాన్నామె మరువలేదు. ఆ అనుభవం శాశ్వతమయ్యే అవకాశం చేతికి చిక్కినట్లే చిక్కి మాయమయింది.

భర్త యింటికి రాగానే చంప జరిగిన విషయం

"డబ్బిచ్చినా వైద్యం చేయడన్నదా — ఇందులో ఏదో మోసం వుంది—" అన్నాడు సోంబాబు.

"అంటే?" అన్నది చంప.

"ముందు నేననుకున్నానూ — ఆ ముసలాయన మన దగ్గర్నుంచి డబ్బు గుంజడానికి ఏదో నాటకమాడుతున్నాడని అనుకున్నాను. కాయకల్ప చికిత్స గురించి మనకేదో నమ్మకం పుట్టించి ఆపైన మన దగ్గర్నుంచి వైద్యం పేరుమీద డబ్బు లాగవచ్చునని పథకం వేశాడనుకున్నాను. అయితే మనకు మనమే వెళ్ళి అడిగినా వైద్యం చేయనన్నాడు. ఏ వైద్యుడూ అలా ప్రవర్తించడు. ఈ కాయకల్ప చికిత్సలో ఏదో విశేషముంది. అది ప్రకాశరావుకు మాత్రమే యెందుకు పరిమితం కావాలి?" అన్నాడు సోంబాబు.

"మీరు తీసుకున్న ఒక్క మాత్ర ఎలా పనిచేసిందో చూసి కూడా మీరింకా ఆ వైద్యాన్ననుమానిస్తున్నారా?" అన్నది చంప.

"అవును. అదీ నిజమే!" అన్నాడు సోంబాబు.

భార్యాభర్తలిద్దరూ ఆలోచనలో పడ్డారు. ఎంత ఆలోచించినా వాళ్ళకీ విషయమై తలాతోకా అందదు.

3

ఒక వారంరోజులు చంప, కోమలి కలుసుకుని మాట్లాడుకోలేదు. అప్పుడప్పుడు చంప ఎదురింటివైపే చూస్తూండేది. కోమలి ఒక్కరోజు కూడా బయట కనబడలేదు. ఉండబట్టలేక ఒకరోజున చంప కోమలి ఇంటికి వెళ్ళింది.

తలుపులు ఓర వాకిలిగా వేసివుండడంవల్ల తట్టవలసిన అవసరం లేకపోయింది. చంప ఇంట్లో ప్రవేశించింది. అలికిడి ఏమీ వినిపించడంలేదు.

ఆమె పక్క గదిలోకి వెళ్ళింది. అక్కడ అందమైన మంచం. మంచంమీద ప్రకాశరావు. ఆయన మంచం మీద పడుకుని వున్నాడు.

ప్రకాశరావుని ఏదో దూరాన్నుంచి చూడడమేకానీ అంత దగ్గర్నుంచి చూడలేదామె! ప్రకాశరావు అలికిడికి కాబోలు చటుక్కున మూసి వున్న కళ్ళు తెరిచి—

"ఎవరూ?" అన్నాడు.

"కోమలి లేదాండీ?" అన్నది చంప.

ప్రకాశరావు ఆమెను గుర్తుపట్టాడు—"నువ్వు ఎదురింటామెవు కదూ!" అంటూ ఆయన చటుక్కున లేచి కూర్చున్నాడు.

"అవునండి—" అంది చంప వినయంగా. ఆమె కళ్ళు కోమలికోసం వెతుకుతూనే ఆయన్నూ గమనిస్తున్నాయి.

ప్రకాశరావు జుత్తు తెలుపు రంగునుండి వలుపురంగుకు మారుతున్నట్లుంది. కొద్దిరోజుల క్రితం ముగ్గు బుట్టలా వుండేది. ఇప్పుడలా లేదు.

"కోమలి బాత్రూంకి వెళ్ళింది—" అన్నాడు ప్రకాశరావు.

చంపకు ఏమనాలో తెలియక అలాగే నిలబడింది.

"ఒక్కసారిలా వస్తావా అమ్మా—" అన్నాడు ప్రకాశరావు.

అప్రయత్నంగా చంప ఆయన్ను సమీపించింది.

అప్పుడు ప్రకాశరావు కంఠంలో ఆతురత ధ్వనిం

చింది—"నాకో చిన్న ఉపకారం చేయాలి నువ్వు—" అన్నాడాయన.

చంప ఆశ్చర్యంగా—"నేనా?" అన్నది.

"అవును. నేనో ఉత్తరం ఇస్తాను. అది పోస్టుచేసి పెట్టాలి—"

చంప ఆశ్చర్యం ఇంకా పెరిగింది. ఆయన ఉత్తరం తను పోస్టు చెయ్యడమేమిటి? కోమలి ఏం చేస్తుంది?

"అవకాశం వస్తే వివరాలు మళ్ళీ చెబుతాను. ఈ ఉత్తరం నేను పోస్టుచేయించినట్లు కోమలికి కూడా తెలియకూడదు. ఇది వ్రాసి నాలుగురోజుల్నించి ఎవరైనా దొరుకుతారా అని ఎదురుచూస్తున్నాను. మంచానికున్న రహస్యపుటరలో పెట్టాను—" అంటూ ప్రకాశరావు తలగడను తొలగించబోతూండగా దూరంగా అడుగుల చప్పుడు వినబడింది.

ప్రకాశరావు కంగారుగా—"అది వస్తోంది. ఎలాగో దాన్ని మభ్యపెట్టి ఒక్కసారి నా దగ్గరకు వచ్చి ఆ ఉత్తరం తీసుకుని వెళ్ళి పోస్టు చెయ్యాలమ్మా!" అని నెమ్మదిగా అనేటంతలో కోమలి ఆ గదిలోకి ప్రవేశించింది.

కోమలి చంపను చూస్తూనే ఆశ్చర్యపడి—"నువ్వా?" అంది.

చంప ఏమీ మాట్లాడలేదు.

ఇద్దరూ పక్క హాల్లోకి వెళ్ళి చెరో కుర్చీలోనూ కూర్చున్నారు.

"నేనిక్కడికి రావద్దన్నానా? ఎందుకు వచ్చావు?" అన్నది కోమలి.

"నీతో కబుర్లు చెప్పడం అలవాటైపోయింది. వుండ

బట్టలేక ఇలా వచ్చేశాను. తీరా చూస్తే గదిలో ఆయనున్నారు. నా అడుగుల చప్పుడు విని పలకరించి—నువ్వు శాస్త్రులుగారింటకు వెళ్ళావనీ ఇప్పుడే వస్తావనీ అన్నారు. అంతలో నువ్వు వచ్చావు—" అన్నది చంప.

"అంతేనా—ఆయనింకేమీ మాట్లాడలేదా?" అన్నది కోమలి.

"ఏం—అలా అడిగావు?" అన్నది చంప.

"ఆయనమీద మందుల ప్రభావం విపరీతంగా వుంది. ఇది సామాన్యమైన వైద్యంకాదు. ఆయన శరీర చర్మాలన్నీ పాతికేళ్ళకు పైగా వెనక్కు పోతాయి. జుత్తు నల్లబడుతోంది. చర్మంలో ముడతలు పోతాయి. దంతాలు ఇగుళ్ళలో బిగుసుకుంటాయి. ఎముకలు గట్టిపడతాయి. కండరాల చలాకీతనం పెరుగుతుంది. చూపు మెరుగవుతుంది. శరీరంలోని నరనరాన్నీ తీసుకున్నట్లయితే ఒకటి కాదు.... రెండు కాదు....లక్షలకొద్దీ మార్పులు. ఈ రెండు నెలలూ ఆయన నరకం చూస్తాడని సదానందం అన్నాడు. కావాలని కోరి ఈ చికిత్సకు సిద్ధపడ్డారు. ఇప్పుడీయన ఒకరోజు తట్టుకోలేకపోతున్నారు. ఒకోసారి నన్ను అనుమానించి —"నువ్వు నన్ను చంపేయాలని పథకంవేశావు—" అంటున్నారు. ఒకోసారి నన్ను దగ్గరగా తీసుకుని — "దేవతలాంటి నిన్ను కోపంలో ఏమైనా అంటే ఆ పాపం నాదే—నువ్వు మాత్రం మనసులో పెట్టుకోకు—" అంటున్నారు. ఆయనతో వ్యవహారం నాకు చాలా ఇబ్బందిగా వుంటున్నది. రోజులు భారంగా గడుస్తున్నాయి...." అన్నది కోమలి.

"ఆయన ఆస్తి అంతా నువ్వు కాజేస్తావని ఆయన అనుమానమేమో!"

కోమలి నవ్వి—"ఆ అనుమానముండడానికి వీల్లేదు. యెందుకంటే ఆయన ఆ విషయంలో జాగ్రత్త తీసుకున్నారు—" అన్నది.

"ఎలా?" అన్నది చంప.

"డబ్బంతా ఆయన పేరుమీదనే వున్నది. బ్యాంకులో ఆయన తదనంతరం ఆ స్తి ఆయన బిడ్డలకు చెందాలని నామినీగా తన పిల్లలనుంచారు. యెటొచ్చీ నేనూ నా జాగ్రత్త తీసుకున్నాను. ఆయన కాయకల్ప చికిత్సలో పడుచువాడిగా మారితే నన్ను నిర్లక్ష్యం చేయకూడదు. నాతోనే కాపురం చేయాలి. నన్ను వదిలిపెడితే నాకు నాలుగు లక్షలు చెల్లించుకోవాలి. ఆ విధంగా కాగితం వ్రాసి ఇచ్చారు. నాకో చెక్కు కూడా ఇచ్చారు. ఆ చెక్కుకు తేదీ వచ్చే సంవత్సరంలో వున్నది—" అన్నది కోమలి.

"అంతా తమాషాగా వుంది—" అన్నది చంప.

"అవును. ఈ విషయాలు నువ్వు ఎవరికీ చెప్పకు. మాకే గొడవలూ వుండవు. కాయకల్ప చికిత్స జయప్రదమవుతుందనీ మేమిద్దరమూ కలకాలం సుఖంగా కాపురం చేసుకుంటామనీ నేను నమ్ముతున్నాను. అందుకే అన్ని విషయాలూ రహస్యంగా ఉంచుతున్నాను—" అన్నది కోమలి.

## 7

చంప ఉత్తరం విషయం భర్తకు కూడా చెప్పలేదు. చెప్పడంవల్ల ప్రమాదముంది. ప్రకాశరావు కాయకల్ప చికిత్స పొందుతున్నాడు. ఆయనలో శక్తి పెరుగుతున్నదని భార్య అంటున్నది. అటువంటప్పుడు ఆయనతో తను చనువుగా ఎలా మాట్లాడగలిగిందీ అని సోంబాబుకు

అనుమానం వస్తుంది!

తనకు సంబంధించినంతవరకూ యెలా ప్రవర్తించినా పరాయి మగవాడి ప్రసక్తి వచ్చేసరికి మాత్రం ఎంత ముసలివాడైనా స్త్రీ పట్ల అసలైన భర్తలా ప్రవర్తించ గలుగుతాడు.

కానీ ఆ ఉత్తరం ఏమిటి? అందులో ఏముంది? అందులోని విశేషాలను రహస్యంగా ఉంచాలని ముసలాయన ఎందుకనుకున్నాడు?

ఈ ప్రశ్నలు చంపను వేధిస్తున్నాయి.

ఆ ఉత్తరం తన ద్వారా పోస్టు చేయించాలని ఆయన అనుకున్నాడు. తనమీద ఆయనకు ప్రత్యేకమైన ఆసక్తి ఏమీ లేదు. కోమలికి తెలీకుండా ఆ ఉత్తరం పోస్టు కావాలన్నది ఆయన ఆశయం.

ఆ ఆశయం నెరవేరిందా?

చంప ఆ ఇంటికి వెళ్ళాలని అనుకునేది! కానీ కోమలికి భయపడేది.

కోమలి సామాన్యమైన ఆడది కాదు. చూపులకు కనిపించేటంత అమాయకురాలూ కాదు. ఆమె చాలా తెలివైనది. తనకు రావద్దని చెప్పిందామె. వెడితే....?

ఒకసారి వెళ్ళింది చంప. గుమ్మంలోనే కోమలి ఎదురైంది. యెందుకొచ్చావ్—అన్నట్లు చూసిందామె.

"మీ యింట్లో పంచదార వుందా?"

చంపకు పంచదార అవసరంలేదు. ఆపద్ధర్మంగా అడిగిందామె.

"చూడు చంపా! ఆడదాన్ని ఒక్కర్తినీ ఇంట్లో వ్యవహారాలన్నీ చూసుకోలేక చస్తున్నాను. నా దురదృష్టం నేను అనుభవిస్తాను. నీకు పంచదార అవసర

మైతే నా ఇల్లే దొరికిందా! ఈ వైద్యం వంతు ముగిసే దాక మా యింటికి రాకు. ఏమీ అడక్కు. మా ఇంట్లో ఏమీ వుండవు—" అన్నది కోమలి.

చంప చిన్నబుచ్చుకుంది. మళ్ళీ ఆమె ఇంటివైపు వెళ్ళలేదు. అయితే తన మనసులో బాధ మాత్రం వుండిపోయింది. ఆ ప్రకాశరావు తనెప్పుడూ మాట్లాడలేదు. ఆయన కూడా మర్యాదస్థుడు.

ఆయన ఏదో ప్రమాదాన్ని శంకిస్తున్నాడు. అందుకే ఉత్తరం వ్రాయా లనుకున్నాడు. ఆ ప్రమాదమేమిటో తనకు తెలియదు. కానీ ఆయన వ్రాసిన ఉత్తరం ఆయన్ను ప్రమాదంనుంచి రక్షించగలదు. ఆ విధంగా తనో అసహాయుడికి సాయపడగలిగివుంటే యెంతో తృప్తిగా వుండేది. కానీ ఆయనతో పాటు తనూ అసహాయురాలై పోయింది. అది చంపకు ఎంతో బాధగా వుంది.

ఆమె ఇంట్లోనే శ్రీనివాసుడి పటంముందు నిలబడి "భగవంతుడా—ఆ ప్రకాశరావుకు సాయపడే అవకాశం నువ్వు నాకివ్వలేదు. కనీసం నువ్వైనా సాయపడు—" అని రోజుకొకసారైనా వేడుకునేది.

## 8

తెల్లవారు ఝామున అయిదింటికి తలుపు తట్టిన చప్పుడుకాగా సోంబాబు భార్యను తట్టిలేపాడు.

"మీరు వెళ్ళండి—" అంది చంప మత్తుగా.

"నాకు కాళ్ళు కాస్త నొప్పిగా వున్నాయి. నువ్వు వెళ్ళి తలుపుతీద్దూ. ఈ సమయంలో తలుపు తడుతున్నారంటే బహుశా ఏ టెలిగ్రామైనా అయుండవచ్చు. టెలిగ్రాం విషయం తల్చుకుంటేనే నాకు కాళ్ళు

చేతులూ ఆడవు—" అన్నాడు సోంబాబు.

విసుక్కుంటూనే చంప మంచం దిగింది. వెళ్ళి తలుపు తీసేసరికి ఎదురుగా కోమలి చంపను చూస్తూనే ఒక్కసారి ఆమెను గట్టిగా కౌగలించేసుకుంది. చంప ఉక్కిరిబిక్కిరవుతూ—"ఏం జరిగింది?" అంది.

"కాయకల్ప చికిత్స జయప్రదంగా ముగిసింది—" అన్నది కోమలి.

"ఏమిటీ?" అన్నది చంప. ఆమె మత్తు పూర్తిగా వదిలిపోయింది.

"నిన్న రాత్రంతా నిద్రలేదు. సదానందం చెప్పాడు. "దేవుడిమీద భారంవేసి ఈ మందు ఈ రాత్రి మీ ఆయనచేత తినిపించు. ఆయన శరీరం దీనికి తట్టుకుంటే ఏ సమస్యా లేదు. తట్టుకోకపోతే మాత్రం కొత్త సమస్యలు వస్తాయి—" అన్నాడు. రాత్రంతా ఆయన నరకయాతన అనుభవించారు. ఆ బాధ చూడలేక పోయాను. ఇంత విషముంటే తినిపించు — చచ్చి పోతాను—అనికూడా అన్నారాయన.

అర్ధరాత్రి రెండుగంటలకు కాబోలు ఆయన నిద్ర పోయారు. ఆ తర్వాత నాకూ నిద్రపట్టింది. సరిగ్గా ఓ గంటక్రితం ఆయన నన్ను లేపారు. యెలాగున్నారను కున్నావు. ఆయనలో వచ్చిన మార్పు చెప్పలేను. బుజ్జి తువ్వాయిలా ఇల్లంతా పరుగులు పెట్టారు. తనను చూసుకుని తనే నమ్మలేకపోతున్నారు. సదానందాన్ని దేవుడని పొగిడేస్తున్నారు. అంతా నా అదృష్టమన్నారు. ఈ సంతోషాన్ని నీతో పంచుకోవాలనుకున్నాను. కానీ ఆయన వదిలితేగా! ఎలాగో మంచిమాటలాడి యిలా వచ్చాను. ఈ రోజు ఉదయం మీ దంపతులిద్దరూ మా

యింటికి భోజనానికి రావాలి. తర్వాత ఆయన వచ్చి మీవారికి చెబుతారు. వంట ప్రారంభించేస్తావని ముందుగా నేను వచ్చి చెబుతున్నాను—" అంది కోమలి.

చంప ఆమెవంక అసూయగా చూసింది. కోమలి అదేమీ గమనించే స్థితిలో లేదు. ఉత్సాహంగా తను చెప్పదల్చుకున్నది చెప్పి—వేగంగా సెలవుతీసుకుని వెళ్ళి పోయింది.

చంప తలుపులువేసి లోపలకు నీరసంగా వెళ్ళింది.

"ఎవరూ?" అన్నాడు సోంబాబు.

"కోమలి...."

"కోమలి అంటే ప్రకాశరావు భార్య?"

"ఊఁ" అని నిట్టూర్చింది చంప. పరాయి ఆడదాన్ని ఓ మగాడి భార్యగా గుర్తుంచుకోవడం ముసలివాళ్ళ లక్షణం. ప్రకాశరావు అంటే ఆ కోమలి మొగుడూ అన్నవాడు అసలైన మగాడు. ఇప్పుడా ప్రకాశరావు భార్యవద్ద తన గురించి అలాగే అంటూ దేమో? ఇప్పుడా ప్రకాశరావు ఎలా వున్నాడో? తను ఫోటో చూసిందిగా అలాగే వుంటాడా?

"ఎందుకు వచ్చింది?" అన్నాడు సోంబాబు.

చెప్పింది చంప. షాక్ తిన్నట్లు లేచి కూర్చున్నాడు సోంబాబు.

"నువ్వు నాతో వేళాకోళ మాడుతున్నావా?" అన్నాడు సోంబాబు.

"మనిద్దరిమధ్యా వేళాకోళం యెప్పుడైనా నడిచిందా?" అన్నది చంప.

సోంబాబు ఆమె మాటలకు దిగులుపడ్డాడు—
"అయాం సారీ చంపా? ఆ ప్రకాశరావులా నేనూ

పడుచుదనం సంపాదించలేక పోయానని నీకు బాధగా ఉందికదూ—నువ్వేం చేయమంటే అది చేస్తాను. ఆజ్ఞాపించు—" అన్నాడు.

చంప నొచ్చుకుంటూ — "నా అభిప్రాయం అది కాదండీ! ఆ ప్రకాశరావుగారు నిజంగానే యువకుడిగా మారిపోయాడట. అది ప్రదర్శించడంకోసమే కదా— మనని భోజనానికి కూడా పిలుస్తోంది కోమలి!" అన్నది.

అప్పటికి సోంబాబు వాస్తవంలోకి వచ్చాడు. ఇదెలా సాధ్యం? ప్రకాశరావు యువకుడిగా మారిపోయాడా?- ఇందులో ఏదో మోసం వుంది.

సరిగ్గా ఉదయం తొమ్మిది గంటలకు ఓ యువకుడు సోంబాబు ఇంటికి వచ్చాడు. అప్పుడు చంప లోపల ఉన్నది.

"నమస్కారం సోంబాబుగారూ!" అన్నాడతను. ఆ కంఠం ఎంతో గంభీరంగా ఉన్నది. మనిషి కూడా ఎంతో దృఢంగా ఉన్నాడు.

"ఎవరండీ మీరు?" అన్నాడు సోంబాబు.

"ఎదురెదురు ఇళ్ళవాళ్ళమైనా మన పరిచయం చాలా స్వల్పం. డబ్బుతో నేను వయసును కొనుక్కోవడంవల్ల నా రూపం మారిపోయింది. అందుకే మీరు నన్ను గుర్తించలేకపోయారు. నా పేరు ప్రకాశరావు. మీ భార్య స్నేహితురాలు కోమలికి భర్తను. ఈ పూట మీరు మా యింట్లో విందుకు రావాలి. వేరే యెవ్వర్నీ ఆహ్వానించడంలేదు. సరిగ్గా పదింటికల్లా మీరు మా యింటికి వచ్చేయాలి...." అన్నాడా యువకుడు.

సోంబాబు ఆశ్చర్యంగా ప్రకాశరావువంక చూస్తూ-

"మీరు....మీరు....ప్రకాశరావుగారా! ఇది నేను నమ్మ లేకుండా వున్నాను...." అన్నాడు.

ప్రకాశరావు క్లుప్తంగా తనకు జరిగిన కాయకల్ప చికిత్స గురించి చెప్పి-"ఈ విషయమై ఎక్కువ ప్రచారం జరుగడం సదానందాని కిష్టంలేదు. అందువల్ల ఈ విష యాన్ని మేము రహస్యంగానే వుంచదల్చుకున్నాం. కొంతమందయితే నా భార్య పరాయి పురుషుడితో తిరుగుతున్నదని భావన కూడా పొందవచ్చు. భర్తనైన నాకు ఏ అనుమానమూ లేనప్పుడు యెవరేమనుకుంటే నాకేం? అయినా మేమిక్కడ ఎక్కువ కాలం వుండం. కొద్ది నెలలు అంతే! ఆ తర్వాత మరో ఊళ్ళో కొత్త జీవితం ప్రారంభిస్తాము...." అన్నాడు.

సోంబాబు ఆయన్ను ఎన్నో అడగా లనుకున్నాడు. కానీ నోట మాటరాలేదు. యెలాంటివాడు యెలాగై పోయాడు? ఇది కలా, నిజమా?

అతడి ఆలోచనలెలా వున్నప్పటికీ సరిగ్గా పదయ్యే సరికి భార్యాభర్తలిద్దరూ తెమిలి యెదురింటికి వెళ్ళి పోయారు. ఆ రోజు తన ఆఫీసుకు సెలవు దినం కావడం తన అదృష్టమని అనుకున్నాడు సోంబాబు.

ప్రకాశరావు సోంబాబుతో చాలా సరదాగా మాట్లా డాడు. ఇప్పుడు ప్రకాశరావు, కోమలిల జంట చూడ ముచ్చటగా వున్నది.

ప్రకాశరావు సోంబాబుకు చాలా విశేషాలు చెప్పాడు. యువకుడిగా వున్నప్పటి తన ఫోటో చూపించి—"నేను తిరిగి ఇలా మారగలగడం అద్భుతం కదూ!" అన్నాడు.

"అవును. ఈ అద్భుతాన్ని సాధించిన ఆ సదానందం గారిని చూడాలని వున్నది—" అన్నాడు సోంబాబు.

ప్రకాశరావు తమాషాగా కళ్ళు చిట్లించి—"ఆ సదానందాన్ని నేనే చూడలేదు. మీరెక్కడ చూడ గలరు?" అన్నాడు.

"మీరు చూడలేదా?" అన్నాడు సోంబాబు ఆశ్చ ర్యంగా.

"మా వ్యవహారమంతా ఉత్తరాలమీద నే నడిచింది. మందులుకూడా పోస్టులో నే! గుణం ఏ విధంగా వున్నదీ పోస్టులో నే రాసేవాళ్ళం! ఆ వైద్యం జరుగుతున్నంత కాలం నేను నా భార్యనెంతలా మాషించానో, యెలా వేధించానో, యెన్నివిధాల అనుమానించానో లెక్కలేదు. ఆ దేవత అన్నింటికీ కిమ్మనకుండా సహించింది—" అన్నాడు ప్రకాశరావు.

సోంబాబుకు మొత్తం వ్యవహారమంతా ఆశ్చర్యంగా వున్నది. కానీ అతడి చిక్కుముడి మరీ జటిలమవుతున్నదే కానీ విడడంలేదు.

విందు భోజనం అద్భుతంగా ఉన్నది. అందరూ సంతోషంగా భోజనం చేశారు. భోజనాల అనంతరం మగవాళ్ళిద్దరూ హాలులోకి—ఆడవాళ్ళు పడక గదిలోకి నడిచారు.

"రా—ఇలా మంచంమీద కూర్చుందాం—" అన్నది కోమలి.

ఆమె వెళ్ళి మంచంమీద కూర్చుంది. అన్యమనస్కంగా వున్న చంప కాస్త వెనుక పడింది. ఆమె ఈ లోకంలోకి వచ్చేసరికి యెదురుగా మంచం....మంచంమీద కోమలి.

ఒక్కసారి చంప మెదడులో ఏదో మెరిసినట్లయింది.

ఆ రోజు ప్రకాశరావు ఇదేవిధంగా మంచంమీద కూర్చుని వున్నాడు. తనను పిలిచాడు. కోమలికి తెలియ

కుండా ఏదో ఉత్తరం పోస్టు చెయ్యమన్నాడు. కానీ అంతలోనే కోమలి వచ్చేయడంవల్ల ఆ ఉత్తరం తనకివ్వ లేకపోయాడు.

ఆ ఉత్తరంలో ఏముంది?

ఆ ఉత్తరం ఆయన పోస్టు చేశాడో లేదో!

అప్పట్లో ఆయనకు కోమలిమీద అనుమానముండేదని, ప్రకాశరావు తనే చెప్పాడు. తన అనుమానాన్ని ప్రకాశరావు యెవరికి చెప్పాలనుకున్నాడు? ఏమని చెప్పా లనుకున్నాడు? చెబితే ఏమి జరిగేది? ప్రకాశరావు, కాయకల్ప చికిత్స ఆగిపోయేదా?

అసలు ఆ సదానందం యెవరు?

"ఏమిటో తెగ ఆలోచిస్తున్నావు...." అన్నది కోమలి.

చంప చకచకా నాలుగడుగులు వేసి మంచంమీద కూర్చుని—"మీ యింట్లో జరిగిన అద్భుతం నా మతి పోగొట్టేసింది...." అన్నది.

కోమలి గర్వంగా నవ్వింది.

"కాస్త వక్క పొడి ఇస్తావా?" అన్నది చంప.

"తప్పకుండా...." అంటూ కోమలి లేచి వంటిం ట్లోకి వెళ్ళింది.

సరిగ్గా ఆ సమయాన్ని వినియోగించుకోవాలనుకుంది చంప. ప్రకాశరావు తనకు ఇవ్వాలనుకున్న ఉత్తరం మంచానికున్న రహస్యపుటరలో దాచానని అన్నాడు— అందుగురించి ఆయన అప్పుడు తలగడా పైకి ఎత్తబో తూండగా కోమలి వచ్చింది.

చంప చటుక్కున తలగడా ఎత్తింది.

"ఏమోయ్ చెక్కబుక్క కావాలోయ్.." అంటూ

మంచం సమీపించిన ప్రకాశరావు చంపను చూసి—"అయాం సారీ—కోమలి ఇక్కడ లేదా?" అని ఆగి పోయాడు.

ఎత్తిన తలగడను అలాగే పట్టుకున్నది చంప.

ఈయనకిప్పుడు ఆ గతం గుర్తున్నదా? ఉత్తరం గురించి అడిగితే ఏమని చెబుతాడు?

ఉత్తరం గురించి ఆయన్ను అడగాలా అడక్కూడదా అని మథనపడుతుండగానే కోమలి అక్కడకు వచ్చేసి చెక్కుపోడి డబ్బా చంపకు అందించి—"మీకేం కావాలండీ—" అన్నది.

"చెక్కు బుక్కు...."

"దేనికి?"

"సోంబాబుగారికి అర్జంటుగా అయిదువందలు కావాలిట. ఇంట్లో అంత డబ్బు లేదుకదా—చెక్కు రాసిస్తానన్నాను. ఈవేళ ఆయనాఫీసుకైతే సెలవుగానీ బ్యాంకు హాలిడే కాదు కదా—" అన్నాడు ప్రకాశరావు.

చంపకు సిగ్గుతో వళ్ళు కుంచించుకుపోయింది. అసలే తన భర్త ముసలివాడు! కాయకల్ప చికిత్సకు అవకాశం లేనివాడు! ఆపైన ప్రకాశరావువద్ద అప్పు అడిగాడు.... అదీ వాళ్ళు తమను విందుకు పిలిచినపుడు....ఛీ....ఛీ ఎంత లేకిమనిషి!

చంపకు కోపం, జుగుప్స ఒకేసారి కలిగినా నిగ్రహించుకుంది.

కోమలి భర్తకు చెక్కు బుక్కు ఇచ్చింది. అది తీసుకుని ప్రకాశరావు గదిలోంచి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత చంప అక్కడ ఎంతోసేపు లేదు.

ఆ యువక దంపతులమధ్య తను యెంతోసేపుండ

రాదని ఆమె గ్రహించింది.

భార్యాభర్తలిద్దరూ ప్రకాశరావు దంపతులను అభినందించి, ధన్యవాదాలు చెప్పి అక్కణ్నించి బయటపడి ఇంటికి వెళ్ళగానే చంప తన కోపాన్నంతటినీ భర్తమీద వెళ్ళగక్కింది.

సోంబాబు చిరునవ్వుతో ఆమె తిరస్కారాన్ని స్వీకరించి—"నేను కొత్త విశేషం తెలుసుకున్నాను. నీకు కోపం తగ్గితే అది చెబుతాను ..." అన్నాడు.

చంప కోపం వెంటనే తగ్గిపోయింది.

అప్పుడు సోంబాబు స్వరం తగ్గించి — "ఆ ప్రకాశరావూ ఈయనా ఒకడు కాదు. కోమలి ఏదో నాటకమాడుతోంది. కాయకల్ప చికిత్స పేరు చెప్పి భర్తను చంపేసి ఆ స్థానంలో ఓ పుర్రాణ్ని వుంచి వాడే తన భర్త అని చెప్పుకుంటోంది—" అన్నాడు.

చంప ఆశ్చర్యంగా—"నిజంగానా?" అంది.

"అవును. ఘంటసాల కంఠం పాతికేళ్ళప్పుడు ఎలా ఖంగుమన్నదో—యాభై యేళ్ళ ఏటకూడా అదేవిధంగా వున్నది. ప్రకాశరావు గొంతులో ఇప్పుడు చాలా మార్పు వినవస్తున్నది. నాకాయన గొంతు బాగా గుర్తు—" అన్నాడు సోంబాబు.

"ఏడిసినట్లుంది. మా నాన్నగారి గొంతు పదేళ్ళలో పూర్తిగా మారిపోయింది. గొంతునుబట్టి రూపాలను కాదనలేము—" అన్నది చంప.

"అందుకేగా నేను ప్రకాశరావును అప్పు అడిగింది.." అన్నాడు సోంబాబు ఏదో రహస్యం చెబుతున్నవాడిలా. "మనకు డబ్బేమీ అవసరంలేదు. కానీ ప్రకాశరావు విషయంలో నాకేదో అనుమానముంది-మనిషి మారాడని!

బ్యాంకులో ఆ ప్రకాశరావుకు అకౌంటుంది. అదే అకౌంట్ ఇప్పుడూ వున్నదా? ప్రకాశరావు సంతకంలో మార్పేమీ లేదా? బ్యాంకు వాళ్ళు సంతకంలో యే మాత్రం మార్పు వచ్చినా ఇట్టే పట్టేస్తారు...."

భర్త అనుమానం చంపలో చాలా ఆలోచనలు రేపింది.

సోంబాబు బ్యాంకుకు వెళ్ళి అరగంటలో తిరిగి వచ్చేశాడు.

అతడికి డబ్బు దొరికింది. ప్రకాశరావు అకౌంట్ ఏణ్ణర్ధం నుంచి కొనసాగుతున్నది. సంతకం కూడా సరిగా వున్నట్టే లెక్క! థర్డు పార్టీ చెక్కు కావడంవలన గుమస్తా చెక్కుమీది సంతకాన్ని వెరిఫైచేసి సంతృప్తిగా తలాడించాడు.

"ఈ కొత్త ప్రకాశరావు ఫోర్జరీలో ఆరితేరిన వాడేనా అయుండాలి. లేదా అతడు నిజంగానే ప్రకాశరావు అయుండాలి—" అన్నాడు సోంబాబు.

## 9

"హలో — సోంబాబుగారూ — ఈ రోజే మా ప్రయాణం—" అన్నాడు ప్రకాశరావు, సోంబాబును అప్యాయంగా పలకరిస్తూ.

అప్పటికి ప్రకాశరావు యువకుడై అయిదు నెలలు దాటింది. వాళ్ళూరు మారడానికి ప్రయత్నిస్తున్నట్లు సోంబాబుకు తెలుసు.

ఆ వీధిలో కోమలి పెద్ద సంచలనం కలిగించింది మొదట్లో! ఒక ముసలివాడి అందాల పడుచు భార్య ఆమె! అయితే ఆమె గుమ్మం దాటి బయటకు వచ్చేది కాదు. సాధారణంగా భర్తతోతప్ప కనబడేది కాదు.

ఆమెలో ప్రత్యేకంగా ఆడవాళ్ళెవ్వరూ స్నేహం చేయలేదు. ఒకే గూడుపక్షులు కావడంవల్ల చంప కోరి ఆమె స్నేహం చేసింది.

క్రమంగా కోమలి ఉనికిని అంతా పట్టించుకొనడం మానేశారు.

ఇప్పుడు కోమలి ఓ యువకుడితో కనబడుతున్నది. అతడామెకు భర్త అని చెప్పుకుంటున్నది. ప్రకాశరావు కాయకల్ప చికిత్సవల్ల యువకుడుగా మారాడని చంప సాక్ష్యం ఇస్తున్నది. ఆమె సాక్ష్యాన్ని కొందరు ఎంతో హాస్యాస్పదంగా తీసుకున్నారంటే ఒక పూట చంప ఒంటరిగా బజార్నించి తిరిగివస్తూండగా ఓ యువకుడు యెదురై—"నన్ను గుర్తుపట్టలేదుటే చంపా! నీ భర్తను కాయకల్ప చికిత్సతో ఇలా మారిపోయాను. ఇంటికి పోదామా—హోటలుకు పోదామా—" అని అడిగాడు.

చంప మ్రాన్పడిపోయింది. అయితే ఈ మాట భర్తకు చెప్పుకోలేదు. ఒంటరిగా బయటకు వెళ్ళడం మానేసింది. కోమలి కథలో చంపకూ కొంత పాత్ర వున్నదని కొందరు అనుమానించారు. అయితే కోమలికి ఎటువంటి ప్రమాదమూ వాటిల్లలేదు. ఆమె జీవితం బాగానే వున్నది. ఆమెకూడా ఉత్సాహంగా కనబడుతున్నది.

ఇప్పుడు వాళ్ళు వెళ్ళిపోతున్నారు. వాళ్ళను చంప, సోంబాబు భోజనానికి పిలిచారు. కోమలి తన ఫర్నిచర్ నంతా అమ్మేసుకున్నది. మంచం ఒక్కటీ ఉచితంగా చంపకు బహుమతిగా ఇస్తున్నానంది.

చంప ఆశ్చర్యపోయింది.

ఆ మంచం అందమైన మంచం. బజార్లో కొనుక్కోవాలంటే వెయ్యి రూపాయలకు తక్కువవుండదు. అంత

ఖరీదైన మంచం కోమలి తనకు ఊరికనే....

చంప కళ్ళు చెమ్మగిల్లాయి — "నీకు నామీద ఇంత అభిమానమెందుకు?" అంటూ ఆమె రెండు చేతులూ పట్టుకుంది.

కోమలి అదోలా నవ్వి—"నీవు కోరినది నీకు ఇవ్వలేకపోయాను. కనీసం గుర్తుగా ఈ మంచమైనా వుంటే అదో తృప్తి నాకు—" అన్నది.

ఆ రోజే కోమలి, ప్రకాశరావు వెళ్ళిపోయారు. తనకు బాగా దగ్గర బంధువులు వెళ్ళిపోయిన అనుభూతి పొందింది చంప. భార్యాభర్తలిద్దరూ స్టేషనుకు వెళ్ళి ఆ దంపతుల్ని సాగనంపి వచ్చారు.

## 10

ఇంటికి తిరిగివచ్చేక సోంబాబు పేపరు చూసుకుంటూంటే—కొత్త మంచంమీద పక్క వేయబోయింది చంప.

అప్పుడామెకు ఆ మంచం .... మంచంమీద ముసలి ప్రకాశరావు తనకు ఉత్తరం ఇస్తానంటూ తలగడ ఎత్తడం గుర్తువచ్చింది.

ఆ ఉత్తరం పోస్టుకాలేదా—ఇంకా మంచంలోనే రహస్యపుటరలోనే భద్రంగా వుందా? ఉత్తరం వున్న విషయం కోమలికి తెలుసా?

చంప తలగడ ప్రాంతంలో వెతికింది. కాస్త కష్ట పడితే ఆమెకో చిన్న రహస్యపుటర దొరికింది. అది మంచానికి పక్కనుండే బలమైన కమ్మీలో వున్నది. రహస్యపుటర వున్నదని తెలిస్తే తప్ప దాన్ని కనుక్కోవడం కష్టం.

అందులో మూడు డైరీలు....ఒక కవరు వున్నాయి.

కవరు ఆతికించి అడ్రసు వ్రాసి వున్నది. యెవడో సూర్యారావు పేరిట వ్రాయబడి వున్నదా చిరునామా!

చంప చేతులు వణికాయి. సందేహంలేదు .... ఈ ఉత్తరాన్నే ప్రకాశరావుగారు పోస్టుచేయాలనుకున్నది.. మరి ఆ తర్వాత ఇది పోస్టు చేయవలసిన అవసరం కలుగ లేదా? ఈ ఉత్తరం ఇందులోనే ఎందుకుండిపోయింది? ప్రకాశరావు దీని విషయం విస్మరించాడా? నిర్లక్ష్యం చేశాడా?

ఒక్క క్షణం తటపటాయించి చంప ఆ ఉత్తరాన్ని చదివింది.

"డియర్ సూర్యారావ్!

నేను మళ్ళీ పెళ్ళిచేసుకొని నీవంటి ఆప్త మిత్రులకు కూడా దూరమయ్యాను. నా పడుచు భార్యకు అన్యాయం జరక్కూడదని నేను కాయ కల్ప చికిత్సకు పూనుకున్నాను. ఇంతవరకూ అంతా బాగానే జరిగింది. కానీ కొద్దిరోజులుగా నాలో అనుమాన పిశాచం బయల్దేరింది. కారణం చెప్ప లేను. నా కాయకల్ప చికిత్స ఏ తేదీకి పూర్తవు తుందో ఇందులో రాస్తున్నాను. ఆ తర్వాత నువ్వి క్కడికోసారి నన్ను చూడ్డానికి రా. నన్ను చూడ గానే నీకు కాయకల్ప చికిత్సలో మోసం జరి గిందో లేదో తెలిసిపోతుంది. ఈలోగా నువ్వి క్కడికి రావద్దు...."

ఉత్తరం చివర సంతకం వున్నది. కాయకల్ప చికిత్స ముగిసే తేదీ కూడా వున్నది.

చంప ఆశ్చర్యంగా — "ఏమండీ—" అని ఓ కేక పెట్టింది.

ఒక్క పరుగున లోపలకు వచ్చాడు సోంబాబు. చంప అతడికి ఉత్తరాన్ని చూపించింది. ఉత్తరంతో పాటు డైరీలు కూడా చదివాడు సోంబాబు.

అందులోని విశేషాలు సోంబాబుకు బాగా ఆశ్చర్య పరిచాయి.

ప్రకాశరావు కోమలిని పెళ్ళిచేసుకున్నప్పట్నించీ మొత్తం వ్యవహారమంతా రహస్యంగా వుంచాడు. కాయకల్ప చికిత్స నతడు పూర్తిగా నమ్మాడు. అందుకే తన వాళ్ళకు దూరంగా వుండాలనుకున్నాడు. ఈ ఊరికి వచ్చేక అతడు యెన్నడూ బ్యాంకుకు వెళ్ళలేదు. తన రూపం మారితే తర్వాత బ్యాంకువాళ్ళు అనుమానిస్తారని అతడి భయం. అన్ని వ్యవహారాలూ కోమలి స్వయంగా చేసేది. అకౌంట్సు ఓపెన్ చేయడం దగ్గర్నుంచి అతడన్నీ ఇంటి దగ్గర్నుంచే చేశాడు.

కాయకల్ప చికిత్స ప్రారంభమైన రెండు రోజుల్లో అతడికి భార్యమీద అనుమానం ప్రారంభమైంది. తన కివ్వబడుతున్న మందు తాత్కాలికంగా మగవాడిని రెచ్చగొట్టేదనీ—శక్తిలేని ముసలివాడు అలాంటి మందు మింగితే కాలక్రమేణా ప్రాణ ప్రమాదానికి గురవుతాడనీ అతడు అనుమానించాడు. అప్పుడతడి బుర్ర పనిచేసింది. అకౌంట్సు తన పేరుమీద కాక, తన స్పెసిమెన్ సిగ్నేచర్‌లో కాక యే సదానందం పేరునో, అతడి సంతకాలలో ఓపెన్ అయినవేమోనని అనుమానం కలిగింది. అప్పుడతడికి ఓ రోజు స్నేహితుడికి ఉత్తరం వ్రాసి కోమలికి తెలియకుండా పోస్టు చేయించాలనుకున్నాడు. వీలుపడలేదు.

"ఆ కాయకల్ప చికిత్సను పరీక్షించడానికి ముందు

నుంచీ నేనొక ఉపాయం పన్నాను. అది బహుశా ఫలించవచ్చు...." అన్న వాక్యాలు డైరీల్లో చాలా తరచుగా వాడబడ్డాయి. ఆ ఉపాయమేమిటో వ్రాయబడలేదు.

ఉత్తరం వ్రాసిన తేదీ తర్వాత నుంచి డైరీలో కూడా ఏమీ లేదు.

"ఆ కోమలి నరహంతకి! కాయకల్ప చికిత్స పేరు చెప్పి భర్త ప్రాణాలుతీసి పరాయి మగాడితో లేచిపోయింది—" అన్నాడు సోంబాబు.

"ఇప్పుడేం చేస్తారు?" అన్నది చంప.

"నేను ఆ సూర్యారావును కలుసుకుని ఈ డైరీలు, ఉత్తరం అందజేసి జరిగింది చెబుతాను...." అన్నాడు సోంబాబు.

చంప మనసులో చాలా బాధపడింది. కోమలి తనకు అభిమానంతో మంచాన్నిచ్చింది. అందులో తనీ ఉత్తరం చూసింది. కోమలి ఇచ్చిన మంచం ఆమెకే ప్రమాదకారిగా తయారవుతోంది. వద్దని భర్తకు చెప్పలేదు. ఓ కులటను క్షమించమని భర్తను కులస్త్రీ అడిగితే—అది కులట కావటానికి మించిన నేరం!

సోంబాబు స్వంత డబ్బు ఖర్చుపెట్టుకుని సూర్యారావు ఇంటికి వెళ్ళాడు. సూర్యారావును చూడగానే అతడు ఆశ్చర్యపోయాడు.

సూర్యారావు—ఇప్పుడు యువకుడిగా మారిన ప్రకాశరావుకు ముసలివేషం వేసినట్లు వున్నాడు. ఆయన సోంబాబు చెప్పినదంతా విని—"అఖరికి నేను చెప్పినట్లే జరిగింది. కాయకల్ప చికిత్స అంటే నిన్ను చంపేసి యే పడుచువాడో నీ యువక రూపాన్ని మాస్కుగాల్

తయారుచేసి పెట్టుకుంటాడని వాడితో అన్నాను. అలాంటి మోసం జరక్కుండా వాడికి నేను తప్పు ఫోటో చూపించాను. అప్పుడు వాడు కనీసం నాకులా చెలామణీ కాలేదు—అని వాడు తృప్తిపడ్డాడు...." అన్నాడు.

"అది నిజమే! వాడు మీరు చిన్నతనంలో యెలా వుండేవాళ్ళో అలాంటి మాస్కు ధరించి కొంతకాలం ప్రకాశరావుగారిగా చెలామణీ అయిపోయాడు. దీన్నిబట్టి వాడు మోసగాడని తెలిసిపోతోంది. హంతకుడని కూడా అర్థమవుతోంది. మీరు వాడినీ....ఆ కోమలినీ కూడా పట్టించి నేరం ఋజువుచేసి మీ స్నేహితుడి ఆత్మకు శాంతి కలిగించండి...." అన్నాడు సోంబాబు ఆవేశంగా.

"ఆ అమ్మాయి కోమలి ఇంతకూ ఎందుకు సిద్ధపడిందంటావు .... నా అభిప్రాయంలో హత్యల్ని మించిన నేరం ముసలి వయసులో పడుచుపిల్లను పెళ్ళిచేసుకోవడం. అటువంటి ఘోరం చేసినవాడికి కలాంటి శాస్తే జరగాలి. మీరేమీ బాధపడకండి...." అంటూ సోంబాబు ఎదురుగానే ఆ సమాచారాన్ని తగులబెట్టాడు సూర్యారావు.

సోంబాబు వెనక్కు తిరిగి వెళ్ళాడు. కానీ భార్యకు సూర్యారావు అన్నమాటలు చెప్పలేదు.

—:అయిపోయింది:—

# కీర్తి కిరీటం

అజీజ్

"ఇక్కడ ఆపు!"

బిల్డింగ్ మెయిన్ గేటుముందు ఆగింది టాక్సీ.

నళిని బాక్ సీట్లోంచి దిగి, మోటర్ బిల్లు చెల్లించి, మూసివున్న గేటు తోసింది. గేటు పక్కనే పిట్టగోడలో బిగించి వుంది ఓ పాలరాతి నేమ్ ప్లేట్.

రమాదేవి (రచయిత్రి) నల్లని అక్షరాలు మెరుస్తున్నాయి దానిమీద.

విశాలమైన కాంపౌండ్ దాటి, మూసీ వున్న ఇంటి ముఖద్వారాన్ని సమీపించి, కాలింగ్ బెల్ వత్తింది నళిని. రెండు నిమిషాల తరవాత తలుపు తెరుచుకుంది. ముతకరకం చీరలో వున్న ఆ స్త్రీని నళిని, అదివరకు ఆ ఇంట్లో యెన్నడూ చూళ్ళేదు.

"ఆంటీ వున్నారా ఇంట్లో?"

"ఉన్నారు. పైన పడగ్గదిలో!" జవాబిచ్చిందా స్త్రీ.

"ఎవరు నువ్వు? రత్నమ్మ ఎక్కడ?" అడిగింది నళిని.

"నేను కొత్త మనిషినమ్మా! రత్నమ్మను అమ్మగారు పనిలోంచి తీసేశారట. నా పేరు పంకజం!"

"అలాగా!" అంటూ హాల్లో అడుగుపెట్టి "కోమీ కాషీ ఎక్కడ?" అడిగింది నళిని.

"పైనే!"

సాలోచనగా తలూపుతూ మెట్లవైపు నడిచింది నళిని. ఆ ఇంట్లో యెటు చూసినా భారత, జపనీస్ దేశాల సంయుక్త అలంకరణ కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. పైన వరసగా మూడు గదులున్నాయి. మూడో గదిలోనే రమాదేవి పడగ్గది వుంది.

నళిని మెట్లెక్కి చివరి మెట్టుమీద కాలుపెడుతుండగా, రమాదేవి ముసలి జపాన్ సేవకురాలు కోమీ కాషీ రెండో గదిలోంచి నోట్ బుక్ లాంటిదేదో పట్టుకుని, రమాదేవి పడగ్గది వున్న మొదటి గదిలోకి వెళుతూ కనిపించింది.

నళిని నిస్సంకోచంగా ఆమె వెనకే ఆ గదిలో అడుగు పెట్టింది. ఐతే, అప్పటికే ఆ సేవకురాలు పడగ్గదిలోకి ప్రవేశించడంవల్ల నళిని రాకను గమనించలేదు. అంతలో నళినికి పడగ్గదిలోంచి జపనీస్ భాషలో ఏదో అంటున్న రమాదేవి కంఠం వినిపించింది. దానికి సేవకురాలు ఏదో జవాబిచ్చి, ఆ గది తలుపు మూసి వెనుదిరిగింది. అప్పుడు పడిందామె దృష్టి నళినిమీద.

"ఓ....నళిని బేబీ! ఎపుడు వచ్చావ్?" అడిగింది వచ్చీరాని తెలుగులో.

"ఇప్పుడే. ఆంటీ నిద్రపోతున్నారా లోపల?" అడిగింది నళిని.

కోమీకాషీ తల అడ్డంతిప్పి, "లేదు....రాస్తున్నార్

....కూర్చో బేబీ" అంది చిట్టి కళ్ళు చికిలిస్తూ.

"అబ్బే, అవసరంలేదు. ఆంటీ పని ముగిసేవరకూ ఇక్కడే కూర్చుంటాను. తొందరేం లేదు" అంటూ సోఫాలో చతికిలబడి, రిస్టువాచీ చూసుకుంది నళిని. మధ్యాహ్నం మూడు గంటలు.

కామాక్షి తలూపి, వెళ్ళిపోయింది బైటికి.

టీపాయ్‌మీద ఓ వారపత్రికందుకుని, చెప్పులు విడిచి, పత్రిక పేజీలు తిరగేస్తూ సోఫాలో పడుకుంది నళిని. అప్పుడే పరికిణీలు, పావడలూ వదిలి, చీరలు కట్టడం నేర్చిన బొద్దుగా, అందంగా ఆకర్షణీయంగా వున్న ఆ అమ్మాయి ప్రఖ్యాత కేన్సర్ స్పెషలిస్టు శ్రీకాంత్ కూతురు.

సోఫాలో పడుకుని పత్రిక చదువుతూ అలాగే మగత నిదరలోకి జారిపోయింది నళిని. చేతుల్లోంచి పత్రిక జారి ఆమె ఛాతీమీద పడింది బోర్లించినట్టు....అదే క్షణంలో బిగ్గరగా మోగిన టెలిఫోన్ గణగణ శబ్దానికి ఆమె నిద్ర చెదిరి ఉలిక్కిపడి లేచికూర్చుంది!

ఆ టెలిఫోన్ రమాదేవి పడక గదిలో రైటింగ్ టేబిల్ మీదుంటుంది. నళిని కనుబొమలు ముడివడ్డాయి. ఆంటీ రానూ అక్కడే కూర్చునుంటే ఇంతసేపైనా రిసీవరెందుకెత్తడంలేదు? ఫోన్ ఆగకుండా మోగుతూనే వుంది. లేచి నిల్చుంది నళిని.

కొంపదీసి ఆంటీ నిద్రపోలేదు కదా? ఎంత మొద్దు నిద్రైనా ఫోన్ అలా మోగుతోంటే మెలకువరాదా? అనుకుంటూ గబగబ అటు నడిచింది. తలుపుమీద చెయ్యి వేసి లోనికి తోసింది. సరిగ్గా అదే సమయంలో ఫోన్ మోగడం ఆగిపోయింది!

"ఆంటీ!" అంటూ గదిలో అడుగుపెట్టింది నళిని.

లోపల యెవ్వరూ లేరు! మంచంమీద గానీ, తలుపు పక్క గోడకానించి వున్న టేబిల్ ముందుగానీ రమాదేవి లేదు! అప్పుడు పడింది నళిని దృష్టి టేబిల్ పైన తెరిచి పెట్టి వున్న లెటర్ పాడ్ మీద. మూత విప్పిన పెన్ను కూడా దానిమీదే వుంది. అంతక్రితం కామాక్షి చేతిలో తాను చూసిన రైటింగ్ పాడ్ అదే!

విశాలమైన ఆ పడగ్గది కుడివైపు గోడమధ్య లతలు అల్లిన లావుపాటి కర్టెన్ వేళాడుతోంది. ఆ కర్టెన్ వెనక ఓ తలుపుంటుంది. ఆ తలుపు తెరిస్తే పైకెళ్ళడానికి మెట్లు కనిపిస్తాయి. ఆ మెట్లెక్కి మీదికెళితే పైన మరోగదుంటుంది.

అదే రమాదేవి అసలు రైటింగ్ రూం! రాయాలన్న మూడ్ వచ్చినప్పుడామె ఆ గదిలోనే రోజుల తరబడి కూర్చుని రాస్తూ వుంటుంది. అందులో ప్రవేశించడాని కెవ్వరికీ అనుమతిలేదు. ఇంటి నౌఖర్లకూడా!

ఆంటీ బహుశా ఆ గదిలో వుందేమో, అనుకుంటూ అటు నడిచింది నళిని. పక్కనున్న టేబిల్ దాటిందో లేదో, ఒక్కసారి కొయ్యబారినట్టు ఆగిపోయింది! ఆమె కళ్ళముందు నేలమీద ఓ పక్కకు ఒరిగిపడుంది రమాదేవి! టేబిల్ దగ్గర కుర్చీ అడ్డం వుండటంవల్ల అంతవరకూ ఆమెను చూడలేకపోయింది నళిని.

పాపం రాస్తూ రాస్తూ అలసి, సొమ్మసిల్లి పడిపోయిందేమో, అనుకుంటూ రమాదేవిని సమీపించి కెవ్వుమంది నళిని!

## 2

రమాదేవి మెడంతా రక్తమయం!! నేలమీద ఎర్రని రక్తపు మడుగు!!!

ఆ దృశ్యం చూడగానే నళిని కళ్ళల్లో చీకట్లు కమ్ముకొచ్చాయి. స్పృహతప్పి కిందపడతానేమో అనుకుంటూ చటుక్కున నేలమీద కూర్చుంది. ఆ కూర్చోడంలో ఆమె కుడిచెయ్యి నేలమీద ఆనింది. అంతే!

ఆ చేతికేదో చల్లగా తగిలి, త్రుళ్ళిపడి చూసింది నళిని. ముందు ఆ వస్తువేమిటో సరిగ్గా అర్థంకాలేదామెకు. చేతిలోకి తీసుకుని అటూ ఇటూ తిప్పిచూశాక అర్థమైంది. కత్తెర!

పెద్దసైజు కత్తెర!!

ఐతే, అది పూర్తి కత్తెరకాదు. కత్తెరకు అటూ, ఇటూ కత్తుల్లాంటి రెండు పలుకు లుంటాయి. వాటిని కలుపుతూ మధ్యలో స్క్రూ వుంటుంది. దీని కవేవీ లేవు. కత్తిని పోలిన ఒకే ఒక కత్తెర పలుకు అది! దాని మధ్య స్క్రూ బిగించే రంధ్రం మాత్రం వుంది.

దాని పిడి అందమైన నగిషీలతో, తళతళ మెరిసే రంగు రంగుల రత్నాలు పొదిగి చాలా అందంగా కనిపిస్తోంది. నళిని గుండె గుభిల్లుమంది!!

చేతిలోని కత్తెరపలుకు ప్రాణం వున్న పాములా తోచి, విసిరేసింది నళిని. అది వెళ్ళి టేబిల్ కోడుకు తగిలి, దానికిందున్న చెత్తబుట్టలో పడిపోయింది.

భయభ్రాంతులతో నళిని కళ్ళల్లో మళ్ళీ కారుచీకట్లు కమ్ముకొస్తాగాయి. కిందపడకుండా యెడంచేతిని నేల కానించింది. అంతే! అరచేతికేదో జిగటగా తగిలి, ఉలిక్కిపడి చెయ్యి లాగేసుకుంది.

రక్తం! ఎర్రగా, జిగటగా అంటిన రక్తం!!

ఆమె నరాలన్నీ ఒక్కసారి జివ్వుమన్నాయి.

'అంటీ రక్తం!'

కరెంటు షాక్ తగిలినట్టు లేచి నిల్చుంది నళిని. అప్రయత్నంగా ఆమె కుడిచెయ్యి బ్లౌజు లోపలికి మారి మడతపెట్టి వున్న కర్చీఫ్‌ను బైటికి లాగింది. గజగజ వణుకుతూ దాంతో యెడంచేతికంటిన రక్తాన్ని తుడవసాగింది. ఇంకా పూర్తిగా తుడపకముందే వెనక తలుపువద్ద అడుగుల శబ్దం విని, అదిరిపడి వెనుతిరిగి చూసింది!

గుమ్మంలో ఓ అపరిచితుడు నిల్చున్నాడు! యాభై, యాభై అయిదేళ్ళుంటాయతనికి. మామూలు ఒడ్డూపొడుగే అయినా, అంత వయసులోనూ పుష్టిగా, బలిష్టంగా కనిపిస్తున్నాడు. పల్చని జుత్తు. చురుకైన కళ్ళు. మెడలో టై కట్టుకోకుండా, పైన కోటు తొడుక్కున్నాడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది నళినికి తన చేతిలో రక్తపు రుమాలున్న సంగతి. దాన్ని యెక్కడ పారేద్దామా అని, బెదిరిన లేడిలా అటూ, ఇటూ చూడసాగింది.

"అమ్మాయ్! నిల్చున్న చోటినించి కదలక! అక్కడే వుండు" అంటూ గదిలో ప్రవేశించాడతను.

కిందపడున్న రమాదేవిని చూడగానే దిగ్భ్రమతో అతని నోరు తెరుచుకుంది!

అదే అదననుకుని చేతిలో వున్న రుమాలు జారవిడిచింది నళిని.

"అమ్మాయ్! ముందే చెప్పాను. కదలొద్దని. బుద్ధిగా నిల్చో!" అంటూ కింద కూర్చుని, రమాదేవి చెయ్యి ముట్టుకున్నాడతను,

ఎండిన గొంతుతో అతికష్టంమీద అడిగింది నళిని.

"ఆ....ఆంటీ....చనిపోయిందా?"

అతను పలకలేదు! లేచి నిల్చుని కాసేపామెను పరీక్షగా చూసి, "నువ్వు డాక్టర్ శ్రీకాంత్ కూతురివి కదూ?" అడిగాడు.

తలూపింది నళిని ఆశ్చర్యంగా! అదివరకతన్నెక్కడా చూసిన గుర్తులేదు. మరి తనగురించి ఎలా తెలుసతనికి?

"ఈ సమయంలో ఇక్కడేం చేస్తున్నావ్?"

"ఆంటీని చూట్టానికి వచ్చాను."

"ఎప్పుడు?"

"మూడు గంటలకు."

అతను చేతిగడియారం చూసుకుని, "ఇప్పుడు నాలుగున్నర అవుతోంది. ఇంతసేపూ ఏంజేస్తున్నావ్?" అడిగాడు కటువుగా.

జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించింది నళిని. అతను పిడికిలి బిగించి, గడ్డంరాసుకుంటూ తీవ్రాలోచనలో పడిపోయాడు. కనిపించిందతనికి నేలమీద రుమాలు!

"నీదేనా అది?"

తలూపింది నళిని భయంగా.

"దానిమీద రక్తపు మరకలెలా వచ్చాయి?"

చెప్పింది నళిని వణికే స్వరంతో.

అతను ఇంకేదో అడగాలని నోరు తెరిచాడు. అంతే! తెరిచి వున్న కిటికీగుండా ఏదో రివ్వున దూసుకొచ్చి గదిలో పడింది. భయంతో కెవ్వుమంది నళిని! అతను మెరుపులా కిటికీని సమీపించి, తొంగిచూశాడు. అది ఇంటి వెనక తోట. యెవరూ లేరక్కడ! ఆ కిటికీకి లావుపాటి చువ్వలు బిగించి వున్నాయి.

అతను చటుక్కున వెనుదిరిగి, నేలమీదకి దిక్కులు

పారించాడు. ఓ మూల పడున్న రాయి కనిపించింది. "భయపడక! ఎవడో పోకిరీ కుర్రాడు కిందినించి రాయి విసిరి పారిపోయినట్టున్నాడు....

ఇక నా ప్రశ్నలకు సూటిగా జవాబులివ్వు. నువ్వు వచ్చినప్పుడు రమాదేవి బ్రతికేవుందా?"

"ఔను. ఆమె జపనీస్ భాషలో కోమికాషితో ఏదో అనడం నా చెవులారా విన్నాను."

"అది రమాదేవి కంఠమేనని ఖచ్చితంగా చెప్ప గలవా?"

"ఔను. అందులో రయిలాంటి సందేహంలేదు."

"లెటర్ పాడ్‌తో ఈ గదిలోకి వచ్చిన కోమికాషీ ఎంత సేపుందిక్కడ?''

"అరనిమిషానికి మించి వుండదు. తరవాత, తలుపు దగ్గరగావేసి, నాతో మాట్లాడి వెళ్ళిపోయింది."

"ఆ క్షణంనించీ నువ్వు బైట సోఫాలో వున్నా నంటున్నావ్?"

"ఔను. అరక్షణం కూడా ఎక్కడికీ వెళ్ళలేదు. పత్రిక తిరగేస్తూ కొద్దిగా కునుకు తీశానంతే!"

"నీ నిద్ర ఎటువంటిది?"

"నేను నిద్రపోలేగా? కేవలం కళ్ళు మూసుకు న్నాను."

"ఆ మగతలో ఎవ్వరైనా ఇటువచ్చివుంటే వెంటనే కళ్ళు తెరిచేదానినన్నమాట!"

"ఔను. చీమ చిటుకుమన్నా కళ్ళు తెరిచే అలవాటు నాది. మొదటిసారి ఫోన్ మోగగానే ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను."

"దీన్నిబట్టి బైటినించి ఎవ్వరూ లోపలకు రాలేదనీ

స్పష్టమౌతోంది. ఔనా?"

తలూపింది నళిని.

"కామాక్షీ తెచ్చిన లెటర్ పాడ్ ఇదేనా?" అడిగాడతను టేబిల్ మీదకి చూపుతూ.

తలూపింది నళిని.

లెటర్ పాడ్ కవర్ పేజీ తెరిచివుంది. కలం కూడా వుంది తెల్ల పేజీమీద. ఐతే ఏమీ రాయబడలేదు దానిపై. మరి దాన్ని ఎందుకు తెప్పించింది రమాదేవి? ఆలోచిస్తూ టేబిల్ కిందికి చూశాడతను. చెత్తబుట్ట పక్కన ఉండచుట్టి పడున్న ఓ కాగితం కనిపించింది. జేబులోంచి రుమాలుతీసి, దాన్నందుకుని మడత విప్పాడు.

'మిష్టర్ మూర్తీ' అని ప్రారంభించి, సగం పేజీ వరకూ రాసిన ఉత్తరం అది.

ఆ పేరు చూడగానే చటుక్కున జ్ఞాపకంవచ్చింది నళినికి. సత్యనారాయణమూర్తి అనే అతను ఆమె ఫామిలీ లాయర్ అని!

"లాయర్ కు రాయాలనే ఉద్దేశంతో ఉత్తరం ప్రారంభించి, మధ్యలో ఆపి, పేజీ చింపేసినట్టుంది. ఈ పేజీ లెటర్ పాడ్ కు సంబంధించినదే అయుండాలి" అంటూ ఆ కాగితాన్ని తిరిగి వుండగా చుట్టి, యథాస్థానంలో కింద పడేశాడతను.

తరవాత నళినిని పరీక్షగా చూసి, "నువ్వు వచ్చినప్పుడు రమాదేవి సజీవంగానే వుంది. అప్పటినించీ గదిలో ఫోన్ మోగేవరకూ నువ్వు బైటే వున్నావ్. యెవ్వరూ ఇటు రావడంగానీ, గదిలోంచి బైటికెళ్ళడంగానీ, జరగలేదు. దీన్నిబట్టి పోలీసులేమనుకుంటారో తెలుసా?"

"ఏమనుకుంటారు?"

"రమాదేవిని నువ్వే చంపావని!"

నళిని రోమాలు నిక్కబొడుచుకున్నాయి భయంతో.

"ఈ గదిలోకి రావడానికి మరో మార్గం ఏదైనా వుందా?" అడిగాడతను ఆలోచిస్తూ.

హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది నళినికి. "ఆఁ, వుంది! అదుగో, ఆ గోడకు వేళ్ళాడుతున్న కర్టెన్ వెనక ఓ తలుపుంది. అది తెరిస్తే మెట్లు కనిపిస్తాయి. ఆ మెట్లెక్కితే పైన ఓ గది వస్తుంది. అదే ఆంటీ అసలు రైటింగ్ రూం! అందులో కూర్చొని ఆమె రచనలు చేస్తుంది!"

అతను క్షణం ఆలస్యం చెయ్యకుండా ఆ కర్టెన్ వైపు వెళ్ళి, చేత్తో దాన్ని తొలగించి చూశాడు. కనిపించింది. తలుపు మూసివుంది! అంతేకాదు, గడియ బిగించి ఆక్కడు బరువు తాళం వేసివుంది.

సడన్‌గా ఏదో జ్ఞాపకం వచ్చినట్టు చేతిగడియారం చూసుకున్నాడతను. "మై గాడ్! కేవలం ఐదు నిమిషాలే వుంది. ఐదు నిమిషాల్లో ఓ వ్యక్తి ఇక్కడికి రాబోతున్నాడు."

"ఎవరు?"

"పోలీస్ ఇన్‌స్పెక్టర్!"

"ఇన్‌స్పెక్టరా!?"

"ఔను. సరిగ్గా ఐదు గంటలకు రమాదేవిని కలుసుకోడానికి ఓ పోలీస్ ఇన్‌స్పెక్టర్ యిక్కడికి రాబోతున్నాడని నాకు బాగా తెలుసు. ఇప్పుడు చెప్పు. ఆత్మసాక్షిగా నిజం చెప్పాలి. హత్య నువ్వు చెయ్యలేదా?"

"లేదు. నమ్మండి. భగవంతుడి సాక్షిగా చెబుతున్నాను."

"మనిషి మొహంచూసి, ఆ మనిషి మన సత్యాన్ని అంచనావేసే శైపుణ్యం వుంది నాకు. నిన్ను చూస్తోంటే, హత్య చెయ్యలేదనే అనిపిస్తోంది. ఇప్పుడు నిన్ను కాపాడటానికి ఏదో ఒక మార్గం అన్వేషించక తప్పదు" అంటూ గబగబ గదంతా గాలించసాగాడతను.

కనిపించింది తాళంచెవి బల్లసొరుగులో కాగితాల మధ్య! అతని కళ్ళు మెరిశాయి. దాంతో కర్టెన్ వెనక వున్న తలుపు తాళంతీసి, తిరిగి ఆ తాళాన్ని కొక్కానికి వేసి, తలుపు బార్లా తోసి, జేబు రుమాలుతో దాని మీద పడ్డ తన వేలిముద్రల్ని శుభ్రంజేసి, తాళంచెవిని తిరిగి టేబిల్ సొరుగులో పడేసి మూసేశాడు.

తరవాత, కిందపడున్న రుమాలు చూపుతూ, "తక్షణం దాన్ని పక్క గదిలోకి తీసికెళ్ళి కాల్చి, బూడిద అరాక, చెత్తబుట్టలో పడెయ్. సబ్ ఇన్‌స్పెక్టర్ రావడానికింకా మూడు నిమిషాలే వున్నాయి" అంటూ లైటర్ తీసి అందించాడు.

నళిని వణికే చేత్తో రుమాలూ, లైటర్ అందుకుని, పక్క గదిలోకి నడిచింది. రుమాలు నేలమీద పెట్టి అంటించే మరక పడుతుంది. అందుకని, ఓ కొస పట్టుకుని, లైటర్ వెలిగించి అంటించింది. రుమాలు కాలి ఆరిపోయాక, ఆ బూడిదను ఓ మూల వున్న చెత్తబుట్టలో పడేసింది.

అదే సమయంలో పడగ్గదిలో టెలిఫోన్ నెంబర్ తిప్పుతున్న చప్పుడైంది. ఆ తరవాత ఆ వ్యక్తి కంఠం వినిపించింది. "హలో, పోలీస్ హెడ్‌క్వార్టర్స్! నేను

రచయిత్రి రమాదేవి ఇంటినించి మాట్లాడుతున్నాను. ఆమె హత్య చెయ్యబడింది...."

తడబడే అడుగులతో ఆ గదిలోకి నడిచింది నళిని. అప్పుడే అతను రిసీవర్ రెస్టుమీదుంచి, రైటింగ్ రూం వైపు నడుస్తున్నాడు. రెండు నిమిషాల తరువాత వెంటనే పడగ్గదిలోకి వచ్చేశాడు.

"ఆ గదిలో కిటికీలు లేవు. ఐతే, కిటికీని పోలిన ఓ వెంటిలేటర్ మాత్రం వుంది. పోలీసులొచ్చి నిన్ను ప్రశ్నిస్తే ఈ విషయాలేవీ చెప్పకూడదు. హంతకుడు ఆ వెంటిలేటర్ గుండానే రైటింగ్ రూంలోకి దూకి, మెట్లు దిగి, తెరిచివున్న తలుపుగుండా ఈ గదిలోకి ప్రవేశించి, రమాదేవిని చంపేసి, నిశ్శబ్దంగా అదే దారిన వెళ్ళిపోయుంటాడనుకుంటారు వాళ్ళు.

నువ్వు సోఫాలో పడుకుని, పత్రిక చదువుతూ నిద్రపోవడంవల్ల లోపల యెటువంటి శబ్దమూ వినలేకపోయావు. అర్థమైందా? అలాగే చెప్పాలి. నిన్ను కాపాడాలనే ఉద్దేశంతోనే ఇటువంటి తీవ్రమైన రిస్కు తీసుకుంటున్నాను.

పోలీసులకు భయపడి నిజం చెప్పావంటే, నేరస్తులకు సహకరించావనే నేరం మీద నీతోబాటు నన్నూ లాకప్‌లో పడేస్తారు జాగ్రత్త!"

తలూపింది నళిని యాంత్రికంగా. ఆ సమయంలో ఆ వ్యక్తి తనను కాపాడటానికి వచ్చిన ఆపద్బాంధవుడిలాగే కనిపించాడామెకు. "ఇంతకీ మీరెవరో తెలుసుకోవచ్చా?" అడిగింది కుతూహలాన్ని అపుకోలేక.

"నా పేరు రామారావు! ప్రైవేట్ ఇన్వెస్టిగేటర్ని! రిటైర్డు పోలీస్ ఇన్‌స్పెక్టర్ని! పాతికేళ్ళు పోలీస్ డిపార్టు

మెంట్లో పనిజేసి, పెన్షన్ పుచ్చుకున్నాక, ప్రైవేట్ ఇన్వెస్టిగేటర్ వృత్తి ప్రారంభించాను...." అతని మాట పూర్తికాకముందే వెనక అడుగుల చప్పుడు విని, ఉలిక్కి పడి వెనుతిరిగింది నళిని.

యూనిఫాంలో వున్న పోలీ సబిన్స్పెక్టర్!

రామారావుని చూడగానే అతని కళ్ళు పెద్ద వయ్యాయి. "హలో సార్! మీరెలా వచ్చారిక్కడికి?" అడిగాడు ఆశ్చర్యంగా.

రామారావు నవ్వి—"నడుస్తూ వచ్చాను. బహుశా మీరు రమాదేవిని కలుసుకోడానికి వచ్చారనుకుంటాను" అన్నాడు.

తలూపాడు సబిన్స్పెక్టర్.

"సారీ, ఇక ఎన్నడూ ఆమెని మీరు కలుసుకోలేరు."

"ఏం?"

వేలితో నేలమీదికి చూపాడు రామారావ్. సబిన్స్పెక్టర్ నాలుగడుగులు ముందుకు వేసి, రమాదేవి శవాన్ని చూసి కొయ్యబారిపోయాడు. "మై....గాడ్! ఎలా జరిగింది?"

సరిగ్గా అదే సమయంలో బైట పోలీస్ ఫ్లైంగ్ స్క్వాడ్ సైరన్ వినిపించింది వారికి!

## 3

అజానుబాహులైన ఓ ఇన్స్పెక్టర్, సార్జంట్, కానిస్టేబుళ్ళు, పోలీస్ డాక్టర్, ఫోటోగ్రాఫర్, ఫింగర్ ప్రింట్ ఎక్స్పర్టు బిలబిల వచ్చారు లోనికి. ఆ ఇన్స్పెక్టర్ని చూడగానే రామారావు ముందుకెళ్ళి, ఎంతో సాదరంగా విష్ చేశాడు పాత పరిచయస్తుడిలా!

అప్పుడు తెలిసింది నళినికి, అతను మద్రాసులో ఎంతో

పరపతివున్న క్రయింబ్రాంచి ఇన్ స్పెక్టర్ యుగంధర రెడ్డి అని. సుమారు రెండుగంటలపాటు ఆ ఇంట్లో పోలీసుల హడావుడి కొనసాగింది. ఫోటోగ్రాఫర్, ఫింగర్ ప్రింట్ ఎక్స్ పర్టు, డాక్టర్ తమతమ పనులు పూర్తిజేసుకున్నారు.

తరవాత ఇన్ స్పెక్టర్ యుగంధరరెడ్డి ప్రశ్నలవర్షం ప్రారంభమైంది. రామారావూ, నళినీ తామక్కడికి వచ్చినప్పట్నించీ జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించారు, రైటింగ్ రూం తలుపు తెరిచిపెట్టడం తప్ప!

తరవాత స్థానిక పనిమనిషినీ, జపాన్ సేవకురాలినీ ప్రశ్నలతో ముంచెత్తాడు ఇన్ స్పెక్టర్.

వారు వెళ్ళిపోయాక, రామారావు వైపు తిరిగి, "ఇప్పుడు చెప్పండి. మీరెందుకొచ్చారిక్కడికి?" అడిగాడు.

"రమాదేవిని కలుసుకోవాలని!"

"అదే, ఎందుకూ అని?"

"ఆవిడే నాకు ఫోన్ చేసి పిలిపించింది!"

"కారణం అడగలేదా మీరు?"

"లేదు. వచ్చాక యెలాగూ తెలుస్తుందికదా అని!"

సాలోచనగా తలూపుతూ నళినివైపు తిరిగాడు ఇన్ స్పెక్టర్. "మీ నాన్నగారెక్కడున్నారు?"

"ఏథెన్స్ లో జరగనున్న ప్రపంచ కేన్సర్ స్పెషలిస్టుల మహాసభలో పాల్గొనడానికి ఈ రోజే ఓడలో ప్రయాణమయ్యారు."

"మెసేజ్ పంపి ఆయన్ని పిలిపించమంటావా?"

"పిలిపిస్తే నాకు చాలా మేలుచేసినవారౌతారు."

సాలోచనగా తలూపి, వారి వాఙ్మూలాలు రాసుకుని, సంతకాలు చేయించుకుని, "ఇక మీరు వెళ్ళొచ్చు. ఐతే,

మా అనుమతిలేనిదే మద్రాసు వదిలి ఎక్కడికీ పోకూడదు" అన్నాడు.

బ్రతుకు జీవుడా అనుకుంటూ గదిలోంచి బైటికి నడిచారిద్దరూ.

## 4

తండ్రిని చూడగానే పరిగెత్తికెళ్ళి వాటేసుకుని, వెక్కి వెక్కి ఏడవసాగింది నళిని. దుఃఖాతిశయంతో ఆయన మొహం జేవురించి వుంది. మాట పెగలడంలేదు. కాసేపు మౌనంగా కూతురి వీపు నిమిరి, "ఊరుకోమ్మా, ఊరుకో! నే వచ్చేశాగా, ఇంకెందుకు భయం?" అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి నన్ననుమానిస్తున్నారు నాన్నా!" అంది నళిని కొంగుతో కళ్ళద్దుకుంటూ.

అంతవరకూ జేవురించివున్న డాక్టర్ శ్రీకాంత్ మొహం ఆ మాట వినగానే వాలిపోయింది.

"అలాగా! నాతోబాటు బయలుదేరిన డిటెక్టివ్ దుర్యోధన్ కూడా తన ప్రయాణం రద్దు చేసుకుని, మద్రాసు వచ్చేశారు. వివరాలు తెలుసుకోడానికి హార్బర్ నించి తిన్నగా పోలీస్ హెడ్‌క్వార్టర్స్ వెళ్ళారు. కాసేపట్లో ఇక్కడికి రావచ్చు. ఆయన తప్పకుండా ఈ రొంపిలోంచి నిన్ను కాపాడతారు. భయపడక!" అంటూ కూతురి తల నిమిరి, ఇంట్లోకి తీసికెళ్ళాడు.

అదే సమయంలో ఓ టాక్సీ వచ్చి పోర్టికోలో ఆగింది. డిటెక్టివ్ దుర్యోధన్ దిగి, డ్రైవర్‌కు బిల్లు చెల్లించి, హాల్లో అడుగుపెట్టాడు. డాక్టర్ తన కూతుర్ని ఆయనకు పరిచయంజేసి, ఇన్‌స్పెక్టర్ ఆమె ననుమానిస్తున్న సంగతి చెప్పాడు.

దుర్యోధన్ సాలోచనగా తలూపి, "తెలుసు. ఇప్పుడే ఆయనతో మాట్లాడుతున్నాను. ఉండండి. ఆ ప్రైవేట్ ఇన్వెస్టిగేటర్ రామారావుని కూడా పిలిపించి మరికొన్ని విషయాలు తెలుసుకోవాలి" అంటూ టీపాయ్ మీద టెలిఫోన్ అందుకున్నాడు.

డైరెక్టరీ తిరగేసి, అతని ఫోన్ నెంబర్ కనుక్కొని, రింగ్ చేశాడు. అదృష్టవశాత్తూ రామారావే రిసీవరెత్తాడతను. దుర్యోధన్ తనని పరిచయం చేసుకుని, వెంటనే డాక్టర్ శ్రీకాంత్ ఇంటికి రావలసిందిగా కోరాడు.

అరగంట తరవాత వచ్చాడు రామారావు టాక్సీలో. అందరూ ఆసీనులయ్యాక దుర్యోధన్ నళినివైపు తిరిగి, "ఇప్పుడు చెప్పమ్మా! నువ్వు మీ ఆంటీ ఇంటికెళ్ళినప్పట్నించీ జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పు!" అన్నాడు.

నళిని అంతా వివరించింది, రామారావు రైటింగ్ రూం తలుపు తెరిచిపెట్టిన వైనం తప్ప.

దుర్యోధన్ నవ్వి—"అంతా బాగానే వుందిగానీ, నువ్వు ఇంకా ఏదో దాస్తున్నావని నా అనుమానం! అది కూడా చెప్పడానికి నీకు మరో అవకాశం ఇవ్వడం మంచిదని నా అభిప్రాయం! చెప్పు" అన్నాడు.

నళిని బెదిరిపోయి రావువైపు చూసింది. అతను కళ్ళతోనే సైగచేశాడు చెప్పొద్దని.

అది గమనించిన దుర్యోధన్, రామారావుని సంబోధించి, "రావుగారూ! ఇంతక్రితం ఇన్స్పెక్టర్ యుగంధరరెడ్డితో నేను మాట్లాడినప్పుడు రమాదేవిని మీరూ, నళినీ కలిసి సంయుక్తంగా హత్య చేశారని అనుమానం వ్యక్తం చేశాడు. దీనికేమంటారు?" అడిగాడు.

"అబద్ధం! నళిని తరవాతే నే నక్కడికెళ్ళాను."

"అంతవరకూ బాగానే వుంది. కానీ హంతకుడు రైటింగ్ రూంలోని వెంటిలేటర్‌గుండా పడగ్గదిలోకి వచ్చి, అక్కడ కూర్చున్న రమాదేవిని చంపి, తిరిగి ఆ మార్గానే బైటపడుంటాడన్న మీ థియరీ ఇన్‌స్పెక్టర్ని నమ్మించడంలేదు.

కారణం, ఆ వెంటిలేటర్ నేలకు నలభై అడుగుల ఎత్తులో వుంది. అక్కణ్ణించి గది కప్పు పది అడుగుల ఎత్తు వుంది. బహుశా, నా అభిప్రాయం మీకర్థమై వుంటుందనుకుంటాను."

"అంటే, అంత ఎత్తులో వున్న వెంటిలేటర్‌గుండా మానవమాత్రుడెవ్వడూ లోనికి ప్రవేశించడం అసంభవ మంటారా?"

"తలచుకుంటే మానవుడికి సంభవం కానిదంటూ ఏదీలేదు. మృత్యువును జయించడం తప్ప! ఐతే, మీ థియరీని ఎవరి మేథస్సూ అంగీకరించదు. అంతేకాదు, ఆ హత్య జరిగినప్పటినించి మీరు నళినిని నీడలా కనిపెట్టి వున్నారని చెప్పాడు ఇన్‌స్పెక్టర్. దీనికేమంటారు?"

"అది నా వృత్తికి సంబంధించిన విషయం! జవా.."

మధ్యలో కలగజేసుకున్నాడు డాక్టర్ — "మీరు నా కూతుర్ని వాచ్ చేస్తున్నప్పుడు అది మీ స్వంత విషయమెలా అవుతుంది?"

దుర్యోధన్ నళినివైపు చూసి, "చెప్పమ్మా! ఈయన నీతో ఏదైనా దాచమని చెప్పారా?" అడిగాడు.

అప్పటికే బాగా బెదిరిపోయివున్న నళిని మెల్లగా తలూపింది!

"ఓహో! ఆమె ఆ రహస్యాన్ని యెవరితోనైనా చెబుతుందేమోనని ఆమెమీద ఓ కన్నేసి వుంచారన్న

మాట! నళినీ, నేను మీ నాన్న స్నేహితుణ్ని. ఆయన కోసమే నా ప్రయాణం రద్దుచేసుకుని వచ్చాను. నీ క్షేమం కావాలనుకుంటే దాచకుండా జరిగింది చెప్పేయ్!"

నళిని రామారావువైపు తిరిగి, "క్షమించండి! అంకుల్ ముందూ నాన్న ముందూ నేనేమీ దాచిపెట్టదలచుకో లేదు" అంది.

"చాలా పెద్ద పొరపాటు చేస్తున్నావు నళినీ....ఆ తరవాత నీ ఇష్టం!" అన్నాడు రామారావు తల వంచు కుంటూ.

చెప్పింది నళిని జరిగింది జరిగినట్టు.

అంతా విన్న దుర్యోధన్ భ్రుకుటి ముడిపడింది. "చాలా చిత్రమైన విషయం! రమాదేవి కూర్చున్న పడ గదిలోకి ప్రవేశించగలిగే రైటింగ్ రూం తలుపు లోపలి వైపు తాళం వేసుంది. పడగది బైట తలుపుముందు నువ్వు పడుకున్నావ్ నిద్రపోకుండా!

మరి హంతకుడు రమాదేవిని ఎలా హత్యచేశాడు? తిరిగి ఎలా పారిపోయాడు? నమ్మశక్యంకాని అద్భుతం ఇది! రామారావుగారు రైటింగ్ రూం తాళాలుతీసి, తలుపు తెరిచిపెట్టడం ఒక విధంగా మంచిదే అయింది. లేకుంటే ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి అప్పుడే నిన్ను అరెస్టు చేసేవాడు.

ఆల్‌రైట్! రమాదేవి మరణించేముందు రైటింగ్ పాడ్ మీద తన లాయర్‌కు ఉత్తరం ప్రారంభించి, మధ్యలో ఆపి, ఆ కాగితాన్ని వుండచుట్టి చెత్తబుట్టలో పడేసిం దన్నావు కదూ? ఒకసారి నేనా గదిని క్షుణ్ణంగా పరిశీ లించాలనుకుంటున్నాను. పదండి, వెళదాం!

వెళ్ళేముందు ఆమె లాయర్ కూ, ఇన్ స్పెక్టర్ యుగంధరరెడ్డికీ ఫోన్ చేసి, అక్కడికి రమ్మని కోరు తాను" అంటూ టీపాయ్ మీద ఫోన్ రిసీవ రందుకున్నాడు దుర్యోధన్.

# 5

అరగంట తరవాత అందరూ రమాదేవి ఇంట్లో, ఆమె మృతిచెందిన పడగ్గదిలో, పోగయ్యారు.

హత్య జరక్కముందు తాను వ్యక్తిగతంగా ఓ పోలీ సాఫీసర్ తో మాట్లాడదలచానని రమాదేవి మీకు ఫోన్ చేసిందన్నారు కదూ? అడిగాడు దుర్యోధన్ ఇన్ స్పెక్టర్ యుగంధరరెడ్డిని.

"ఔను. సాధారణంగా అలా ఎవరైనా మాట్లాడ దలిస్తే, హెడ్ క్వార్టర్స్ కే వచ్చి మాట్లాడమంటాంగానీ, ఆమెకున్న పేరుప్రతిష్టలూ, గౌరవాన్నీ దృష్టిలో వుంచు కుని, నేనే ఓ సబిన్ స్పెక్టర్ని పంపాను మాట్లాడిరమ్మని. అతనిక్కడికి చేరేలోపలే హత్య జరిగిపోయింది" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"పోలీసాఫీసర్ని ఇంటికి పిలిపించి ఆమె ఏం మాట్లాడ దలచిందో, ఇప్పుడు పెద్ద సమస్యగా మిగిలిపోయింది మనకు!"

"ఆ సమస్యనిప్పుడు మనం పరిష్కరించడం కష్టమే! ఐతే, మిస్టర్ రామారావు మాత్రం నేను వేసే కొన్ని ప్రశ్నలకు జవాబులిస్తే ప్రస్తుత సమస్యలు కొన్ని పరిష్క రింపబడవచ్చు."

"ఏమిటవి?" అడిగాడు రామారావు కనుబొమలు ముడుస్తూ.

"హత్య జరిగిన రోజే కాదు, అంతక్రితం కూడా

మీరిక్కడికి రెండుమూడుసార్లు వచ్చి రమాదేవిని కలి శారట, నిజమేనా?"

"ఎవరన్నారు మీతో?"

"జపనీస్ సేవకురాలు కోమీకాషీ, స్థానిక పనిమనిషి పంకజం!"

రామారావు పలకలేదు.

"దీన్నిబట్టి, రమాదేవి మిమ్మల్ని ఏదో పనిమీద నియమించి వుంటుందని తెలుస్తోంది. నిజమేనా?"

"మా క్లయింట్స్‌కు సంబంధించిన విషయాలు రహస్యంగా వుంచడం మా విధి. అలా అని మా ఒప్పందాల్లో స్పష్టంగా వుంటుంది. సారీ, చెప్పలేను!"

సరిగ్గా అదే క్షణంలో దుర్యోధన్ దృష్టి ఓ మూల స్టాండుకు వేలాడుతున్న ఓ అందమైన ఖాళీ పంజరంమీద పడింది. "ఆ పంజరం ఏమిటి? ఇంతకుముందు అందులో ఏదైనా పక్షి వుండేదా? లేక, కేవలం అలంకరణ కోసం వేలాడదీశారా?"

"తెలీదు. మేము వచ్చినప్పుడు ఆ పంజరం అలాగే ఖాళీగా వుంది. నళినీ, నువ్విక్కడికి వచ్చినప్పుడందులో ఏదైనా పక్షిని చూశావా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఖంగారులో నే నవేమీ గమనించలేదండీ!"

"నేను గమనించాను. పంజరం ఖాళీగా వుంది" అన్నాడు రామారావు మధ్యలో.

"డాక్టరుగారూ! మీకైనా తెలిసుండాలి. రమాదేవి ఆ పంజరంలో ఏదైనా పక్షిని, అంటే రామచిలకను పెంచేదా?" అడిగాడు దుర్యోధన్.

"రామచిలకని కాదు! ఓ విచిత్రమైన పక్షిని పెంచేది,

అటువంటి పక్షి మనదేశంలో యెక్కడా కనిపించదు. ఆమె జపాన్నుంచి వచ్చేటప్పుడే దాన్ని వెంటతీసుకొచ్చిందట. నాకన్నా, కోమిలాక్షికే దాని గురించి బాగా తెలుసు" అన్నాడు డాక్టర్ శ్రీకాంత్.

ఇన్‌స్పెక్టర్ కోమిలాక్షిని తీసుకురావడానికి బైటికెళ్ళాడు.

ఐదునిమిషాల తరవాత ఆమె ఓ పంజరం పట్టుకుని, అతని వెంట వచ్చిందక్కడికి. వారి వెనకే స్థానిక పనిమనిషి పంకజం కూడా వుంది. అందరూ ఆ పంజరంవైపే చూడసాగారు ఆశ్చర్యంగా! అందులో కోకిలపైజులో వున్న ఓ చిత్రమైన పక్షి కూర్చునుంది.

దాని ఈకలన్నీ బంగారు రంగులో తళతళ మెరుస్తున్నాయి. కంఠంచుట్టూ ఎరుపురంగు ఈకలు. తలమీద పొడవాటి పలిరంగు ఈకలు మొలిచి, కలికితురాయిలా కనిపిస్తున్నాయి. కళ్ళచుట్టూ గుండ్రని తెల్లనిగీతలు. ఆకుపచ్చరంగు కాళ్ళు. ముక్కు మామూలు పక్షులకన్నా కాస్త గట్టిగా, పొడవుగా వుండి, చివర కాస్త వంగి వుంది. పొడవాటి తోక చివర నేరేడు రంగు చుక్కలు!

"అద్భుతమైన పక్షి! దీని పేరేమిటి?" అడిగాడు దుర్యోధన్.

సరిగ్గా అదే క్షణంలో ఆ పక్షి అరిచింది! కర్ణకఠోరంగా, భయంకరంగా వున్న ఆ అరుపుకు చెవులు మూసుకుంది నళిని.

"భగవంతుని సృష్టి కూడా యెంత విచిత్రమైనదో చూడండి! కారు నలుపుతో అందవిహీనంగా వుండే కోకిలకు మనసును రంజింపజేసే మధుర కంఠాన్ని, కనుల విందుచేసే ఈ పంచరంగు పక్షికి ఇలాటి కర్ణకఠోర

కంఠాన్ని ప్రసాదించాడు. దీని పేరేమిటి?" అడిగాడు దుర్యోధన్ మళ్ళీ.

"లూచో!" అంది కోమీకాక్షి.

"ఇది ఆ పంజరంలోనే వుంటుందా?" అడిగాడు దుర్యోధన్ స్టాండుకు వేళాడుతున్న ఖాళీ పంజరం చూపుతూ.

"ఔన్! ఐతే, దీనికూట చాలా భయంకరంగా వుంటుండి గనక, అమ్మగారిక్కి డిస్టర్బ్ అవుతుండని ఆమె రాసేటవ్డూ, నిద్రపోయేటవ్డూ దీన్ని కిండిక్కి టీస్కుపొమ్మంటార్ నాటో!" చెప్పింది కోమీకాక్షి వచ్చీరాని తెలుగులో.

"జపాన్నించి తనవెంట తెచ్చుకున్నారంటే, మీ అమ్మగారికి దీనిమీద యెంతో ప్రేమ ఉండివుండాలి కదూ?"

కోమీ జవాబివ్వకముందే స్థానిక పనిమనిషి పంకజం అందుకుంది. "ఔను బాబుగారూ! ఎంతగా ప్రేమించే వారంటే, ఒకరోజు దీనికోసం నన్ను ఉన్న పళాన పనిలోంచి తీసెయ్యబోయారు."

"ఎందుకూ?"

"రోజూ దీనికి ఆహారం పెట్టి, ఇది రెట్టలు వేసిన పంజరాలు, శుభ్రంచేసే పని నాదే. అందుకే రెండు పంజరాలు వాడతారు. రాత్రంతా ఇది ఓ పంజరంలో వుండి రెట్టలువేస్తే, ఉదయం దాన్ని మరో పంజరంలోకి మార్చి, ఆ పంజరాన్ని శుభ్రంచేసి వుంచుతాను. పగలంతా ఇది ఇంట్లోనే వుంటుంది గనక, సాయంత్రం పూట తోటలో తిప్పి తీసుకురావాలి. అక్కడే పంజరాలు మార్చి, శుభ్రంచేస్తుంటాను. అలా ఒకరోజు

దీన్ని ఒక పంజరంలోంచి తీసి మరో పంజరంలో పెట్టబోతుంటే, నా చేతుల్ని గోళ్ళతో గీరి యెగిరి ఇంటిమీద కూర్చుంది!

కిటికీలోంచి ఆదృశ్యాన్ని చూసిన అమ్మగారు రుద్రకాళిలా పరిగెత్తుకొచ్చి నన్ను కొట్టినంత పనిచేశారు. ఇద్దరం కలిసి, గంటసేపు తంటాలుపడితే మళ్ళీ మా చేతికి చిక్కిందది!"

కామాక్షి కోపంతో పంకజంవైపు చూసి, "నువ్ మంచిపిల్లవ్ కావ్! యెప్పుడూ అమ్మగార్నీ, డీన్ని తిడుటుంటావ్!" అంది.

భయంతో తల దించుకుంది పంకజం.

దుర్యోధన్ కు సడన్ గా ఏదో జ్ఞాపకంవచ్చి, ఇన్స్పెక్టర్ వైపు తిరిగి, "రెడ్డిగారూ! రమాదేవి మరణించే ముందు లాయర్ సత్యనారాయణమూర్తిగారి పేర రాయబోయిన ఉత్తరం ఎక్కడుంది?" అడిగాడు.

"అదుగో, టేబిల్ మీద అలాగే వుంచాను. హత్య జరిగిన రోజు టేబిల్ కింద చెత్తబుట్టదగ్గర వుండచుట్టి పడుంది" చెప్పాడు ఇన్ స్పెక్టర్.

"దాన్నక్కడ ఎవరు పడేసుంటారు?"

"హత్యానంతరం హంతకుడే దాన్ని లెటర్ పాడ్ లోంచి చింపి పడేసుండాలి. లేదా, ఆమే ఉత్తరం పూర్తిచెయ్యకుండా ఉండచుట్టి పడేసుండాలి."

సాలోచనగా తలూపుతూ టేబిల్ మీంచి ఆ ఉత్తరం అందుకుని, బిగ్గరగా చదవసాగాడు దుర్యోధన్.

'మూర్తిగారూ!

నా కమర్షియల్ అకౌంట్స్ ఫైళ్ళు చూసుకున్నాక, విదేశీ భాషల్లోకి అనువదించబడ్డ నా

రచనల తాలూకు రాయల్టీలు వివిధ పబ్లిషర్లనించి ఇంకా చాలావరకు రావలసి వుందని తెలిసింది. అందులో అందరికన్నా యెక్కువగా అమెరికన్ పబ్లిషర్లనించి. మీరు ఆయా దేశాల పబ్లిషర్ల సేల్స్ అకౌంట్స్ చెక్ చేసి, నాకు రావలసిన మొత్తాలను సాధ్యమైనంత త్వరగా తెప్పించే ఏర్పాటు చెయ్యండి.

అంతేకాదు, మరో ముఖ్యమైన విషయంలో కూడా మీ సహాయం కావాలి నాకు. ఇన్నాళ్లూ ఎవరికీ తెలియని ఒక రహస్యాన్ని మీకు తెల్పడానికి ఈ ఉత్తరం రాస్తున్నాను. నాకు సంపూర్ణ విశ్వాసం వుంది. నా ఈ రహస్యాన్ని మీరు రహస్యంగానే....'

అక్కడ ముగిసింది ఉత్తరం!

"ఆమె మీకు రాయాలనుకున్న రహస్యమేమిటో రాయకుండానే చనిపోయింది. ఆ రహస్యం గురించి ఏదైనా ఐడియా వుందా మీకు?" అడిగాడు దుర్యోధన్, లాయర్ని.

"లేదు!"

"ఆమె మరణించే ముందు వీలునామా ఏదైనా రాసిందా?"

"ఔను."

"ఎవరి పేర?"

"ఎవరి పేరా కాదు, ఐతే, మాతృదేశం వదిలి, తన వెంట వచ్చి, ఇన్నాళ్లూ తనకు స్వంత మనిషిలా సేవలు చేసిన కామాక్షికి మాత్రం జీవితపర్యంతమూ నెలకు వెయ్యిరూపాయల చొప్పున చెల్లించే ఏర్పాట్లు చేసి,

మిగతా స్థిర చరాస్తులన్నీ వివిధ ధర్మసంస్థలకు చెందేలా చాలాకాలం క్రితమే విల్లురాసి నా వద్ద భద్రం చేసింది."

"దీన్నిబట్టి ఆమె చాలా ధనవంతురాలే అయుండాలని తెలుస్తోంది."

"మీరనుకుంటున్నట్టు గొప్ప ధనవంతురాలు కాకపోయినా, మరో నెలరోజులు బ్రతికివుంటే తప్పకుండా చాలా ధనవంతురాలై వుండేది."

అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"అదెలా?" అడిగాడు దుర్యోధన్ కుతూహలంగా.

"ఆమె దూరపు బంధువొకావిడ ఈమధ్య మరణిస్తూ పెద్ద ఆస్తి వదిలిపోయింది. వారసత్వం దృష్ట్యా ఆ ఆస్తి రమాదేవికే చెందుతుంది. ఐతే, ఆ ముసలావిడ షరతు ప్రకారం తన ఆస్తికి వారసులైనవారు నలభై ఏళ్ళు నిండినవారై వుండాలి. ఆ లెక్కన మరో నెల తరవాత ఆవిడకు సరిగ్గా నలభై ఏళ్ళు నిండేవి!"

"చాలా ఆసక్తికర విషయం! రమాదేవి మరణిస్తే ఆ ఆస్తి యెవరికి చెందుతుంది?"

"ఆమె దగ్గరి వారసులకు."

"వారసులు లేనిపక్షంలో?"

"ధర్మసంస్థలకు!"

"ఆమె వారసులూ, శతృవులూ యెవరై వుంటారు?" ఆలోచనాగ్రస్తుడై తనలో తను గొణుక్కున్నాడు ఇన్‌స్పెక్టర్.

"మనఊహాకందని శతృవులెవరో ఉండేవుంటారు...." అంటున్న దుర్యోధన్ దృష్టి అనుకోకుండా నేలమీద పడున్న రాయిపై నిలిచింది. వంగి, దాన్నందుకుని, నళిని వైపు చూస్తూ, "నువ్వూ, రామారావూ ఇక్కడుండగా

కిటికీలోంచి దూసుకొచ్చిన రాయి ఇదేనా?" అడిగాడు.

తలూపింది నళిని. దుర్యోధన్ కిటికీని సమీపించి, ఊచల్ని పరిశీలించాడు. లావుగా, దగ్గర దగ్గరగా వున్నాయి. కాసేపు బైటికి తొంగిచూసి, ఇన్‌స్పెక్టర్ని సమీపించాడు. "హత్య దేనితో జరిగింది?"

టేబిల్ కింద చెత్తబుట్టవైపు చూపాడు ఇన్‌స్పెక్టర్. "హత్యాయుధం అందులోనే వుంది. చూడండి"

దుర్యోధన్ చెత్తబుట్టలోంచి దాన్ని బైటికి తీసి, అటూ యిటూ తిప్పుతూ, "నా వృత్తిలో ఇంతవరకూ ఎక్కడా చూడని హత్యాయుధం ఇది" అన్నాడు.

"కామాక్షీ వాఙ్మూలం ప్రకారం అది ఇంట్లోని ఓ కత్తెర పలుకట!"

"ఐతే, చాలా విచిత్రమైన కత్తెరే వుంటుంది. కళాత్మక కత్తెర! జపాన్ కళకు మచ్చుతునక! చూడండి, ఎంత అందమైన నగిషీలు చెక్కి, మెరిసే రాళ్ళు పొదిగారో. దీని రెండో పలుకెక్కడుంది?"

"తెలీదు! ఐతే, దాన్ని భద్రంచేసే అందమైన ఒర లాంటి చిన్న సంచి మాత్రం పైన రైటింగ్ రూంలోని బట్టల బీరువాలో వుంది."

"పదండి. ఆ రైటింగ్ రూంని ఒకసారి చూద్దాం!"

"రండి" అంటూ గోడమధ్య వేళాడుతున్న కర్టెన్ తొలగించాడు ఇన్‌స్పెక్టర్.

రెండు నిమిషాల్లో అందరూ ఆ తలుపుగుండా మెట్లెక్కి పైకి చేరుకున్నారు. చాలా విశాలమైన గది అది. ఓ పక్క తళతళ మెరిసే డెకోలమ్ రైటింగ్ టేబిల్, దానిమీద రంగు రంగుల కలాలమర్చిన పెన్ స్టాండ్, తెల్ల కాగితాల దొంతరలూ, టేబిల్ లాంప్,

రేడియో, పోర్టబుల్ టి. వి. సెట్, టేప్ రికార్డర్, ఓ మూల ఫ్రిజ్, అందులో పేర్చివున్న రకరకాల డ్రైఫుడ్ టిన్స్, మరో పక్క ఏర్ కూలర్, ఓ గోడవారగా ఎత్తయిన పుస్తకాల రాక్, దానిపక్కనే నిలువుటద్దం అమర్చిన డ్రెస్సింగ్ టేబిల్. ఆధునిక జీవితానికవసరమైన అన్ని హంగులూ వున్నాయక్కడ.

అంతేకాదు, ఆ గదికి అనుకునే బాత్ రూంకమ్ లావెట్రీ కూడా వున్నాయి. వాటిపక్కనే గోడలో ఎత్తయిన అల్మైరా కనిపిస్తోంది. అటు నడిచాడు దుర్యోధన్. మూసి వున్న అల్మైరా చెక్కతలుపు తెరవగానే లోపల మూడు వరసల్లో హేంగర్స్‌కు వేలాడుతున్న లేడీస్ దుస్తులు దర్శనమిచ్చాయి. కింద ఓ మూల రెండు మూడు శాండిల్స్ కూడా పడున్నాయి.

జపాన్ స్త్రీలు తొడుక్కునే స్లీపింగ్ గౌన్‌లాంటి సిల్క్ కిమోనోలూ, మేక్సీలూ, ఉలెన్ స్వెట్లర్లూ, బ్లౌజులూ, చీరలూ ఒకటేమిటి, అన్ని రకాల దుస్తులూ వేలాడుతున్నాయి. వాటిని పరీక్షగా చూస్తున్న దుర్యోధన్ కళ్ళు ఆశ్చర్యంతో విప్పారాయి.

"ఈ గదిని ఎవరు వాడేవారు?" అడిగాడు కుతూహలంగా.

"ఇంకెవరు వాడతారు? రమాదేవే! ఏదైనా రాయాలన్న మూడ్ వచ్చినప్పుడల్లా ఆమె రోజుల తరబడి ఏకాంతంగా ఈ గదిలో కూర్చుని రచనలు చేసేది. కామాక్షికి తప్ప అన్యులెవరూ ఇందులో అడుగుపెట్టే అనుమతిలేదు!" అన్నాడు డాక్టర్ శ్రీకాంత్.

"ఐతే, ఇంకా ఆశ్చర్యం! ఈ గదిని ఆమెకాదు, ఇంకెవరో వాడేవారు!"

"పొరపాటు దుర్యోధన్! నేనామె కుటుంబ స్నేహితుణ్ని. ఈ ఇంటి విషయాలు మీకన్నా నాకే బాగా తెలుసు. ఈ గదిలో అటుంచి, తన పడగ్గదిలోకి కూడా ఎవర్నీ అనుమతించేది కాదు రమాదేవి. ఎంతటి ఆత్మీయులకైనా సరే! అటువంటప్పుడు ఈ గదిని ఇంకెవరో వాడుకోడానికెలా అనుమతిస్తుంది?" అన్నాడు శ్రీకాంత్.

"కావచ్చు! కానీ, ఈ గదిలో మాత్రం ఆమెకు బదులు ఇంకెవరో స్త్రీ నివసించేదని నిస్సందేహంగా చెప్పగలను."

"ఎలా?"

"రమాదేవిని నేను ప్రత్యక్షంగా చూళ్ళేదు. ఐతే, పత్రికల్లో ఆమె బొమ్మలు చాలాసార్లు చూశాను. మీలో ప్రతి ఒక్కరూ ఆమెని ప్రత్యక్షంగా చూసినవారేకదా? చెప్పండి. ఆమె ఒడ్డూపొడుగూ ఎలా వుండేవి?"

"మనిషి కాస్త పొట్టిగా, లావుగా వుండేది."

"గుడ్! ఇక ఈ బట్టల్ని గమనించండి" అంటూ ముందు హేంగర్‌కు వేలాడుతున్న పొడవాటి జపనీస్ కిమోనోతీసి, తన ఒంటికి ఆనించి చూపాడు దుర్యోధన్. తరవాత ఓ స్లీపింగ్ గౌన్, ఓ మేక్సీ, ఓ బ్లౌజూ తీసి చూపాడు.

"గమనించారా? బ్లౌజులు వదిలితే మిగతావాటి పొడవు ఐదుడుగుల ఎనిమిదంగుళాలు, ఛాతీ ముప్పైమూడు నడుం ఇరవై ఎనిమిది, పిరుదులు ముప్పైనాలుగంగుళాలు. ఈ సైజు బట్టలు అటు రమాదేవికీ, ఇటు కామాక్షికీ సరిపోవు. కారణం వాళ్ళిద్దరూ లావుగానే వుంటారు గనక! ఇప్పుడు చెప్పండి మీ అభిప్రాయం?"

దిగ్భ్రాంతితో నోరు తెరిచాడు ఇన్‌స్పెక్టర్.

"ఎగ్జాక్ట్లీ! మీ వాదనతో ఇప్పుడు నేనేకీభవిస్తున్నాను దుర్యోధన్. నిజంగా ఇవి సన్నని పొడవైన స్త్రీకి సంబంధించిన బట్టలు!"

"అంతేకాదు. రమాదేవి శిరోజాలు ఎలా వుండేవి?"

"నల్లగా నొక్కులు తిరిగి వుండేవి!"

దుర్యోధన్ డ్రెస్సింగ్ టేబిల్ మీద హేర్ బ్రష్ అందుకుని, "చూడండి, ఈ బ్రష్‌లో ఇరుక్కున్న వెంట్రుకల్ని. అక్కడక్కడా నెరిసి,ఎక్కడా నొక్కులు లేని జుత్తు ఇది. దీన్నిబట్టి ఈ గదిలో రమాదేవిగాక మరో స్త్రీ నివసించేదని స్పష్టం కావడంలేదూ?" అన్నాడు.

సాలోచనగా తలూపాడు రామారావ్, "కొద్ది కొద్దిగా యిప్పుడు బోధపడుతోంది నాకు. ఇవన్నీ చూస్తోంటే, రమాదేవి ఈ గదిలో ఎవ్వరినో రహస్యంగా దాచివుంటుందనీ, లేదా, బంధించి వుంటుందనీ అర్థమౌతోంది. అందుకే ఆమె స్థానిక పనిమనుషుల్ని ప్రతినెలా మార్చేది. ఆ రహస్యం ఎక్కడ బైటపడుతుందోనని!"

"శ్రీకాంత్ గారూ! ఇంకా మీకు నమ్మకం కల క్కుంటే, ఇదేకాదు, ఇంతకన్నా ముఖ్యమైన మరో ఆధారం చూపిస్తాను మీకు" అన్నాడు దుర్యోధన్.

"ఏమిటది?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ ఆసక్తిగా.

"ఈ గదిలో రహస్యంగా వుంచబడ్డ స్త్రీ కుడికాలి పాదంలో ఏదో లోపం ఉండివుండాలి!"

"ఎలా చెప్పగలుగుతున్నారు?"

"రండి చూపిస్తాను" అంటూ అందర్నీ తిరిగి బట్టల అల్మైరావైపు తీసికెళ్ళాడు దుర్యోధన్. వంగి, అరలో

ఓ మూల పడున్న కాండిల్స్‌ను ఇవతలికి తీశాడు. అన్నీ కొత్తవి. అడుగులు అరగనివి. అన్నీ కుడి కాలివే!

"అర్థమైందా? ఆ స్త్రీ కుడిపాదంలో ఏదో లోపం వుండబట్టే ఆ కాలికోసం ప్రత్యేకమైన కాండిల్స్ తయారు చెయ్యబడేవి. అందుకే ఆమెకోసం తెచ్చిన కాండిల్స్‌లో ఒకదాన్ని ఇలా మూలపడేసేవారు...."

దుర్యోధన్ మాట ఇంకా పూర్తికాలేదు.

"ఓహ్....గాడ్! అసంభవం....ముమ్మాటికీ....అసంభవం...." అన్నాడు డాక్టర్ శ్రీకాంత్ దిగ్భ్రాంతితో.

"ఏమిటి డాక్టర్? ఎందుకలా అయిపోయారు?" అడిగాడు దుర్యోధన్.

"అలాంటి ఒక స్త్రీ నాకు బాగా తెలుసు! ఆమె కుడిపాదం పుట్టుకతోనే కాస్త వంకర తిరిగి ఉంటుంది!"

"ఎవరా స్త్రీ?" ముక్త కంఠంతో ఒకేసారి అడిగారందరూ.

"రమాదేవి అక్క! సత్యవేణి!!"

"ఆమె ఒడ్డూపొడుగూ ఎలా వుంటాయి?"

"మీ అంచనా సరైనదే! సన్నగా, పొడుగ్గా వుంటుంది!"

"ఇంకేం, ఈ గదిలో రహస్యంగా నివసించిన స్త్రీ ఆమే అయ్యుంటుంది."

"అసంభవం!"

"ఏం? ఇంతకిమించి, ఇంకేం కావాలి ఆధారాలు?"

"ఈ ఆధారాలు ఎందుకూ పనికిరావిప్పుడు!"

"ఏం?"

"సత్యవేణి చనిపోయి సరిగ్గా పన్నెండేళ్ళవుతోంది!"

దిగ్భ్రాంతితో అందరూ ఒకరి మొహాలొకరు చూసు కున్నారు.

"ఆమె ఎక్కడ చనిపోయింది?"

"జపాన్‌లో వున్నప్పుడే!"

మధ్యలో అందుకున్నాడు ఇన్‌స్పెక్టర్. "అసలు సంగతి ఇదన్నమాట! నేను మొదటిసారి ఈ గదిని పరిశీలించినప్పుడు దుర్యోధన్ గారిలా ఈ బట్టల్నీ, ఆ కాండిల్స్‌నీ అంత సూక్ష్మంగా పట్టించుకోలేదు. ఐతే, ఈ అల్మైరా తెరిచి, ఆ కత్తెర రెండో పలుకు కోసం వెదుకుతున్నప్పుడు మధ్య అరలోని బట్టల వెనక ఉత్తరాల కట్టలతో నిండివున్న చిన్న పెట్టె కనిపించింది.

అందులోంచి కొన్ని ఉత్తరాలు తీసిచూశాను. వాటిలో కొన్ని ఇరవై ఏళ్ళ క్రితం డాక్టర్ శ్రీకాంత్ సత్యవేణికీ, రమాదేవికీ రాసినవి కూడా వున్నాయి."

"మై.... గాడ్! ఐతే, ఇరవై ఏళ్ళనాటి ప్రేమకథ కూడా మీకు తెలిసిపోయిందన్నమాట!" అన్నాడు డాక్టర్ నిట్టూరుస్తూ.

"అంతేకాదు, ఆ ఉత్తరాల్లో మీ తమ్ముడు మురళీకృష్ణ ప్రసక్తి కూడా వుంది."

ఇన్‌స్పెక్టర్ అంటున్నదేమిటో సరిగ్గా అర్థంకాక, అయోమయంగా తండ్రివైపు చూడసాగింది నళిని.

"మమ్మల్ని చీకటి మాటున వుంచకుండా ఆ కథంతా ఏమిటో కాస్త వివరించండి డాక్టర్!" అన్నాడు దుర్యోధన్ అభ్యర్థిస్తూ.

డాక్టర్ కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. కర్చీఫ్‌తో కళ్ళద్దుకుని, చెప్పసాగాడు. "ఇరవై ఏళ్ళక్రితం మాట! నేనూ, నా తమ్ముడు మురళీకృష్ణ ప్రభుత్వసహాకారంతో

కేన్సర్ పై రీసెర్చ్ జరపడానికి జపాన్ వెళ్లాం!

అక్కడే మాకు రమాదేవి తండ్రితో పరిచయమైంది. దేశంకాని దేశంలో స్వప్రాంతీయులు తటస్థపడితే చిటికెలో చాలా చేరువౌతారంటారు. అదే జరిగింది. రమాదేవి తల్లికి తెలుగువారంటే పంచప్రాణాలు. ఆ విధంగా మేమిద్దరం అనతికాలంలోనే ఆ కుటుంబానికి అత్యంత ఆత్మీయుల మయ్యాం!

అప్పుడు రమాదేవీ, ఆమె అక్క సత్యవేణీ అరవిరిసిన పుష్పాలు. అంటే, యవ్వన ప్రాంగణంలో అడుగుపెట్టిన నవయువతులు! తొలిచూపులోనే నన్ను సత్యవేణి బాగా ఆకట్టుకుంది. అమాయకమైన ఆమె మొహం, నిదానంగా, సుమధురంగా మాట్లాడే ఆమె మాటలూ నన్ను చాలా ఆకర్షించేవి. అలా నాకు తెలియకుండానే లోలోపల ఆమెను ప్రేమించసాగాను. ఐతే, భయంవల్లా బెరుకు వల్లా ఆ ప్రేమను వ్యక్తం చెయ్యడానికి సాహసించలేక పోయాను.

చివరికి తెగించి, ఉత్తరాల ద్వారా ఆమెకు నా ప్రేమ వ్యక్తపరిచాను. అప్పటికే బాగా ఆలస్యమై పోయింది. సత్యవేణి ఆ ఉత్తరాలకు జవాబిస్తూ తను నా తమ్ముణ్ని ప్రేమిస్తున్నాననీ, త్వరలో ఇద్దరం పెళ్ళిచేసుకుంటున్నామనీ తెలియచేసింది.

దాంతో, నా మనసు ఛిన్నాభిన్నమై నా తమ్ముడి ఆనందానికి అడ్డంకిగా వుండకూడదని స్వదేశానికి తిరిగి వచ్చేశాను. ఆ తరవాత కొద్దికాలానికే నా తమ్ముడు ఆమెని పెళ్ళిచేసుకుని, వారితోబాటు అక్కడే వుండసాగాడు. ఆ తరవాత రమాదేవీ, సత్యవేణిల తలిదండ్రులు ఓ విమాన ప్రమాదంలో మరణించడం జరి

గింది.

నేను స్వదేశంలో వున్నా, మా మధ్య తరుచూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ వుండేవి. అలా ఆరేళ్లు గడిచాక ఒక రోజు హఠాత్తుగా రమాదేవి రాసిన ఓ పిడుగులాంటి ఉత్తరం అందింది, నా తమ్ముడు ఆకస్మాత్తుగా మరణించాడని తెల్పుతూ."

"ఎలా మరణించా డాయన?"

"వాడికి మొదటినించీ రైఫిల్ షూటింగ్ పట్ల మోజుండేది. తీరిక వేళల్లో షూటింగ్ ప్రాక్టీస్ చేసేవాడు. దానికోసం అక్కడ ఇంటివెనక తోటలో చిన్న షూటింగ్ రేంజ్ కూడా తయారు చేయించాడు. తనతో బాటు సత్యవేణికూడా షూటింగ్ నేర్పుతుండేవాడు.

పెళ్ళయిన తరవాత కూడా ఒకరోజు ఆమెచేత షూటింగ్ ప్రాక్టీస్ చేయిస్తుండగా ఆమె చెయ్యి వణికి, గురితప్పి టార్గెట్ పక్కనే నిల్చున్న మురళీకృష్ణకు తగిలిందట!"

"అది అనాలోచితంగా జరిగిన సంఘటనే అంటారా?"

"ఔను."

మధ్యలో కల్పించుకున్నాడు ఇన్‌స్పెక్టర్. "ఆ ఉత్తరాలనిబట్టి, ఆ రోజుల్లోనే మీ తమ్ముడికీ, మరో స్త్రీకి సంబంధాలు బలపడుతున్నట్టూ, అందుకే సత్యవేణి తన భర్త మరణానికి పూర్తిగా బాధ్యురాలినని భావిస్తున్నట్టూ విదితమౌతుంది. ఆ సంగతి తెలియదా మీకు?"

డాక్టర్ మొహం చిట్లించి, "ఆ రామాయణమంతా ఆ ఉత్తరాల్లో వుందన్నమాట!" అన్నాడు విసుగ్గా.

"ఐతే, ఆ రెండు విషయాలూ నిజమేనంటారా?"

"నో! సత్యవేణి ఉద్దేశపూర్వకంగా నా తమ్ముణ్ణి చంపలేదు. ఆమె చాలా ఉత్తమురాలు. అంతకన్నా మంచి రచయిత్రి! రమాదేవితోబాటు ఆమె కూడా కథలు రాసేది. పత్రికలకు పంపేముందు ఇద్దరూ తమ స్క్రిప్టుల్ని అభిప్రాయం తెలుసుకోడానికి నాకు చూపే వారు.

అది చదివితే రమాదేవికన్నా సత్యవేణి రచనలే అద్భుతంగా వున్నాయనిపించేవి నాకు. అటువంటి సున్నిత మనస్కురాలు కట్టుకున్న భర్తను చంపి, చేజేతులా తన పసుపుకుంకుమల్ని ఎలా చెరుపుకుంటుంది?

ఐతే, ఆ రోజుల్లో నా తమ్ముడికీ, మరో స్త్రీకీ సంబంధమున్నట్టు గుసగుసలు ప్రచారంలో వుండటంవల్ల, షూటింగ్ జరుపుతున్నప్పుడు తన మనసులో దాగివున్న స్త్రీ సహజమైన ఈర్ష్యాసూయలూ, అవమానమూ తనకు తెలీకుండానే లిప్తపాటులో తన గురిని, టార్గెట్ పక్క నున్న తన భర్త వైపు తిప్పివుంటాయనీ, ఆ క్షణంలోనే గుండు దూసుకెళ్ళి భర్త మరణానికి దారితీసి వుంటుందనీ ఆమె మస్తిష్కంలో ఏ మూలో అనుమానం మొలకెత్తింది.

క్రమేపీ ఆ ఆలోచన ఇంతింతై వటవృక్షమై ఆమెను మానసిక రోగిగా మార్చేసింది. రోజులు గడుస్తున్న కొద్దీ ఆమె నర్వస్ బ్రేక్‌డౌన్ అయి పిచ్చి పిచ్చిగా ప్రవర్తించడం ప్రారంభించింది. దాంతో రమాదేవి ఆమెను స్థానిక మెంటల్ హాస్పిటల్లో చేర్పించింది.

ఆ తరవాత కొన్నాళ్ళకు రమాదేవినించి ఓ ఉత్తరం వచ్చింది నాకు. హాస్పిటల్ పై అంతస్తులోని కిటికీలోంచి

తలక్రిందులుగా దూకి సత్యవేణి ఆత్మహత్య చేసుకుందని!
అందరూ పోయాక, ఇక ఆమె ఒంటరిగా అక్కడుంటం
ఎందుకనీ, ఆస్తిపాస్తులమ్మేసి, స్వదేశానికి వచ్చెయ్యమని
సలహా ఇస్తూ జవాబు రాశాను. సంవత్సరం గడిచాక,
నా సలహాప్రకారం స్వదేశానికి వచ్చేసింది రమాదేవి!"

"సారీ డాక్టర్! గతాన్ని తవ్వి మీ మనసును కష్ట
పెట్టాము" అంటూ ఇన్‌స్పెక్టర్ చేతిలోవున్న ఉత్తరాల
పెట్టె అందుకుని, రైటింగ్ టేబిల్ వైపు నడిచాడు
దుర్యోధన్. ఓ ప్లాస్టిక్ ట్రేలో దొంతరలుగా పేర్చి
వున్న కాగితాలనూ, ఫైళ్ళనూ తిరిగేస్తూ ఓ ఫైలందు
కున్నాడు.

అందులో రెండు కథా స్క్రిప్టుల తాలూకు ట్రూ
కాపీలున్నాయి. దాన్ని చంకలో ఇరికించి, "పదండి,
ఇక వెళదాం!" అంటూ బైటికి నడిచాడు.

అందరూ మెట్లు దిగి, కింద పడగ్గదిలోకి ప్రవేశించారు.
పనిమనుషులిద్దరూ ఇంకా అక్కడే వున్నారు.

"కామాక్షీ! సత్యవేణి ఎక్కడుంది?" హఠాత్తుగా
వేసిన తన ప్రశ్నకు ఆమె తృళ్ళిపడుతుందనుకున్నాడు
దుర్యోధన్.

అవేమీ జరగలేదు. ఆమె మొహంలో రవ్వంత
మార్పూ రాలేదు. చాలా నింపాదిగా అంది. "పైకి
భగవంతుడి దగ్గరికి!"

"నేను రమాదేవి అక్క సత్యవేణి గురించి అడుగు
తున్నాను."

"ఆమె చన్ పోయిండి!"

"ఎప్పుడు?"

"పన్నెండేళ్ళ క్రితం!"

"నువ్వు అబద్ధం చెబుతున్నావ్!"

"లేదు! నిజం! పెద్దమ్మగార్ చన్ పోయిండి!"

"సరే, మీరిద్దరూ ఇక వెళ్ళండి!"

పనిమనుషులు వెళ్ళిపోయాక, అందరివైపు చూస్తూ, "ఈ జపనీస్ సేవకురాలు రమాదేవికి అత్యంత విశ్వాస పాత్రురాలై వుండాలి. అందుకే జపాన్‌నించి తనవెంట తీసుకువచ్చింది. పై గదిలో అజ్ఞాతవాసం చేస్తున్న సత్య వేణి గురించి ఎట్టి పరిస్థితిలోనూ ఎవ్వరితోనూ చెప్ప కూడదని ఆదేశించి వుంటుంది. అందుకే కోమీ మనతో అబద్ధం చెబుతోంది!" అన్నాడు దుర్యోధన్.

"ఐతే, రమాదేవి తన అక్క పిచ్చాసుపత్రి పై అంతస్తునించి దూకి ఆత్మహత్య చేసుకుందని డాక్టర్ గారికి ఎందుకు రాసింది? ఇంతకాలం అక్కను పై గదిలో రహస్యంగా ఎందుకుంచింది?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ అయోమయంగా.

"అదే ఇప్పుడు మనం తెలుసుకోవాలి! సత్యవేణి నిన్న మొన్నటివరకూ సజీవంగా ఆ గదిలో నివసించిందని నా గట్టి నమ్మకం! ఆ సంగతి నిరూపించాలంటే, తల దువ్వుకునే ఆ బ్రష్‌లోని వెంట్రుకల్ని లాబొరేటరీలో పరీక్షిస్తే అవి పాత వెంట్రుకలో, ఈమధ్య తెగినవో తేలిపోతుంది. ఇన్‌స్పెక్టర్! దయచేసి ఆ బ్రష్‌ను లాబొరేటరీకి తీసికెళ్ళండి.

నిన్న మొన్నటివరకూ ఆ గదిలో నివసించిన సత్య వేణి, హఠాత్తుగా ఏమైపోయింది? ఇప్పుడు మనముందు పడగవిప్పిన ప్రశ్న ఇది. ఆమెకోసం తీవ్రంగా గాలిం చాలి. డాక్టర్! మీ ఆల్బంలో ఆమె ఫోటో ఏదైనా

వుందా?"

"ఉంది! ఆ కుటుంబ సభ్యులందరి ఫోటోలూ వున్నాయి. జపాన్‌లో తీయించినవి."

"ఇన్‌స్పెక్టర్! దయచేసి, డాక్టర్‌గారివద్ద ఆమె ఫోటో తీసుకుని, దాని కాపీలు తీయించి, పత్రికా ప్రకటనలతోబాటు అన్ని నగరాల పోలీస్‌స్టేషన్‌లకూ మెసేజ్ పంపించండి. రామారావుగారూ! మీతో కాస్త మాట్లాడాలి. రండి!" అంటూ బైటికి నడిచాడు దుర్యోధన్.

## 6

"ఇప్పుడు చెప్పండి, రమాదేవి మిమ్మల్ని ఏ పనిమీద నియమించింది? ఎన్నాళ్ళనించి మీరు ఆమెకోసం పనిచేస్తున్నారు?" అడిగాడు దుర్యోధన్, రామారావుని తన ఇంటి ఆఫీసులో కూర్చోబెట్టి.

అతను పలకలేదు. ఆలోచనలో పడిపోయాడు.

"మీరు చెప్పకున్నా, తర్కంతో నేను ఊహించగలను. మతి స్థిమితంలేని సత్యవేణి, రమాదేవి ఇంట్లోంచి ఒకరోజు హఠాత్తుగా పారిపోయి వుంటుంది. దాంతో రమాదేవి భయపడి, ఆమె ఆచూకీ తీసి, ఇంటికి తీసుకరావలసిందిగా మిమ్మల్ని కోరివుంటుంది. మీరెంత ప్రయత్నించినా ఆమె ఆచూకీ తెలిసివుండదు.

లేదా, తెలిసినా అంత పెద్ద క్లైంట్‌ను అంత త్వరగా జారవిడవడం ఇష్టంలేక తెలియనట్టు నటించి వుంటారు. దాంతో విసిగెత్తిన రమాదేవి, ఇక ఆ పని మీవల్ల జరిగేట్టులేదనీ, మానెయ్యమనీ, తాను పోలీసుల సహాయం కోరతాననీ చెప్పివుంటుంది.

దాంతో మీరామెను మరికొన్ని రోజులు వ్యవధి ఇవ్వమని కోరడానికి ఫోన్ చేసి వుంటారు. ఆ ఫోన్ శబ్దం

విని నళిని ఆమె పడగ్గదిలోకెళ్ళి, శవాన్ని చూసింది.... ఫోన్ యెవరూ ఎత్తకపోడంతో మీరే స్వయంగా అక్కడికెళ్ళారు. నిజమేనా?"

సాలోచనగా తలూపాడు రామారావు. "మీ తర్కం సరైనదే! ఐతే, రమాదేవి తన అక్క సత్యవేణి అని చెప్పకుండా, తన ఇంట్లో అతిథిగా వుంటున్న ఓ స్నేహితురాలు హఠాత్తుగా ఇల్లువదిలి ఎక్కడికో వెళ్ళి పోయిందనీ, ఆమెకు మతి స్థిమితంలేదనీ, యెక్కడుందో వెదికి తీసుకురమ్మనీ పదిరోజుల క్రితం కోరింది నన్ను."

"సత్యవేణి ఆచూకీ తెలిసిందా మీకు?"

"తెలిసింది!"

"ఎక్కడ?"

"సారీ, ఆచూకీ తెలిసేలోపలే చాలా ఆలస్యమై పోయింది....క్షమించండి. ఇంతకిమించి నేనేమీ చెప్ప దలచుకోలేదు!"

"ఆల్ రైట్! అన్యథా భావించకుంటే, నేనీ ఉత్త రాలూ అవీ పరిశీలించేవరకూ ఇక్కడే కూర్చోండి. మీతో మరికొన్ని విషయాలు చర్చించాలి" అంటూ రమాదేవి ఇంటినించి తెచ్చిన ఉత్తరాల పెట్టె తెరిచాడు దుర్యోధన్.

అందులోని ఒక్కో ఉత్తరాన్నీ చదువుతూ విష యాలు అవగాహన చేసుకుంటూ, అవి పూర్తయ్యాక, కథల కార్బన్ ట్రూకాపీ స్క్రిప్టుల ఫైల్ తెరిచాడు. వాటిని చూచాయగా పరిశీలించడం పూర్తిచేసి, రమా దేవి మరణించేముందు లాయర్‌కి రాసిన ఉత్తరాన్ని మరోసారి పరిశీలించాడు.

అప్పుడు మెరిసింది మెరుపు దుర్యోధన్ కళ్ళల్లో.

"రామారావుగారూ! ఈ ప్రశ్నకి మాటిగా జవాబివ్వండి. రమాదేవిని మొదటిసారి చూసినప్పుడు మీకేమనిపించింది?"

"చాలా ధనవంతురాలనీ, రత్యంత చిరాకతత్వం గలదనీ, తను తలుచుకున్నది పొందితీరాలనే పట్టుదల గలదనీ స్ఫురించింది!"

"అదికాదు. మీరామె రచనలు యెప్పుడైనా చదివారా?"

"నాలుగైదు నవలలు చదివినట్టు జ్ఞాపకం! చాలా రోజులమాట!"

"ఒక రచయిత నవలలో, కథలో చదువుతున్నప్పుడు ఆ రచయితపట్ల పాఠకుల మదిలో ఒకరూపం, ఒక అభిప్రాయం రూపు దిద్దుకుంటుంది. అదే రచయితను వ్యక్తిగతంగా కలిసి మాట్లాడినప్పుడు పాఠకుడి మదిలోని రూపానికీ, అభిప్రాయానికీ ఆ రచయిత లేదా రచయిత్రి మాసపోసినట్టు సరిపోవచ్చు. లేదా, అందుకు భిన్నంగానూ వుండవచ్చు. ఆమెను చూశాక మీకేమనిపించింది?"

రామారావు క్షణం ఆలోచించి, "నా మనసులో వున్న రూపానికీ, అభిప్రాయానికీ ఆమె చాలా విరుద్ధంగా తోచింది. అంత గొప్ప రచయిత్రి ఈమేనా? అన్న అనుమానం కూడా రాకపోలేదు!"

దుర్యోధన్ నవ్వి—"మీ అనుమానం సరైనదే! ఆమె అందరూ అనుకుంటున్నట్టు గొప్ప రచయిత్రి కాదు. గొప్ప మోసగత్తె!" అన్నాడు.

"అంటే?"

"ఆమె అసలు రచయిత్రికాదంటున్నాను!"

"అసంభవం! ఆమె కథలు అసంఖ్యాకంగా అనేక పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. లెక్కలేనన్ని నవలలు పేరున్న పత్రికల్లో సీరియల్స్‌గా వచ్చాయి. వాటి ఆధారంగా ద్విభాషల్లో ఎన్నో సినిమాలు తీయబడి విజయవంతమయ్యాయి."

"అవన్నీ ఆమె రాసినవి కావు!"

"వా....ట్!? మరెవరు రాశారు?"

"ఆమె అక్క సత్యవేణి!"

"ఇంపాసిబుల్! మతి స్థిమితంలేని ఒక స్త్రీ అటువంటి రచనలు చేసిందంటే ఎవరు నమ్ముతారు?"

"ఆమెకు మతిస్థిమితంలేదని మీకెలా తెలుసు? మీరామెను చూశారా?"

"లేదు. ఐతే, మామూలు స్త్రీ లెవ్వరూ అన్ని సంవత్సరాలు బైటప్రపంచంతో సంబంధం లేకుండా ఒకే గదిలో అజ్ఞాతవాసం చెయ్యలేరు!"

"రామారావుగారూ! ప్రతి మేధావిలోనూ అంతో ఇంతో పిచ్చి అనేది వుంటుందని మీరు మర్చిపోతున్నారు. పెద్ద పెద్ద సైంటిస్టులూ, పరిశోధకులూ బాహ్య ప్రపంచంతో సంబంధంలేకుండా తమచుట్టూ ఓ పరిధి ఏర్పరచుకుని, తాము ఎంచుకున్న పనిమీదే పూర్తిగా మనసు లగ్నంచేసి, పిచ్చిగా కృషిచేస్తారు గనకే అందులో వారికి సంపూర్ణమైన సాఫల్యం లభిస్తుంది. మామూలు మనుషులకది అసాధ్యం! అందుకే వారు మేధావులుగా పరిగణింపబడతారు.

ఇనాళ్ళూ రమాదేవి పేరుతో ప్రచురింపబడ్డ కథలూ, నవలలూ ఆమె రాసినవి కావనీ, ఆమె అక్క రాసినవనీ నిరూపించడానికి ఇవిగో ఆధారాలు!" అంటూ ఉత్త

రాల పెట్టెలోంచి రెండు ఉత్తరాలుతీసి, రామారావు ముందు పెట్టాడు దుర్యోధన్.

అందులో ఒకటి సత్యవేణి రాసిందని కింద సంతకం వల్ల తెలుస్తోంది. రెండోది రమాదేవి రాసింది. ఆ తర వాత కథల ఫైల్ తెరిచి చూశాడు దుర్యోధన్. అందు లోని చేతివ్రాతా సత్యవేణి రాసిన ఉత్తరంలోని చేతి వ్రాతా అచ్చుగుద్దినట్టు ఒకేలా వుంది.

ఆ తరవాత రమాదేవి మరణించేముందు లాయర్‌కు రాసిన అసంపూర్తి ఉత్తరాన్ని విప్పి చూశాడు దుర్యోధన్. అందులో చేతివ్రాతా, రమాదేవి రాసిన ఉత్తరంలోని చేతివ్రాతా ఒకేలా వున్నా, కథల స్క్రిప్టులోని చేతివ్రాతతో ఏమాత్రం సరిపోవడంలేదు!

"ఇప్పుడర్థమైందా? స్క్రిప్టులోని రాతకూ, రమాదేవి రాతకూ ఎటువంటి పోలికా లేదు!"

ఆశ్చర్యంతో రామారావు కళ్ళు పెద్దవయ్యాయి. "ఔను! ఇప్పుడు మీ వాదనతో నే నేకీభవిస్తున్నాను. ఐతే, అంతటి మేధావి అయిన సత్యవేణి, అన్ని సంవ త్సరాలు బాహ్యప్రపంచంతో సంబంధంలేకుండా ఆ గదిలో యెలా వుండిపోయింది? పారిపోవడానికెందుకు ప్రయత్నించలేదు? తన రచనలు రమాదేవి పేర ప్రచు రించుకోడానికెందుకనుమతించింది? రమాదేవి తన అక్క ఆత్మహత్య చేసుకుందని జపాన్‌నించి డాక్టర్ శ్రీకాంత్‌కు ఉత్తరం ఎందుకు రాసింది?" అడిగాడు అయోమయంగా.

"ఈ ఉత్తరాలూ ఈమధ్య జరిగిన సంఘటనలూ పరిశీలించాక అసలు కథ కొద్దిగా అర్థమైంది నాకు. జపాన్‌లో వున్నప్పుడు తనూ, తన తమ్ముడూ సత్య వేణిని ప్రేమించడం జరిగిందని డాక్టర్ శ్రీకాంత్

స్వయంగా చెప్పాడు.

ఐతే, ఈ ఉత్తరాలద్వారా సత్యవేణిలాగే రమాదేవి కూడా డాక్టర్ తమ్ముణ్ని ప్రేమించేదని తెలుస్తోంది! డాక్టర్ తమ్ముడు సత్యవేణిని ప్రేమించి, ఆమెనే పెళ్ళి చేసుకున్నాడు. దాంతో స్వతహాగా కోపిష్టి అయిన రమాదేవి మనసు ఈర్ష్యాసూయలతో భగ్గుమంది.

తాను ప్రేమిస్తున్న మనిషిని పెళ్ళిచేసుకుని, తనను భగ్నప్రేమికురాలిని చేసిన అక్కపై లోలోపల ద్వేషాన్ని పెంచుకుంది. అంతేకాదు, తన ప్రేమను గ్రహించకుండా తనను నిర్లక్ష్యం చేసిన డాక్టర్ తమ్ముడిపట్ల కూడా ఆమెలో అసహ్యం పెరిగివుంటుంది.

ఎలాగైనా వారి సంసారంలో చిచ్చుపెట్టి, తనకు దక్కని సుఖసంతోషాలను వారికీ చెందకుండా చెయ్యాలన్న దుర్బుద్ధితో రమాదేవే తన అక్క మనసులో ఆమె భర్త మరో స్త్రీతో చనువుగా వుంటున్నాడన్న విషబీజాన్ని నాటి వుంటుంది.

ముందే సౌమ్యమనస్కురాలైన సత్యవేణి, స్వయాన తన చెల్లెలే చెప్పినప్పుడు ఆ అపవాదును చాలా సులభంగా నమ్మేసింది. ఆ విషబీజం ఆమె మనసులో మొలకెత్తి, క్రమేపీ వటవృక్షమైపోయింది. ఆమె హృదయ కుహరంలో ఏమూలో భర్తపట్ల ద్వేషభావన, ప్రతీకార భావన తొంగిచూస్తూ వుండేది.

ఆ భావనే ఆరోజు రైఫిల్ షూటింగ్ ప్రాక్టీస్ చేస్తున్నప్పుడామె చేతిని ఆమెకు తెలియకుండానే భర్తకు గురిపెట్టించి, ఫైర్ చేయించింది. ఆ హఠాత్పరిణామంతో ఆమె మానసిక స్థితి దెబ్బతింది. భర్తను చేజేతులా తానే చంపానన్న ఆత్మన్యూనతా భావం

ఆమెను కృంగదియ్యసాగింది.

ఆ సంఘటన మర్చిపోడానికి మూడ్ వచ్చినప్పడల్లా రచనా వ్యాసంగంలో మునిగిపోయి, కథలూ, నవలలూ రాయడం ఉధృతం చేసింది. ఆ బలహీనతను రమాదేవి తన స్వప్రయోజనానికి వాడుకుంటూ, అక్కను తన కీలుబొమ్మగా మార్చుకుంది. ఆమె రచనలన్నీ తన పేర పత్రికలకు పంపి, పేరు తెచ్చుకోసాగింది!

ఆమె కూడా రచయిత్రే అయినా, ఆమెకన్నా సత్యవేణి రచనలే చాలా బావుండేవని డాక్టర్ శ్రీకాంత్ ఇదివరకే మనకు చెప్పిన విషయం గమనార్హం! అంటే రమాదేవి తిరుగుటపా రచయిత్రన్న మాట!

అలా ఆమె రచనల ద్వారా తన పేరు తెలుగుదేశంలో మారుమోగేసరికి, ఇక జపాన్ లో ఉండేకంటే, స్వదేశం వెళ్ళి అక్కడే స్థిరపడితే మరీ బాగుంటుందని, అక్క పిచ్చాసుపత్రి కిటికీలోంచి దూకి ఆత్మహత్య చేసుకుందని డాక్టర్‌కు ఉత్తరంరాసి, సత్యవేణిని తన కూడా రహస్యంగా ఇక్కడికి తెచ్చి, రైటింగ్ రూంలో దాచి, కథలూ, నవలలూ రాయిస్తూ, ఆమెకు చెందాల్సిన కీర్తి కిరీటాన్ని తన నెత్తిన పెట్టుకుని, సమాజంలో గొప్ప రచయిత్రిగా చెలామణీకాసాగింది!" అంటూ ముగించాడు దుర్యోధన్.

రామారావు ముఖం చిట్లించి "రమాదేవి ఎంతటి నీచురాలో ఇప్పుడర్థమైంది. అటువంటి స్త్రీని ఎవ్వరో కాదు, నేనే చంపితే బావుండేది" అన్నాడు అసహనంగా.

"ఇప్పుడు చెప్పండి, సత్యవేణి కనిపించిందా మీకు?"

రామారావు జవాబిచ్చేలోగా టీపాయ్‌మీది టెలిఫోన్ గణగణ మోగింది.

దుర్యోధన్ రిసీవరందుకుని "హలో!" అన్నాడు.

"రామారావుతో వెంటనే హెడ్ క్వార్టర్స్‌కు బైలు దేరండి. చాలా అర్జంటు" అన్నాడు అవతలనించి ఇన్‌స్పెక్టర్ యుగంధర రెడ్డి.

"ఆల్ రైట్! వస్తున్నాను" అంటూ రిసీవర్ దించేశాడు దుర్యోధన్.

# 7

రామారావుతో హెడ్ క్వార్టర్స్ చేరుకుని, ఇన్‌స్పెక్టర్ ఆఫీసులో అడుగుపెట్టి చూస్తే డాక్టర్ శ్రీకాంత్, లాయర్ మూర్తి, నళినీ అదివరకే అక్కడ కూర్చునున్నారు.

"ఏం జరిగింది ఇన్‌స్పెక్టర్?" అడిగాడు దుర్యోధన్ ఆశ్చర్యంగా.

"రమాదేవిని ఎవరు చంపారో తెలిసిపోయింది!"

"ఎవరు చంపారు?"

"నళిని!"

"ఏమిటి ఆధారం?"

ఇన్‌స్పెక్టర్ బల్ల సొరుగులోంచి ఓ ఫైల్ తీసి దుర్యోధన్ ముందుకు తోశాడు. "చదవండి. ఫింగర్ ప్రింట్స్ రిపోర్టు. హత్యాయుధమైన కత్తెర పలుకు మీంచి ఆమె రక్తమైతే తుడిచేసింది కానీ, తన వేలి ముద్రలు తుడవలేకపోయింది!"

"అబద్ధం! నేలమీద పడున్న ఆ కత్తెర పలుకును నా చేతిలోకి తీసుకున్నప్పుడు దానిమీద ఎలాంటి రక్తం లేదు!" అంది నళిని భయంగా.

"రక్తం వుందనీ, ఆ రక్తాన్ని మీరు శుభ్రం చేశారనీ చెప్పడానికి నా వద్ద బలమైన ఆధారం వుంది!"

"ఏమిటది?" అడిగాడు దుర్యోధన్.

ఇన్‌స్పెక్టర్ బల్ల సొరుగులోంచి ఓ కవరుతీసి అందించాడు. ఆ కవరు తెరిచి చూసిన దుర్యోధన్‌కు అందులో కాలి మసి అయిన బట్ట బూడిదా, దానిమీద చివరంటూ కాలిన చిన్న బట్టముక్కా, ఆ ముక్కపై ఎర్రని దారంతో అల్లిన 'నళిని' అనే అక్షరాలూ, ఆ అక్షరాలపై ఇంకిపోయిన రెండు ఎర్రని చుక్కలూ కనిపించాయి.

ఇన్‌స్పెక్టర్ ఆ చుక్కల్ని ఉద్దేశించి, "అవి మానవ రక్తపు చుక్కలని లాబొరేటరి టెస్టింగ్‌లో తేలింది. ఆ కాలిన గుడ్డపీలిక నళిని చేతిరుమాలని మీకు వేరే చెప్పనవసరంలేదనుకుంటాను" అన్నాడు.

"ఈ బూడిద ఎక్కడ దొరికింది మీకు?"

"రమాదేవి పడగ్గది పక్క గదిలోని చెత్తబుట్టలో. హత్యానంతరం నళిని రక్తం అంటిన చేతులూ, హత్యాయుధమూ రుమాలుతో తుడిచి, ఆధారం అందకుండా దాన్ని కాల్చేసి, చెత్తబుట్టలో పడేసింది. ఐతే దురదృష్టవశాత్తూ కాల్చేటప్పుడు రుమాలును ఏ మూలనైతే పట్టుకుందో అక్కడే ఆమె పేరు అల్లి వుంది!"

చేతుల్లో మొహం కప్పుకుని ఏడవసాగింది నళిని.

దాంతో రామారావు ఉండబట్టలేక — "ఆమె కావాలని ఆ రుమాలు కాల్చలేదు, నేనే కాల్చిపారెయ్యమని సలహా ఇచ్చాను" అంటూ జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించాడు, రైటింగ్ రూం తలుపు తాళం తీసి పెట్టడం తప్ప!

అంతా విన్న ఇన్‌స్పెక్టర్ కనుబొమలు ముడివడ్డాయి. "ఐతే, సాక్ష్యాధారాలను రూపుమాపడానికి నేరస్థులకు

సహకరించినందుకు మీరూ శిక్షార్హులే అవుతారు."

రామారావు నవ్వి—"న్యాయస్థానం కేవలం సాక్ష్యాధారాల నేకాదు, హత్యకు కారణం కూడా పరిశీలిస్తుంది ఇన్‌స్పెక్టర్! రమాదేవిని చంపేంతటి పగా, కసీ, అవసరమూ నళినికేమున్నాయని కోర్టు ప్రశ్నిస్తే ఏం జవాబిస్తారు మీరు?" అడిగాడు.

ఇన్‌స్పెక్టర్ లాయర్ వైపు సైగ చేస్తూ, "దానికి జవాబు నేను కాదు, లాయర్ గారిస్తారు" అన్నాడు చాలా నింపాదిగా.

అందరి కళ్ళూ లాయర్ వైపు మళ్ళాయి. సత్యనారాయణమూర్తి కంఠం సవరించుకుని, "సారీ మిష్టర్ దుర్యోధన్ ఈ విషయం మీకు ముందే చెప్పడం మర్చాను. ఆరేళ్ళ క్రితం రమాదేవిగారు నాకో సీలు వేసిన కవరిచ్చి, తాను మరణించిన తరవాతే ఆ కవరు విప్పి, అందులో రాసిపెట్టిన ఆదేశాలను పొల్లుపోకుండా అమలు జరపాలని కోరారు.

ఆమె కోరినట్టే మొన్న ఆవిడ మరణించాక ఆ కవరు విప్పి చదివాను. అందులో ఆమె తన అక్క బ్రతికే వుందన్న వాస్తవాన్ని అంగీకరిస్తూ, తన తదనంతరం ఆమెకు ఏలోటూ రాకుండా ప్రతినెలా ఐదువేల రూపాయలు అందించాలని సూచించారు.

ఆవిడకు చెందిన సుమారు నలభైలక్షల స్థిరాస్థీ, నగదూ అటుంచి, ఈ మధ్య మరణించిన ఆమె దూరపు బంధువు ద్వారా సంక్రమించిన ఆస్తి అరవై లక్షలు వుంటుంది. రమాదేవి మరణించారు గనక, ఆవిడ ఆస్తిపాస్తులూ ఇప్పుడామె దగ్గరి బంధువులకు లభిస్తాయి" అన్నాడు.

"బ్రతికున్న సత్యవేణే ఆమె దగ్గరి బంధువు గనక అతన్నీ ఆమెకే లభిస్తాయంటారు. ఔనా?"

"అంతేకాదు. సత్యవేణి తరవాత మరో దగ్గరి బంధువు కూడా ఉందామెకు...."

"నో!" అరిచాడు డాక్టర్. "దయచేసి ఆ విష యాన్ని రహస్యంగానే వుంచండి. ప్లీజ్!"

"సారీ డాక్టర్! ఇక ఆ రహస్యాన్ని రహస్యంగా వుంచడానికి వీల్లేదు" అంటూ దుర్యోధన్ వైపు తిరిగి, "ఆ రహస్యంతోనే హత్యకు కారణం స్పష్టమౌతుంది" అన్నాడు లాయర్.

"ఏమిటది?" అడిగాడు దుర్యోధన్ ఆసక్తిగా.

"నళిని డాక్టర్ శ్రీకాంత్ కూతురుకాదు! సత్యవేణి కూతురు!!"

దుర్యోధన్ నిబ్బరపోయాడు ఒక్కసారి!

"మ్.... నేను.... నేను.... ఓహ్.... నో డాడీ చెప్పండి ఇదంతా అబద్ధమని చెప్పండి డాడీ...." అంది నళిని దుఃఖాతిశయం ఆపుకోలేక.

డాక్టర్ శ్రీకాంత్ కళ్ళలో కన్నీరు సుళ్ళు తిరిగింది. "ఆయన చెప్పింది నిజమేనమ్మా! ఇన్నాళ్ళూ ఆ పచ్చి నిజం నీకు తెలియకుండా జాగ్రత్తపడుతూ నిన్ను నా కళ్ళల్లో పెట్టుకు పెంచాను.

నువ్వు నా కన్నకూతురివి కావు. అసలు నేనింతవరకూ పెళ్ళే చేసుకోలేదు. నువ్వు నా తమ్ముడి జ్ఞాపకచిహ్నానివమ్మా! నీ తండ్రి దుర్మరణం పాలయ్యాక తల్లి మతి విభ్రమం కోల్పోయాక రమాదేవి నాకు ఉత్తరంరాసి, జపాన్ పిలిపించింది.

మేమిద్దరం కలిసే నీ తల్లిని మానసిక చికిత్సకోసం

హాస్పిటల్లో చేర్పించి, ఆమె బాగోగులు చూసుకోడానికి రమాదేవిని అక్కడ వదిలి, నిన్ను నావెంట ఇక్కడికి తీసుకొచ్చాను....” అన్నాడు రుద్ధ కంఠంతో.

నళిని ఆయన గుండెమీద తలవాల్చి వెక్కి వెక్కి ఏడవసాగింది. “నా తలిదండ్రులెవరైనా, మీరు నా తండ్రి కాదంటే నేను సహించలేను డాడీ! ఊహ తెలిసి నప్పటినించీ మీరు నామీద చూపిన ప్రేమానురాగాలు ఎంత మధురమైనవో నా అంతరాత్మకే తెలుసు!”

“నేను నీ తండ్రిని కాకున్నా నువ్వు నా రక్తానివే కదమ్మా!” అన్నాడు డాక్టర్ ఆమె తల నిమురుతూ.

అంతలో ఇన్‌స్పెక్టర్ కల్పించుకుని, “చూశారా దుర్యోధన్! ఇప్పుడర్థమైందికదా హత్యకు కారణం? రమాదేవి మరొక్క నెల బ్రతికివుంటే ఆమె అరవై లక్షల ఆస్తికి అధికారిణి అయివుండేది. అదో కారణం! తన తల్లిని ఇన్నేళ్ళు ఇంట్లో బంధించి, ఆమెను మానసికంగా హింసించి, తనను తల్లి ప్రేమకు నోచుకోకుండా చేసిన పినతల్లి రమాదేవిపట్ల ప్రతీకారం రెండో కారణం! ఇవి చాలనుకుంటాను కోర్టు వారికి?” అన్నాడు డాక్టర్ కటువుగా.

“చెప్పారో, చెప్పలేదో మాకెలా తెలుసు? ఏమిటి నిదర్శనం? మీరు చెప్పకున్నా మరోవిధంగా తెలియవచ్చుగా ఆమెకు?”

“ఎలా తెలుస్తుంది?”

“జపాన్‌లో వున్న రమాదేకీ, మీకూ తరుచూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేవి కదా?”

“ఔను. ఆ ఉత్తరాన్ని నేను వెంటనే చింపి కాల్చేసేవాణ్ని!”

"మీరు ఇంట్లో లేనప్పుడో, ఊళ్ళో లేనప్పుడో ఏదో ఒక ఉత్తరం ఆమె చేతికి అందివుండవచ్చుగా...." ఇన్‌స్పెక్టర్ మాట పూర్తికాకముందే ఫుల్ సూటులో వున్న ఓ నడి వయస్కుడు హడావుడిగా ఆఫీసులోకి వచ్చాడు.

"రండి డాక్టర్, రండి!" అంటూ లేచి, అతన్ని అందరికీ పరిచయం చేస్తూ, "ఈయన మా డిపార్టుమెంటల్ డాక్టర్ ముకుందంగారు! రమాదేవి శవాన్ని మార్చ్యురీ చేసింది ఈయనే!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

డాక్టర్ వాళ్ళను సమీపించి, "మీరు నగిషీలు చెక్కిన ఓ పొడవాటి కత్తెరపలుకును మాకు పంపించి, హత్య దానితోనే జరిగిందన్నారు కదూ! శవం కంఠం మీద గాయం నిస్సందేహంగా అటువంటి పలుకువల్లే ఏర్పడింది. ఐతే, మీరు పంపినదానితో మాత్రంకాదు! సరిగ్గా అలాటి పలుకునే పోలిన మరో పలుకుతో జరిగిందని నా అభిప్రాయం!" అన్నాడు.

అందరూ దిగ్భ్రాంతితో ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"హత్య ఆ పలుకును పోలిన మరో పలుకుతో జరిగిందని ఎలా చెప్పగలుగుతున్నారు డాక్టర్? మీకు పంపిన పలుకు హత్యా ప్రదేశంలోనే దొరికింది మాకు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ తీవ్ర స్వరంతో.

డాక్టర్ నవ్వి, కోటుజేబులోంచి చిన్న కాగితం కవరుతీసి, దాన్ని టేబిల్ మీద బోర్లించి దులిపాడు. మరుక్షణం కవర్లోంచి అర అంగుళం పొడవున్న బాగా మొనదేలిన ఇనపముక్క కిందపడింది.

"ఇదేమిటో తెలుసా? పోస్టుమార్టం చేస్తున్నప్పుడు

ఆమె కంఠంమీది గాయంలోంచి బైటపడిన ముక్క! హత్యాయుధం ఆమె గొంతులో దిగాక, బైటికి లాగుతున్నప్పుడు మొన అందులో ఇరుక్కు-పోయింది!" అంటూ మరో జేబులోంచి కాగితంలో చుట్టిన కత్తెర పలుకుతీసి, "హత్యాయుధ మంటూ మీరు పంపిన పలుకు ఇది. చూడండి. దీని మొన యథాతథంగా అలాగే వుంది" అన్నాడు డాక్టర్.

ఆ స్థితిని సద్వినియోగం చేసుకుంటూ, "ఇప్పుడేమంటారు ఇన్‌స్పెక్టర్! దీన్నిబట్టి హత్య ఈ పలుకుతో గాక, దీని రెండో పలుకుతో జరిగినట్లు స్పష్టమౌతోంది. ఆవిధంగా నళిని నిర్దోషి అని కూడా ఋజువవుతోంది. ముందా యింటిని క్షుణ్ణంగా మరోసారి గాలించి హత్యాయుధాన్ని హస్తగతం చేసుకోండి" అన్నాడు దుర్యోధన్.

"ఇల్లంతా అంగుళం వదలకుండా గాలించాను. కొంపదీసి, హంతకుడు హత్యాయుధాన్ని వెంటతీసుకు పోలేదు కదా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ అయోమయంగా.

"థాంక్ గాడ్! నా తల్లి తలపై మోపబడ్డ హత్యాభియోగం ఈ విధంగా తొలగిపోయింది!" అన్నాడు డాక్టర్ శ్రీకాంత్ నళిని వీపు నిమురుతూ.

సరిగ్గా అదే సమయంలో టేబిల్‌మీది టెలిఫోన్ మోగింది. ఇన్‌స్పెక్టర్ రిసీవర్ అందుకుని, కాసేపు అవతలి సంభాషణ విని, ఒక్కసారి లేచినిల్చున్నాడు. "సత్యవేణి ఆచూకీ లభించింది!"

"ఎక్కడ?" అందరూ ఒకేసారి ప్రశ్నించారు.

"తిరుపతిలో!"

"సజీవంగానా?" అడిగాడు రామారావు.

"సారీ! శవరూపంలో. తిరుమల దేవస్థానంవారి కాటేజ్ అద్దెకు తీసుకుని, వెంకటేశ్వరస్వామి దర్శనం చేసుకుని, కాటేజ్‌లో ఎండ్రిన్ తాగి ఆత్మహత్య చేసుకుందిట!

"మ .... మ్మో!" అంటూ చేతుల్లో మొహం కప్పుకుంది నళిని.

"మీ వాలకం చూస్తోంటే ఆమె తిరుపతిలో చనిపోయినట్టు మీకు ముందే తెలిసివుందనిపిస్తోంది" అన్నాడు దుర్యోధన్ రామారావుతో.

అతను నిట్టూరుస్తూ తలూపాడు. "ఔను, రమాదేవి ఆమెను వెదకడానికి నన్ను నియమించాక, ఎంతో ప్రయత్నంమీద ఇక్కడ ఓ టాక్సీని కనుక్కోగలిగాను. ఆ టాక్సీలోనే ఆమె ఇక్కణ్ణించి తిరుపతి వెళ్ళింది! వెంటనే నేను తిరుపతి చేరి, తీవ్రంగా గాలిస్తే ఆమె తిరుమల దేవస్థానంవారి కాటేజ్‌లో అద్దెకున్నట్టు తెలిసింది.

ఆ కాటేజ్ కెళ్ళి చూస్తే తలుపు మూసుంది. బైట తాళంలేదు. ఎంత తట్టినా తలుపు తెరుచుకోలేదు. విసిగి, కిటికీ సందులోంచి లోపలికి చూశాను. సత్యవేణి పక్కమీద నిశ్చలంగా పడుంది. ఆమె ఊపిరితీసుకుంటున్న కదలిక కూడా లేకపోవడంతో చనిపోయిందని నిశ్చయించుకున్నాను.

పోలీస్ రిపోర్టు నే తీగలాగి డొంకంతా కదుపుతారని ఏమీ ఎరగనట్టు మద్రాసు వచ్చేశాను. ఆ సంగతి చెప్పుదామని రమాదేవి ఇంటికి ఫోన్ చేస్తే ఎవరూ ఎత్తలేదు. నేనే చెబుదామని వెళ్ళిచూస్తే ఆమె చచ్చిపడుంది

పడగ్గదిలో.

దుర్యోధన్, నళిని భుజంతట్టి, "శాంతించమ్మా! హత్యాభియోగం నించి నిన్ను తప్పించామని సంతోషిస్తుంటే, తల్లిని కోల్పోయిన దుఃఖం నిన్ను చుట్టుముట్టింది. నీ తల్లి ఈ రోజు కాదు. పన్నెండేళ్ళక్రితమే చని పోయిందని మనసు రాయిచేసుకో!" అంటూ ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగి, "ఇప్పుడామె శవం ఎక్కడుందట?" అడిగాడు.

"తిరుపతి పోలీసులకు శవం సోమవారం ఉదయం దొరికిందట. పోస్టుమార్టం చేయించి, అంత్యక్రియలు జరిపిద్దామనుకుంటుండగానే మేము పంపిన మెసేజ్ అందిందట. ఆమె పోలికలు మేము వర్ణించినట్టే ఉండటంతో నాకు ఫోన్ చేసి, శవాన్ని హాస్పిటల్లో భద్రపరిచారట. ఇక బైలుదేరదామా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ క్యాప్ అందుకుంటూ.

## 8

అందరూ తమతమ వాహనాల్లో తిరుపతి చేరేసరికి రాత్రి ఏడుగంట లయింది. తిన్నగా పోలీస్ స్టేషన్ కెళ్ళి, స్థానిక ఇన్‌స్పెక్టర్ని కలుసుకున్నారు. అతను వాళ్ళను హాస్పిటల్‌కి తీసికెళ్ళి, కోల్డురూంలో భద్రపర్చిన శవాన్ని చూపాడు.

డాక్టర్ శ్రీకాంత్ వెంటనే గుర్తుపట్టాడు శవాన్ని! ఎంతోకాలం ఒంటరిగా ఒక గదిలో గడిపి, వయసు ఉడిగి, చిక్కి శల్యమైనా, శవాన్ని చూడగానే సత్యవేణి ఒకప్పుడు చాలా అందగత్తె అయిఉండాలని స్ఫురించింది దుర్యోధన్‌కు.

తల్లిని చుట్టేసి భోరుమంది నళిని. అతికష్టంమీద ఆమెను ఓదార్చి, అందరూ తిరిగి పోలీస్ స్టేషన్ చేరారు.

"శవం పోస్టుమార్టం రిపోర్టు ఇలా ఇవ్వండి" అన్నాడు యుగంధర రెడ్డి స్థానిక ఇన్‌స్పెక్టర్‌తో.

అతను బల్ల సొరుగులోంచి రిపోర్టుతీసి అందిస్తూ, "శవం సోమవారం దొరికింది మాకు. ఐతే, పోస్టుమార్టం తరవాత, ఆమె మరణించి నలభై ఎనిమిది గంటలయిందని చెప్పాడు డాక్టర్! అంటే, శనివారం సాయంత్రమన్న మాట! శవం పక్కనే ఆమె రాసిపెట్టిన ఓ ఉత్తరం కూడా దొరికింది మాకు!" అన్నాడు.

"ఉత్తరమా! ఏది?" అడిగాడు దుర్యోధన్ ఆతృతగా.

ఇన్‌స్పెక్టర్ సొరుగులోంచి మడతపెట్టిన అరఠావు సైజు కాగితంతీసి అందించాడు. అందులోని చేతిరాత చూడగానే అంతక్రితం తాను చూసిన కథల కార్బన్ కాపీ స్క్రిప్టుల చేతిరాత జ్ఞాపకం వచ్చింది దుర్యోధన్‌కు.

అందరూ వినేలా గట్టిగా చదవసాగాడు ఉత్తరాన్ని.

"నా చావుకు నేను తప్ప మరెవ్వరూ బాధ్యులు కారు. నావంటి అదృష్టహీనురాలు ఈ లోకంలో నిస్సిగ్గుగా, నిశ్శబ్దంగా బ్రతకడంకంటే సాధ్యమైనంత త్వరగా మరణించడమే మేలు!

సుఖంగా సంసారం చేసుకుంటున్న సమయంలో చేజేతులా ప్రేమించి పెళ్ళాడిన భర్తను పోగొట్టుకుని, మా ప్రేమఫలంగా నవమాసాలూ మోసిన కన్నకూతుర్ని కళ్ళల్లో పెట్టుకు పెంచలేక, అనామకురాలిగా బ్రతికిన బ్రతుకూ ఒక బ్రతుకేనా?

(ఈ ఉత్తరం ఎవరికి దొరికినా దయచేసి, దీన్ని

మద్రాసులో నివసించే డాక్టర్ శ్రీకాంత్ గారికి అంద జెయ్యాలని వేడుకుంటున్నాను.)

బావా! నా చిట్టితల్లి నళినిని ఇంతకాలం తండ్రికన్నా మిన్నగా ఏ లోటూ లేకుండా పెంచి, అపారమైన అను రాగాన్ని అందించిన నీకు నేను ప్రతి జన్మలోనూ ఋణ పడివుంటాను. రమాదేవీ, నువ్వూ పరస్పరం అర్థం చేసుకుని, ఇన్నేళ్ళ బ్రహ్మచర్యాన్ని విడనాడి, ఇద్దరూ వివాహ మాడబోతున్నారని తెలిసి నేసెంతో ఆనందించాను.

కానీ ఆ ఆనందం కూడా అట్టే కాలం నిలవదని తెలిసి ఎంతగానో విచారించాను. మేమిద్దరం అక్కా చెల్లెళ్ళం నిజంగా చాలా దురదృష్టవంతులం! నాకంతా తెలుసు.... నావల్ల ఎంత అవుతుందో అంతా చేశాను.... కానీ, దురదృష్టాన్ని జయించడం ఎవరి తరం?

అందుకే, మరో గత్యంతరంలేక ఈ నిర్ణయం తీసు కున్నాను....ఇలాంటి విపత్కర పరిస్థితిలో నువ్వు పని గట్టుకుని విదేశాలకు బైలుదేరడం నాకు నచ్చలేదు. నువ్వు తప్ప ఆ విపత్తునించి ఆమెను మరెవ్వరూ కాపాడ లేరని తెలిసీ ఆమెనలా ఒంటరిగా వదిలిపోవడం చాలా అన్యాయం!

కనీసం ఆమెను నీవెంట తీసికెళ్ళినా బావుండేది. ఇక ఆమె నెవ్వరూ కాపాడజాలరు! భగవంతుడు మా అక్కా చెల్లెళ్ళ ఆత్మలకు శాంతిని ప్రసాదించుగాక!!

ఇంతకిమించి ఇంకా రాసే ఓపిక నాలో లేదు. ఉంటాను. యెప్పటిలాగే నా చిట్టితల్లికి ఏ లోటూ రానివ్వకుండా చూసుకుంటావని ఆశిస్తున్నాను.

ఇట్లు —

సత్యవేణి!"

"శేషామె అంత్యక్రియలు శాస్త్రోక్తంగా ఇక్కడే జరిపించి వెళదాం!" అన్నాడు డాక్టర్ శ్రీకాంత్ సజల నయనాలతో.

ఆ రాత్రి అందరూ నగరంలోని ఓ లాడ్జిలో విడిది చేశారు. భోజనాల తరవాత దుర్యోధన్ రామారావును తన గదిలోకి తీసికెళ్ళి, "సత్యవేణి రాసిన ఉత్తరంలోని కొన్ని వాక్యాలు నన్ను చాలా తికమక పెడుతున్నాయి" అన్నాడు.

"ఏమిటవి?"

"మీరిద్దరూ వివాహమాడబోతున్నారని తెలిసి ఎంతో ఆనందించాను. కానీ, ఆ ఆనందం కూడా అట్టే కాలం నిలవదని తెలిసి యెంతగానో విచారించాను.... మేమిద్దరం అక్కాచెల్లెళ్ళం చాలా దురదృష్టవంతులం! రమాదేవి దురదృష్టం ఏమిటి? ఆమె చంపబడుతుందని సత్యవేణికి ముందే తెలుసా? మరో వాక్యం....అందుకే గత్యంతరం లేక ఈ నిర్ణయం తీసుకున్నాను....ఏమిటా నిర్ణయం? చెల్లెలి హత్యా?"

"అసంభవం! సత్యవేణి శనివారమే చనిపోయింది. రమాదేవి హత్య ఆదివారం జరిగింది. అలాంటప్పుడు సత్యవేణి ఆమెనెలా చంపుతుంది?"

దుర్యోధన్ సాలోచనగా తలూపి, "మరి ఆమె ఏ నిర్ణయం గురించి ప్రస్తావించింది? తన ఆత్మహత్య గురించా? సరే, మరో విషయం....భగవంతుడు మా అక్కాచెల్లెళ్ళ ఆత్మలకు శాంతిని ప్రసాదించుగాక! ఈ వాక్యంతో చెల్లెలి మరణం తథ్యమని ఆమెకు ముందే తెలుసున్న విషయం స్పష్టమౌతోంది. ఇక్కడ మరో సంగతి గమనించాలి....

నువ్వు తప్ప ఆ విపత్తునించి ఆమెను మరెవ్వరూ కాపాడజాలరని తెలిసీ ఆమెను ఒంటరిగా వదిలిపోవడం చాలా అన్యాయం! ఇప్పుడా మెనెవ్వరూ కాపాడజాలరు ఏమిటా విపత్తు? ఇంత రామాయణం రాసిన మనిషి హంతకుడి పేరెందుకు రాయలేదో?" అన్నాడు దుర్యోధన్ మొహం చిట్లిస్తూ.

రామారావు కాసేపు ఆలోచించి చటుక్కున తలెత్తాడు. "ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి ఊహ ప్రకారం నళినికి ఏదో ఒక మార్గాన తన జన్మ వృత్తాంతం తెలిసిందేమో, తరుచూ రమాదేవి ఇంటికి వస్తూ పోతుండేది గనక తన తల్లిని ఆమె ఎన్నో ఏళ్ళుగా ఇంట్లో బంధించి, ఆమె రాసిన రచనలు తన పేర ప్రచురించుకుంటున్న రహస్యం కూడా పసిగట్టి, ప్రతీకారంతో పిన తల్లిని చంపాలని పథకం వేసిందేమో!

ఆ పథకం తెలిసిన సత్యవేణి, కూతుర్ని వారించడానికి తన శాయశక్తులా ప్రయత్నించి, విఫలమై ఇంట్లోంచి పారిపోయిందేమో! అటువంటప్పుడు ఆమె తన కూతురి పేరు ఎలా రాస్తుంది?"

దుర్యోధన్ పలకలేదు. తీవ్రంగా ఆలోచిస్తూ సోఫా వెనక్కి వాలాడు.

## 9

మర్నాడు సత్యవేణి శవానికి అంత్యక్రియలు జరిపించి అందరూ మద్రాసు చేరేసరికి బాగా అలిసిపోయారు. బడలిక తీర్చుకోడానికి పరస్పరం సెలవుతీసుకుని, ఎవరిళ్ళవైపు వారు సాగిపోయారు. ఐతే, డిటెక్టివ్ దుర్యోధన్ తాను చేపట్టిన కేసు పూర్తయ్యేవరకూ ఓ పట్టాన విశ్రాంతి తీసుకునే ఘటం కాదు.

రామారావుని అతనింటివద్ద దింపి, తిన్నగా రమాదేవి ఇల్లు చేరుకున్నాడు. అతన్ని చూడగానే కోమిలాక్షి మొహం తెల్లబడింది.

"సత్యవేణి చనిపోయిన సంగతి నీకు తెలుసా కోమీ?" అడిగారు దుర్యోధన్ సూటిగా.

"తెలుస్!"

"ఎప్పుడు? ఎక్కడ?"

"జపాన్‌లో! పన్నెండేళ్ళక్రితమ్!"

"నో! ఆమె ఈ మధ్యే చనిపోయింది!"

"కాద్! ఆమె చనిపోయ్ పన్నెండేళ్ళయింద్!"

"అనవసరంగా బెట్టుచెయ్యక! నువ్వు రమాదేవికి అత్యంత విశ్వాసపాత్రురాలైన సేవికవని నాకు తెలుసు. అందుకే ఆమె భారతదేశం వస్తూ నిన్ను వెంట తెచ్చుకుంది. అంతేకాదు, నీతోబాటు తన అక్క సత్యవేణిని కూడా తీసుకువచ్చి, రైటింగ్ రూంలో రహస్యంగా వుంచి, ఆ విషయం ఎవరితోనూ చెప్పొద్దని నిన్ను ఆదేశించింది....

ఐతే, సత్యవేణి వారం రోజుల క్రితం ఇక్కణ్నించి పారిపోయి తిరుపతిచేరి, అక్కడ ఆత్మహత్య చేసుకుంది. ఈ రోజే మేమామె శవానికి అంత్యక్రియలు జరిపి వస్తున్నాం!"

ఆ మాట వినగానే కోమీ కళ్ళల్లో కన్నీరు సుళ్ళు తిరిగింది. "ఇప్డు నా గటి ఏమ్కావాలి? ఇప్డు నా గటి ఏమ్కావాలి?" అరిచి తలకొంచుకుంటూ.

"జపాన్‌లో వుండగా సత్యవేణికో కూతురు పుట్టిందని నీకు తెలుసుగా?"

"తెల్సు!"

"డాక్టర్ శ్రీకాంత్ కూతురు చలామణి అవుతున్న నళిని ఆ అమ్మాయని కూడా తెలుసా?"

"తెల్సు!"

"ఇక నీ శేష జీవితం ఆమెవద్ద గడపవచ్చు నిశ్చింతగా!"

ఆ మాట వినగానే కోమీ కన్నీరు తుడుచుకుని, "ఔను! బేబీ దగ్గరే ఉంటాన్!" అంది.

"నువ్వామెవద్ద ఆశ్రయం పొందాలంటే, నేనడిగే ప్రశ్నలకు బాగా ఆలోచించి, సరైన జవాబులివ్వాలి. ఎందుకో తెలుసా? రమాదేవిని ఆమే చంపిందని పోలీసు లనుమానిస్తున్నారు. నీ జవాబులతో ఆమెని నిర్దోషిగా నిరూపింపబడవచ్చు."

"అడ్గండి! చెప్తాన్!"

"రమాదేవి పెంపుడు పక్షి లూచో ఎప్పుడూ ఆమె గదిలోనే వుంటుందా?"

"ఔను! ఆమె రాస్కునేటప్డూ, పడుకునేటప్డే దాన్ని కిందికి టీస్కుపొమ్మని చెప్పేద్ నాకు! ఎందు కంటే, డానికూట చాలా బయమ్కరమ్గా ఉంటుండి!"

"రమాదేవి చనిపోయిన రోజు, అంటే నువ్వు లెటర్ పాడ్ తీసుకుని ఆమె గదిలోకెళ్ళిన సమయంలో ఆ పక్షి అక్కడే ఉందా?"

"ఔన్!"

"దాన్ని కిందికి తీసికెళ్ళమని చెప్పలేదా ఆమె నీతో?"

"చెప్ లేదు!"

"మరి ఆమె చనిపోయాక పోలీసులు వచ్చి చూస్తే పడగ్గదిలో వేళాడుతున్న పంజరంలో ఆ పక్షి లేదుట!

దాన్ని కిందికెవరు తీసికెళ్లారు?"

"తెలీదు!"

"రెండో పనిమనిషి కేమైనా తెలుసా?"

"పిలుస్తాన్" అంటూ లోనికెళ్ళి, స్థానిక పనిమనిషిని పిల్చుకొచ్చింది కోమీ.

దుర్యోధన్ ఆమెను సంబోధించి, "ఎప్పుడైతే మీ యజమానురాలు మరణించిందో, అప్పుడు లూచో ఆ గదిలోని పంజరంలోనే వుందిట. కానీ, పోలీసులువచ్చి చూస్తే అది పంజరంలో లేదు. మీ యజమానురాలు దాన్ని బైటికితీసికెళ్ళమని చెప్పిందా నీతో?" అడిగాడు.

"లేదే!"

"మరి ఆ పక్షి కిందికెలా వచ్చింది?"

పనిమనిషి తల వంచుకుంది. "నేను ఏదో పనిమీద తోటలోకెళ్ళాను. హఠాత్తుగా నా దృష్టి ఇంటికప్పు మీద కూర్చున్న లూచోమీద పడింది. నా ప్రాణాలు పైనే పోయాయి. ఎందుకంటే, ఓసారి అది నా చేతి లోంచి ఎగిరిపోయినప్పుడు యజమానురాలు భద్రకాళిలా నామీద విరుచుకుపడ్డారు.

దాని బాగోగులు చూసుకునే పని నాదే. అమ్మగారి కంటబడకముందే దాన్ని పట్టి తిరిగి పంజరంలో బంధించాలని, నేలమీద ఓ రాయందుకుని, దానిమీదకు విసిరాను. రాయి గురితప్పి ఎటో పడింది. మరో రాయి విసిరాను. అది తగలగానే లూచో రివ్వున కిందవాలింది. అష్టకష్టాలుపడి దాన్ని పట్టి లోపలికి తెచ్చి పంజరంలో బంధించాను."

అప్పుడర్థమైంది దుర్యోధన్‌కు రామారావూ, వళినీ రమాదేవి పడగ్గదిలో వున్నప్పుడు కిటికీగుండా లోనికి

వచ్చి పడ్డరాయి మిస్టరీ! అది తోటలోంచి పనిమనిషి లూచో మీదికి విసిరినరాయే అయుంటుంది!

సాలోచనగా తలూపి, "లోమీ! పైన రైటింగ్ రూంలో అనేక రైటింగ్ పాడ్‌లూ, కాగితాలూ వుండగా మీ అమ్మగారు స్టోరు గదిలోంచి రైటింగ్ పాడ్ ఎందుకు తెప్పించారు?" అడిగాడు.

"అప్డు రైటింగ్ రూం టల్పుకు తాళం వేసుండి. దాని టాళంచెవి ఎంట వెతికినా కన్పించలేదు. అప్డు అమ్మగార్ చాలా టొండర్లో వున్నార్! అందుకే స్టోర్ గడిలోంచి టెమ్మన్నార్!"

"నువ్వు పాడ్ తీసుకురావడానికెళ్ళినప్పుడు ఆమె యే దుస్తుల్లో వుంది?"

"చీర్లో!"

"కానీ, పోలీసులు వచ్చి చూస్తే ఆమె శవం ఒంటి మీద జపాన్ స్త్రీలు ధరించే కొత్త కోమోనో వుండట. అంటే, ఇప్పుడు నువ్వు తొడుక్కున్న గౌన్‌లాంటిది!"

"ఔన్! స్టోర్లోంచి పాడ్ టీస్కురమ్మని నాటో చెప్నప్డు ఆమె చీర్లో వుండి, నేనుపాడ్ టెచ్చి ఇచ్చినప్డు కోమోనోలో కన్పించిండి!"

"థాంక్యూ వెరీమచ్ లోమీ! ఇంతవరకూ నా మెదడును తొలిచేస్తున్న అనేక ప్రశ్నలకు నీద్వారా సరైన సమాధానాలు లభించాయి. డాక్టర్తో మాట్లాడి నీ ఆశ్రయానికి ఏర్పాట్లు చేస్తాను. సెలవు" అంటూ అక్కణ్ణించి తిన్నగా ఇల్లు చేరుకున్నాడు దుర్యోధన్.

గోరువెచ్చని నీటితో తనివిదీరా స్నానంచేశాక, మనసు కాస్త తేలికైనట్టు తోచింది. టవల్‌తో ఒళ్ళు తుడుచుకుని, బట్టలు తొడుక్కుంటూన్నాడో లేదో,

టెలిఫోన్ మోగింది.

రిసీవర్ ఎత్తి, "హలో, దుర్యోధన్ స్పీకింగ్!" అన్నాడు.

"నేను, ఇన్‌స్పెక్టర్ యుగంధర రెడ్డిని మాట్లాడుతున్నాను. వెంటనే హెడ్‌క్వార్టర్స్‌కు రాగలరా?"

"ఏం జరిగింది?"

"రండి. ఇక్కడే తెలుస్తుంది!"

"ఓ. కే! వస్తున్నాను."

# 10

హెడ్‌క్వార్టర్స్ చేరి, ఇన్‌స్పెక్టర్ ఆఫీసులో అడుగు పెట్టి ఆశ్చర్యపోయాడు దుర్యోధన్. డాక్టర్ శ్రీకాంత్ లాయర్ మూర్తీ, రామారావూ, నళినీ అందరూ వున్నారక్కడ.

"మళ్ళీ ఏం ముంచుకొచ్చింది ఇన్‌స్పెక్టర్?" అడిగాడు ఓ కుర్చీ ఆక్రమిస్తూ.

"మిస్ నళినిని అరెస్టు చేసే సమయం!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నింపాదిగా.

"రెండోసారా!?"

"ఔను."

"ఏ నేరంమీద?"

"అదే హత్యా నేరం!"

"ఏమిటి ఆధారం?"

"ఆమె తల్లి సత్యవేణి రాసిన ఉత్తరం! 'దాన్ని శ్రాస్త జాగ్రత్తగా చదివితే ఎన్నో నిగూఢ విషయాలు బోధపడతాయి. రమాదేవి చావబోతోందని ఆమెకు ముందే తెలుసుననిపించడమేగాక, ఆమెను తన కూతురే చంపడానికి పథకం వేస్తోందని కూడా ఆమెకు ముందే

తెలుసునని స్పష్టమౌతుంది. హత్య జరక్కుండా ఆమె తన శాయశక్తులా ప్రయత్నించి, విఫలమై, విధిలేక ఇంట్లోంచి పారిపోయి, ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించింది. హంతకురాలు తన కూతురే కనక ఉత్తరంలో ఆమె పేరు రాయకుండా దాచిపెట్టింది!"

"అంతేనా?"

"అంతేకాదు. మరో ఋజువు కూడా వుంది నా కద్ద!"

"ఏమిటది?"

"మీలాగే నాకూ చేపట్టిన కేసు పూర్తికానిదే మనశ్శాంతి లభించదు. తిరుపతినించి మనమంతా ఇక్కడికి రాగానే రమాదేవి ఇంటికెళ్ళి కామాక్షిని కలిశాను. అంతకుముందే మీరక్కడికెళ్ళి ఆమెతో మాట్లాడి పోయారని తెలిసింది.

రమాదేవి మరణించేముందు కామాక్షిని స్టోర్ గది లోంచి లెటర్ పాడ్ తీసుకు రమ్మని చెప్పిందట. పైన రైటింగ్ రూంలో లెటర్ పాడ్ లుండగా, ఆమె స్టోర్లోంచే ఎందుకు తెమ్మందని అడిగాను. అందుకు కామీ ఏమందో తెలుసా?

అప్పుడు రైటింగ్ రూంకు తాళంవేసుందనీ, తాళం చెవికోసం వెదికితే సమయానికి కనిపించలేదనీ, అందుకే స్టోర్ గదిలోంచి తేవలసి వచ్చిందనీ వివరించింది. మేము వెళ్ళిచూసినప్పుడు రైటింగ్ రూం తలుపులు బార్లా తెరిచే వున్నాయి.

ఆమె వాఙ్మూలం ప్రకారం హత్యకు ముందు ఆ తలుపుకు తాళంవేసుంటే, హంతకుడు రైటింగ్ రూం వెంటిలేటర్ గుండా లోపలికి వచ్చి, హత్యచేసి పోవడం

అసంభవం! నళిని వాఙ్మూలం ప్రకారం ఆమె ముందు గదిలోనే వుంది గనక ఆ దారిన కూడా ఎవ్వరూ వచ్చే అవకాశం లేదు. దీన్నిబట్టి హంతకి ఆమేనని ఋజువవుతోంది.

అంతేకాదు, రామారావు ఆమెతో చేతులు కలిపి, మమ్మల్ని తప్పుతోవ పట్టించడానికి తాళంచెవి సంపాదించి, రైటింగ్ రూం తలుపు తెరిచిపెట్టారు. ఆవిధంగా అయినా ఆ నేరంలో భాగస్వామి అయ్యారు. నేను వాళ్ళిద్దర్నీ అరెస్టు చెయ్యబోతున్నాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ దృఢ స్వరంతో.

దుర్యోధన్ నవ్వి—"మీ ఆరోపణల్లో చిన్న లోపం వుంది. ఆ లోపం ఆధారంగా ఒక మంచి లాయర్ మొదటిరోజు విచారణలోనే వాళ్ళిద్దర్నీ సగౌరవంగా విడుదల చేయించగలడు. ఆ లోపమేమిటో తెలుసా?" అడిగాడు.

"ఏమిటి?"

"హత్యాయుధం! ఎక్కడుంది? మీరా ఇంటిని క్షుణ్ణంగా గాలించారు. హత్యానంతరం రామారావుగానీ, నళినిగానీ మీరొచ్చేవరకూ ఎక్కడికీ వెళ్ళలేదు. హత్య నళిని చేసివుంటే హత్యాయుధం అక్కడే వుండాల్సింది. లేదా, ఆమె దాన్ని కిటికీగుండా తోటలోకి విసిరివుంటే, తోటలో దొరకాల్సింది. తోటలోగానీ ఇంట్లోగానీ అది ఎక్కడా మీకు దొరకలేదు. కోర్టులో దాన్ని ప్రవేశపెట్టందే మీ ఆరోపణ ఋజువుకావడం చాలా కష్టం!"

ఇన్‌స్పెక్టర్ ముఖం రంగులు మారింది. "ఐతే, హత్యాయుధం ఎలా మాయమైందంటారు?"

"మాయం కాలేదు! కోమితో మాట్లాడాక,

తార్కిక వాదంతో నేనో నిర్ణయానికొచ్చాను. అది నిజమైతే హత్యాయుధం ఆ ఇంట్లోనే ఒకచోట దొరికి తీరాలి. పదండి" అంటూ లేచాడు దుర్యోధన్.

## 11

అందరూ ఉత్కంఠతకొద్దీ ఆదరాబాదరా రమాదేవి ఇల్లు చేరుకున్నారు. వాళ్ళని చూడగానే కోమీ మొహం పాలిపోయింది. హాల్లో ఓ మూల వేలాడుతున్న పంజరం మీద పడింది దుర్యోధన్ దృష్టి. ఆ పంజరం మధ్య ఇనపకడ్డీమీద కూర్చుని ముక్కుతో ఈకలు సవరించు కుంటోంది యాచో పక్షి!

"కోమీ! ఆ పంజరాన్ని మేడమీదికి తీసుకురా!" అన్నాడు దుర్యోధన్ మెట్లవైపు నడుస్తూ.

మారు మాటాడకుండా పంజరంతో వాళ్ళననుసరిస్తూ పైకిచేరింది కోమీ. అందరూ రమాదేవి పడగ్గదిలో ప్రవేశించారు.

"ఇప్పుడు చెప్పండి ఇన్‌స్పెక్టర్! హత్యాయుధం కోసం మీరెక్కడ వెదికారు?"

"ఇంటా, బైటా అంగుళం వదలకుండా!"

"వెరీగుడ్! ఐతే, ఒక ప్రదేశాన్ని మీరు మర్చిపోయారు."

"ఏమిటది?"

"ఇంటికప్పు!"

ఇన్‌స్పెక్టర్ కళ్ళు పెద్దవయ్యాయి.

"ప్లీజ్, ఒకసారి పైకెళ్ళి చూడండి, అది ఇంటికప్పు మీదే ఎక్కడో వుండవచ్చని నా అభిప్రాయం!"

"ఆల్ రైట్! అదీ చూస్తాను" అంటూ గబగబ బైటికి నడిచాడు ఇన్‌స్పెక్టర్.

"హత్యాయుధం ఇంటికప్పుమీద కెలా చేరుతుంది?" అడిగాడు రామారావు ఆశ్చర్యంగా.

అందరూ ఊపిరి బిగబట్టి ఎదురు చూడసాగారు. పావుగంట తరవాత హడావుడిగా వచ్చాడు ఇన్‌స్పెక్టర్. "మీ అంచనా కరక్టే దుర్యోధన్! హత్యాయుధం కనిపించింది కప్పుమీద!" అంటూ చేతిలో చుట్టి వున్న కాగితాన్ని టేబిల్ మీదుంచి విప్పాడు.

రక్తం అంటివున్న కత్తెరపలుకు!

అర అంగుళం విరిగివుంది దాని మొన!!

"ఇది ఇంటి కప్పుమీదుంటుందని ఎలా ఊహించారు దుర్యోధన్?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ సంభ్రమంగా.

"మీ ప్రశ్నకు జవాబిచ్చేముందు, కోమీని కొన్ని ప్రశ్నలడిగి నా సందేహాలు నివృత్తి చేసుకోవాలి!" అంటూ కోమీరాకీ వైపు తిరిగి, "కోమీ! నువ్వు జపాన్ పుట్టి పెరిగావుకదా, ఆ దేశంలో తరతరాలనించీ వస్తున్న ఓ ఆచారం ఇప్పటికీ అమల్లో వుంది. అక్కడ ఎవరైనా సమాజం సమ్మతించని ఏదైన ఘోరమైన తప్పుచేస్తే, ఆ తరవాత వారి అంతరాత్మ పదేపదే ఆ తప్పును ఎత్తిచూపుతూ మనసును క్షోభ పెడుతుంటే, ప్రాయశ్చిత్తం కోసం, పాప మోక్షం కోసం ఏం చేస్తారు వారు?" అడిగాడు.

"హరాకరీ!"

"అంటే?"

"ఆత్మ హత్య!"

"ఆ ఆత్మహత్య చేసుకోడానిక్కూడా అక్కడో పద్ధతి వుంది, ఏమిటది?"

"పొట్ట కొమోనో టొడుక్కుని నగిషీలు చెక్కి

రక్త్యాలు పొదిగిన బాకుటో!"

"ఔను. ఆ బాకును పొట్టలో పొడుచుకుని ఆత్మ హత్య చేసుకుంటారు" మధ్యలో అన్నాడు డాక్టర్ శ్రీకాంత్.

"కాదు! కాదు! మగవాండ్లు పొట్టలో పొడుచుకుంటార్! ఆడవాండ్లు గొంతు కోసుకుంటార్!" అంది కోమీ విడమరుస్తూ.

"కరెక్ట్! ఎప్పుడైతే రమాదేవి లెటర్ పాడ్ తెమ్మని నిన్ను బైటికి పంపించేవో అప్పుడామె ఏ దుస్తుల్లో వుంది?"

"చీర్లో!"

"లెటర్ పాడ్ తెచ్చాక?"

"కాత కిమోనోలో!"

దుర్యోధన్ అందర్నీ ఒకసారి పరికించి, "ఇప్పుడర్థమైందా? రమాదేవిని ఎవరూ చంపలేదు! ఆమె స్వయంగా తనను తాను చంపుకుని, హారాకరీ చేసుకుంది. ఐ మీన్ ఆత్మహత్య! తోడబుట్టిన సోదరికి ఆమె ఇన్నాళ్ళు చేసిన అన్యాయం, అక్రమం, అమానుషత్వాలను ఈ వయసులో ఆమె అంతరాత్మ పదేపదే ఎత్తిచూపుతూ, ఆ ఘోరమైన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోమని పదేపదే ఉసిగొల్పి వుంటుంది.

ఎప్పుడో యవ్వనంలో తాను ప్రేమించిన వ్యక్తిని పెళ్ళిచేసుకున్నందుకు స్వంత అక్కమీద పగా, కసీ పెంచుకుని, ఆమె మనసులో అనుమాన బీజాలు నాటి, అనాలోచితంగా కట్టుకున్న భర్తను చంపేట్టుచేసి, తద్వారా ఆమె మతి స్థిమితాన్ని పోగొట్టి, భారతదేశం తీసుకొచ్చి రహస్యంగా ఇంట్లో బంధించి, ఆమె రాసిన నవలలు తన పేర ప్రచారం చేసుకుని, ఆమెకు చెందా

ల్సిన కీర్తి కిరీటాన్ని తన శిరస్సుపై అలంకరించుకుని ఊరేగడం ఎంత నైచ్యమో ఈ వయసులో కళ్ళు తెరిచిన రమాదేవి అంతరాత్మ ఆమెను ప్రతిక్షణం ప్రాయశ్చిత్తం చేసుకోమని పురికొల్పింది.

అంతలో హఠాత్తుగా సత్యవేణి ఇంట్లోంచి పారిపోడంతో, ఇన్నాళ్ళ తన రహస్యం లోకానికి తెలిసిపోతుందనీ, ఇక తాను జీవించడం నిరర్థకమేనని తలచి, త్వరగా తనువు చాలించాలని నిర్ణయించుకుంది.

జపాన్‌లో పుట్టి పెరగడంవల్ల అక్కడి ఆచార వ్యవహారాలు ఆమె నరనరంలో ఇమిడి వుండటం సహజం! అందుకే అక్కడి రీతిప్రకారం ఆత్మహత్యకు హారాకరీ పద్ధతిని ఎంచుకుంది.

మరణించేముందు తన ఆస్తిపాస్తుల్ని ఏం చెయ్యాలో, యెవరికప్పగించాలో లాయర్ గారికి సూచనలివ్వాలని లెటర్ పాడ్ తెప్పించి, సగం ఉత్తరం రాశాక, ఆమెకు జ్ఞాపకం వచ్చివుంటుంది. తన మరణానంతరం యావదాస్తి ఎలాగూ సత్యవేణికే చెంది, తద్వారా నళినికి చెందుతుందని.

అందుకే ఉత్తరాన్ని మధ్యలో ఆపి, ఉండచుట్టి, చెత్తబుట్టలో పడేసింది. ఆచారం ప్రకారం హారాకరీకి, నగిషీలు చెక్కిన రత్నాలు పొదిగిన బాకు కావాలి. అది ఇంట్లో లేదు. కానీ అటువంటిదే ఓ కత్తెర వుంది. ఆ కత్తెర పలుకుల్ని విడదీసి నేలపై మోకాళ్ళమీద కూర్చుని, దేవుణ్ణి తలుచుకుని, ఆ పలుకును గట్టిగా గొంతులో పొడుచుకుని బైటికి లాగేసింది. ఆ విధంగా నరాలు తెగి రక్తం విరజిమ్మి త్వరగా ప్రాణం పోతుందని!”

"మీ తర్కం నన్ను తృప్తిపరచడంలేదు దుర్యోధన్! ఆమె ఆత్మహత్య చేసుకుని వుంటే, హత్యాయుధం ఇంటికప్పుమీది కెలా చేరింది?" అడిగాడు ఇన్స్పెక్టర్ మొహం చిట్లిస్తూ.

"అదీ చెబుతాను" అంటూ కోమిలాక్షివైపు తిరిగి, "రమాదేవి నిన్ను లెటర్ పాడ్‌తో పంపినప్పుడు లూచో పక్షి యెక్కడుంది?" అడిగాడు దుర్యోధన్.

"ఇక్కడే! ఆ పంజరంలో!" చెప్పింది కోమి.

దుర్యోధన్ స్థానిక పనిమనిషిని సంబోధిస్తూ, "ఆ రోజు మధ్యాహ్నం నువ్వు యింటి కప్పుమీదికి రాయి ఎందుకు విసిరావో ఇన్స్పెక్టర్ గారికి వివరించు!" అన్నాడు.

జరిగింది జరిగినట్టు చెప్పింది పంకజం!

దుర్యోధన్ అందర్నీ ఒకసారి పరికించి, "విన్నారా? ఈ గదిలోని పంజరంలో ఉన్న లూచో ఇంటి కప్పుమీది కెలా వెళ్ళింది? ఎలా వెళ్లిందో చెబుతాను వినండి....

ప్రతిమనిషీ తాను మరణించేముందు తనకు అత్యంత ప్రీతిపాత్రులైన వారిని అన్ని విధాలా సంతోష పర్చడానికీ, తనకున్నదంతా వారికి అర్పించి తృప్తిపర్చడానికీ ప్రయత్నిస్తాడు. ఈ లోకంలో రమాదేవికున్న ఆత్మీయులూ, బంధువులూ ఇద్దరే. అక్క సత్యవేణీ, ఆమె కూతురు నళిని!

తన తదనంతరం ఆ ఆస్తిపాస్తులూ, నగలూ అంతా ఎలాగూ అక్కకూ, తద్వారా నళినికీ లభిస్తాయి. ఐతే, వాళ్లిద్దరేగాక ఈ లోకంలో ఆమెకు అతి ప్రీతిపాత్రమైన మరో ప్రాణి వుంది. అదే లూచో! దాన్ని ఎలా తృప్తిపర్చాలి?

ప్రతి జీవీ స్వేచ్ఛను కోరుకుంటుంది. అనేక సంవత్స రాలు బందీగా బ్రతికిన ఒక జీవికి శాశ్వతంగా స్వేచ్ఛను ప్రసాదిస్తే అది భరించలేని ఆనందాన్ని పొందుతుంది. అందుకే మరణించేముందు ఆ ఆనందాన్ని తన ప్రియమైన పక్షికి ప్రసాదించాలని నిర్ణయించుకుంది రమాదేవి.

హారాకరీ చేసుకునేముందు ఆమె పంజరం మూత తెరిచి, లూచోను బైటికితీసి, కిటికీని సమీపించి, దాన్ని బైటికి వదిలేసింది. ఇక్కడ ఒక విషయం గమనించాలి. రామచిలక తప్ప కోళ్ళూ, బాతులూ, పావురాలూ, కుక్కలూ, పిల్లులూ, ఆవులూ మొదలైన పెంపుడు జంతువులూ, పక్షులూ తమను అల్లారుముద్దుగా పెంచిన యజమానుల్ని అంత సులభంగా మర్చిపోలేవు.

అలాగే, ఎంతో కాలం ఈ యింట్లో రాజభోగా లనుభవిస్తూ గడిపిన లూచో, స్వేచ్ఛ లభించినా ఎక్కడికీ ఎగిరిపోలేదు. రమాదేవి వదలగానే అది ఇంటి కప్పుమీద కూర్చునుంటుంది. కాసేపయ్యాక దానికి యజ మానురాలు జ్ఞాపకంవచ్చి, కిటికీగుండా తిరిగి గదిలోకి వాలి వుంటుంది.

అప్పటికే రమాదేవి ఆత్మహత్య చేసుకోనడం జరిగిపో యింది. ఆమె గొంతుకోసుకున్న కత్తెరపలుకు శవం పక్కనే నేలమీద పడుండాలి. ఇక్కడ మరో విషయం గమనించాలి. పెద్ద పెద్ద పక్షులు సాధారణంగా మెరిసే వస్తువులవైపు ఆకర్షితులవుతాయి.

ఉదాహరణకు ఉష్ట్ర పక్షినే తీసుకుందాం! దాన్నే నిప్పుకోడి అంటారు. ఎడారి ప్రాంతాల్లో నివసించే నిప్పుకోడి, సూర్య కాంతిలో నిప్పులా ధగధగ మెరిసే ఇసక రేణువుల్ని ముక్కుతో పొడుస్తూ తినడానికి ప్రయ

త్తిన్నది. అందుకే దానికి నిప్పుకోడి అనే పేరు వచ్చింది. నిజానికి నిప్పు తినదు!

అలాగే లూచో కూడా రత్నాలు పొదిగిన ఆ కత్తెర వైపు ఆకర్షితురాలై కాసేపు దాన్ని ముక్కుతో పొడిచి నోట్లో కరిచి పట్టుకుని, యెగిరి కిటికీగుండా మళ్ళీ యింటి కప్పుమీద కూర్చునుంటుంది. సరిగ్గా ఆ దేసమయంలో పనిమనిషి పంకజం దాన్ని చూడటం, రాయి విసరడం జరిగింది. ఆ రాయి గురితప్పి కిటికీ చువ్వలగుండా వచ్చి గదిలో పడింది.

రెండో రాయి తగలగానే లూచో కత్తెరపలుకును కప్పుమీదే వదిలి, ఎగిరి నేలమీద వాలింది. ఇవీ జరిగిన సంఘటనలు. రమాదేవిని ఎవ్వరూ చంపలేదు గనక ఎవ్వరూ నేరస్తులు కారు! తాను చేసిన నేరానికి, తనను తానే శిక్షించుకుంది ఆమె!" అంటూ ముగించాడు దుర్యోధన్.

ఇన్‌స్పెక్టర్ కాసేపు తీవ్రంగా ఆలోచించి, పాలోచనగా తలూపాడు. "మీ హేతువాదంతో ఇప్పుడు నేను ఏకీభవిస్తున్నాను దుర్యోధన్! అలాగే, నా చేతిలో ఒక నిరపరాధి అరెస్టుకానందుకు సంతోషిస్తున్నాను."

డాక్టర్ శ్రీకాంత్ తేలికపడ్డ మనసుతో నళిని తల నిమిరాడు తృప్తిగా.

అలా ఆ కేసు ముగిసిందని భావించాడు ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి. కానీ, దుర్యోధన్ దృష్టిలో ఆ కేసు పూర్తిగా ముగియలేదింకా!

## 12

"ఎస్, డాక్టర్ శ్రీకాంత్ స్పీకింగ్!"

"నేను, దుర్యోధన్ మాట్లాడుతున్నాను. తీరిక

వుంటే ఒకసారి మా యింటికి వస్తారా? చాలా ముఖ్య విషయం చర్చించాలి మీతో!"

"తప్పకుండా! ఇప్పుడే వస్తున్నాను."

"మీ వెంట అమ్మాయిని తీసుకురాకండి!" అంటూ రిసీవర్ పెట్టేశాడు దుర్యోధన్.

అరగంట తరవాత వచ్చాడు డాక్టర్ కార్లో. అతన్ని సాదరంగా తీసికెళ్లి తన కన్సల్టింగ్ రూంలో కూర్చోబెట్టాడు దుర్యోధన్.

"చెప్పండి. ఏమిటి సంగతి?" అడిగాడు డాక్టర్ కుతూహలంగా.

"రమాదేవి కేసు ఇంకా పూర్తికాలేదు డాక్టర్! అందుకే మిమ్మల్ని పిలిపించాను....మీరా మెను అంతగా ద్వేషిస్తున్నప్పుడు ఆమెతో పెళ్లితతంగం యెందుకు నడిపించారో ఇప్పటికీ నాకర్థం కావడంలేదు!"

"ఆమెని నేను ద్వేషించడమా? ఏమిటి మీరంటోంది దుర్యోధన్?" డాక్టర్ మొహం ఒక్కసారి తెల్లబడింది.

దుర్యోధన్ జేబులోంచి సత్యవేణి రాసిన ఉత్తరము నకలు తీసి, టీపాయ్‌మీద పరిచాడు.

"ఈ ఉత్తరంలోని కొన్ని వాక్యాలు మొదటినించీ నన్ను చాలా తికమక పెట్టాయి. రాత్రంతా ఆలోచించాక గానీ, వాటిలోని అంతరార్థం బోధపడలేదు నాకు. చూడండి....ఇలాంటి విపత్కర పరిస్థితిలో నువ్వు పని గట్టుకుని విదేశాలకు బైలుదేరడం నాకు నచ్చలేదు. నువ్వు తప్ప ఆ విపత్తునించి ఆమెను మరెవ్వరూ కాపాడలేరని తెలిసీ ఆమెను ఒంటరిగా వదిలిపోవడం చాలా అన్యాయం! కనీసం ఆమెను నీ వెంట తీసికెళ్లినా బావుండేది. ఇక

ఆమెనెవ్వరూ కాపాడజాలరు! భగవంతుడు మా అక్కా-చెల్లెళ్ళ ఆత్మలకు శాంతిని ప్రసాదించుగాక ....

చూశారా, ఈ వాక్యాలతో ఆమెకు రమాదేవి మరణం తథ్యమని ముందే స్పష్టంగా తెలిసివున్నట్టు విశదం కావడంలేదూ?"

"బహుశా, రమాదేవి అంతరాత్మ కళ్ళు తెరిచి, తన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని అక్కాకు క్షమా పణలు చెప్పుకుని, తాను హారాకరీ చేసుకోబోతున్నట్టు చెప్పేసిందేమో!"

"ఇక్కడే అసలు ప్రశ్న ఉద్భవిస్తుంది. ఎన్నడూ లేనిది ఇన్నేళ్ళ తరవాత రమాదేవి అంతరాత్మ ఎందుకు కళ్ళు విప్పిందా అని?"

"మనిషి యెప్పుడేం ఆలోచిస్తాడో యెలా చెప్ప గలం?"

"నా ఉద్దేశం అదికాదు! ఒక మనిషికి తాను కొద్ది రోజుల్లో చనిపోతానని తెలిసినప్పుడే అతని అంతరాత్మ కళ్ళు విప్పి, తానుచేసిన పాపాలకు కలత చెందుతుందని నా అభిప్రాయం!

అందుకే, ఘోరాతిఘోరమైన, క్రూరాతిక్రూరమైన నేరాలు చేసిన నేరస్తులకు మరణశిక్ష పడ్డ తరవాత, ఇక కొద్దిరోజుల్లో తను ఉరికంబం ఎక్కుతాడనగా అతనిలో అనూహ్యమైన పరివర్తనవచ్చి, పరమ సాధ్విలా మారి, భగవంతుడి ధ్యానంలో మునిగిపోవడం గమనిస్తూనే వున్నాం!

అదేవిధంగా, రమాదేవికి తానిక కొద్దిరోజుల్లో మరణించడం తథ్యమని ఎలాగో తెలిసివుంటుంది. అందుకే ఆమె అంతరాత్మ కళ్ళు విప్పి, చేసిన పాపానికి ప్రాయ

శ్చిత్తం చేసుకోవాలని అక్కడ క్షమాపణలు చెప్పుకుని, తాను హారాకరీ చేసుకోబోతున్నట్టు చెప్పి వుంటుంది."

"తాను మరణించబోతున్నట్టు ఆమెకెలా తెలిసిందంటారు?"

దుర్యోధన్ నవ్వి—"ఏమీ ఎరగనట్టు అలా మాట్లాడకండి డాక్టర్! ఆమె మనసులో ఆ ఆలోచనా బీజాన్ని మొలకెత్తించింది మీరే! ఆమె ఇంటికి మీరు తరచూ వచ్చి పోయేవారు గనక, సత్యవేణి ఆ యింట్లో రహస్యంగా బంధించబడుందనీ, ఆమె రాసే నవలల్ని రమాదేవి తన పేర ప్రచారం చేసుకుని కీర్తి శిఖరాలు చేరిందనీ మీకు తెలిసిపోయింది!

దాంతో ఆమెపట్ల ద్వేషం, అసహ్యం కట్టలు తెంచుకున్నాయి మీలో! ఆ ద్వేషమే, అసహ్యమే మీ చేత ఆమెను హత్య చేయించింది...."

"నేనా? ఆమెను హత్య చేశానా? ఏమిటి మీరంటోంది? ఆమె చనిపోయినప్పుడు నేను మీ వెంట ఓడ ప్రయాణంలో, సముద్రం మధ్య ఉన్నానని మర్చిపోయారా?"

"మర్చిపోలేదు! ఐతే, అది ప్రత్యక్ష హత్య కాదు. పరోక్ష హత్య! శారీరక హత్యకాదు. మానసిక హత్య! ఆమెను చంపడానికి మీరు కత్తీ, పిస్తోలువంటి ఆయుధాలు ఉపయోగించలేదు. మీ వృత్తినీ, ఖ్యాతినీ ఉపయోగించారు!

ఎప్పుడైతే మీలో ఆమెపట్ల ద్వేషం వెల్లుబికిందో ఆనాటినించీ యెలాగైనా ఆమెకు తగిన శాస్తి జరిపి తీరాలని సమయం కోసం కాచుకున్నారు. ఈ మధ్య ఎప్పుడో కొద్దిగా జబ్బుపడ్డ ఆమెను పరీక్షిస్తున్నట్టు

నటించి, అది మామూలు జబ్బు కాదనీ, అతి భయంకర మైన క్యాన్సర్ జబ్బు అనీ చెప్పివుంటారు.

అంతేకాదు, ఆమెను నమ్మించడానికి మరో కేన్సర్ రోగికిచెందిన ఎక్స్‌రే కాపీలు కూడా చూపి, ఇక ఆమె అట్టేకాలం బ్రతకదని చెప్పివుంటారు. మీవంటి ప్రఖ్యాతి స్పెషలిస్టు ఆమాట అన్నప్పుడు కాదనే దమ్ము లెవరి కున్నాయి? అందుకే రమాదేవి ఆ అబద్ధాన్ని పచ్చి నిజంగా నమ్మింది.

ఆమె జపాన్‌లో పుట్టి పెరిగింది గనక, అక్కడి ఆచార వ్యవహారాలు ఆమె నరనరాల్లో ఇంకి వున్నాయనీ క్యాన్సర్ వల్ల కొద్దిరోజుల్లో తన మరణం తథ్యమని తెలిశాక ఆమె అంతరాత్మ తప్పకుండా కళ్ళు తెరు స్తుందని, పాప ప్రాయశ్చిత్తం చేసుకోడానికి ఆమె హారాకరీ చేసుకుంటుందనీ మీరు ముందే ఊహించారు. మీ ఊహ అక్షరాలా నిజమైంది.

ఆత్మహత్యానికల్ల రమాదేవి మరణించేముందు తన అక్కకు క్షమాపణలు చెప్పుకుని, తన నిర్ణయం తెల్పివుంటుంది. సత్యవేణి చెల్లెలిని క్షమించి ఆత్మహత్య చేసుకోవద్దని వేడుకునుంటుంది.

పాపభారంతో మనసు వికలమై వున్న రమాదేవి అందుకు సమ్మతించకపోడంతో సత్యవేణి బెంబేలెత్తి, యింట్లోంచి పారిపోయి, ఇహ లోకంమీద విరక్తి చెంది, తిరుపతిలో ఆ ఉత్తరం రాసి, ఆత్మహత్య చేసుకుంది!

ఆమె రాసిన ఆ ఉత్తరంలోని ఈ వాక్యాల ఆధా రంగానే ఇదంతా ఊహించగలిగాను నేను. తన చెల్లెలు కేన్సర్ రోగి అని తెలిసీ, మీరామెను ఒంటరిగా వదిలి విదేశానికెళ్ళడం తనకు నచ్చలేదనీ, అన్యాయమనీ, ఆ

విపత్తునించి మీరు తప్ప తన చెల్లెల్ని మరెవ్వరూ కాపాడజాలరనీ ఆమె ఉత్తరంలోని అసలు అర్థం!

మీరు కోరుకునేదీ ఆమె చావేనని పాపం ఆ అమాయకురాలికేం తెలుసు? యిక్కడ సత్యవేణి దొడ్డ మనసుకు జోహారులర్పించాలి. పచ్చని తన సంసారాన్ని ఛిద్రంచేసి, యిన్నాళ్ళూ తనను చిత్రహింసలు పెట్టిన చెల్లెలిని క్షమించడమేకాక, ఆమె క్షేమంకోసం చివరి వరకూ తాపత్రయపడ్డ సత్యవేణి నిజంగా మహోన్నతురాలూ, మంచి రచయిత్రీ అయుండాలి.

మొత్తానికి మీరు కోరుకున్నది సాధించారు. చేతో ముట్టుకోకుండా యెన్నో యోజనాల దూరంలో వుండీ, రమాదేవిని ఆమె చేతులతోనే చంపేశారు మీరు! కాదంటారా డాక్టర్?" అడిగాడు.

శ్రీకాంత్ కళ్ళల్లో కన్నీరు సుళ్ళు తిరిగింది. "లేదు! మీరన్నవి అక్షరాలా నిజం! మీవంటి మేధావిని నేనింత వరకూ చూడలేదు. కావలిస్తే నన్ను అరెస్టుచేసి చట్టాని కప్పగించండి దుర్యోధన్!"

"మిమల్ని అరెస్టు చెయ్యడానికీ, శిక్షించడానికీ చట్టంవద్ద యెలాంటి సాక్ష్యమూ, ఆధారమూ లేదు డాక్టర్! చట్టం దృష్టిలో మీరు స్వచ్ఛమైన నిరపరాధి! ప్రతి పాపానికీ, నేరానికీ ప్రత్యక్ష సాక్షి భగవంతుడే గనక, రమాదేవి చేసిన ఆ నికృష్టమైన పాపానికి భగవంతుడే ఆమెకు మీ ద్వారా ఆ విధంగా శిక్ష విధించి ఉంటాడు!"

—:ఐ పో యి ం ది:—

# నేరాలు-శిక్షలు

## టెంపోరావ్

ఎవరో తలుపును తట్టారు. ఆమె టైమ్ చూసింది. పద కొండు కావస్తోంది. అతడు మామూలుగా ఆదే టైముకు వస్తాడు.

భయపడుతూ ఆమె తలుపు తెరిచింది. కంగారాజూ తూలుతూ లోపలకు వచ్చాడు. కోపంగా ఆమెవైపు చూశాడు.

"నేనింత సేపు బయట నిలబడాలా?" అరిచాడు.

"మీరు తట్టగానే నేను తలుపు తెరిచాను" అందామె వినయంగా.

"నేను కుడివాడినటే? రాస్కెల్, ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు!" గద్దించాడతను.

ఆమె జవాబివ్వలేదు. గోడకు వేళ్ళాడుతున్న కృష్ణుడి ఫోటోవంక చూసింది. తనని దేవుడే రక్షించాలి.

తను ఏం చెప్పినా అతడి ఆగ్రహం పెరిగిపోతుంది. ఆఫీసు పని అయ్యాక ఆరక్ సేవించి భర్త యింటికి

వస్తాడు. తనతో పోట్లాడి, తన్ని కొట్టి చివరికి అతడు నిద్రపోతాడు. మౌనంగా నుంచుని ఆమె ఆలోచిస్తోంది.

ఒక కాలు కొద్దిగా విరిగిన కుర్చీలో అతడు తటాలున కూర్చున్నాడు. కాలు పూర్తిగా విరిగి కుర్చీ అతడితో సహా పక్కకు పడింది.

కోపంగా అతడు లేచాడు. పళ్ళు కొరుకుతూ ఆమె వైపు వెళ్ళాడు.

“ఇది యిల్లుకాదే, నరకం. కూర్చోడానికి కుర్చీకూడా లేదు!” అరుస్తూ ఆమె చంపమీద కొట్టాడతను.

ఆమె వెనక్కి జరిగింది. ఈ గొడవ విని యిద్దరు కొడుకులు, కూతురు నిద్రలేచి పక్క గదిలోంచి పరుగెత్తుకొచ్చారు.

గంగరాజు భార్య జుత్తు బలంగా పట్టుకున్నాడు.

“అమ్మని కొట్టొద్దు నాన్నా!” పెద్దకొడుకు ఏడుస్తూ అర్చాడు.

“వెధవా, నిన్ను తన్నాలిరా!” అని అతడు కొడుకు వైపు వెళ్ళాడు.

ఎర్రగా వున్న తండ్రికళ్ళవైపు చూస్తూ పిల్లలు దూరంగా జరిగారు.

“వాడినెందుకు కొట్టడం? నన్నే కొట్టి మీ కోపాన్ని చల్లార్చుకోండి” అంది అబల.

అతడు వెనుదిరిగి ఆమె దగ్గరికెళ్ళి జుత్తు పట్టుకుని వీపుమీద బాదాడు.

“ఇంటికొచ్చిన భర్తకు తిండైనా పెట్టావటే?” అర్చాడతను.

“పదండి పెడ్తాను” అందామె.

“నేను వెళ్ళి నువ్వు వడ్డించినదాకా కాచివుండాలా?

ఎంత పొగరు!"

ఆమెను పదేపదే కొట్టాడతను. దూరంగా నిలబడి అదంతా నిస్సహాయంగా పిల్లలు చూస్తున్నారు.

ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. కోపంతో ఆమె జాకెట్‌ను బలంగా లాగాడతను. ఒకవైపున జాకెట్ చిరిగిపోయింది. ఆమె స్తనాలు బయటకు కనిపిస్తున్నాయి.

అమాంతంగా యెవరో తలుపు తోసుకుని లోపల కొచ్చి తలుపును వీపుతో మూసి గంగరాజువైపు చూశాడు.

"నీ భార్యమీద మళ్ళా చెయ్యేస్తే నువ్వు బతికి వుండవు!" అన్నాడా ఆగంతకుడు.

"ఎవరు నువ్వు? రాస్కెల్ బయటకుపో!" అరస్తూ అతడివైపు నడిచాడు గంగరాజు.

తలుపు దగ్గర వున్న వ్యక్తి మాస్కు ధరించాడు. అతడి చేతిలో వున్న కమ్చీ పైకి లేచింది. మరుక్షణంలో గంగరాజు ఒంటిమీద ఛళ్ళుమంది.

గంగరాజు అరుస్తున్నాడు కాని అతడు వదల్లేదు. కమ్చీతో కొడ్తూనే వున్నాడు. అతడు బాధతో, భయంతో బొబ్బలెడుతున్నాడు.

కమ్చీ ఆగింది. మాస్కు రంధ్రాల్లోంచి అతను గంగరాజువైపు చూశాడు.

"ఇటుపైన మళ్ళా ఎప్పుడైనా నీ భార్యనీ, పిల్లల్నీ కొడితే నేనిక్కడికి వచ్చి నిన్ను కఠినంగా శిక్షిస్తాను" అరిచాడతను.

"ఇటుపైన ఎప్పుడూ కొట్టను."

"గంగరాజ్, 20 ఏళ్ళనుంచి వుద్యోగంలో వున్నావు.

నీకు వచ్చేది 800. అందులో సగంపైన అరక్కి పోతుంది. తప్ప తాగి యింటికొచ్చి వీళ్ళందర్నీ తన్నుతావు! నీ జీవితాన్ని మార్చుకుని మనిషిలా బతుకు!" అన్నాడతను.

అతడు తలుపు తెర్చి బయటకు పోయాడు. గంగరాజు కోపంగా భార్యవైపు చూశాడు.

"ఎవడే యీ రంకు మొగుడు? వాడిచేత నన్ను కొట్టిస్తావటే?" అరుస్తూ లేచాడతను.

భార్యవైపు కదులుతున్నాడు. ఆమె చాలా భయపడ్తోంది. అతడెవరోగాని తన భర్తను మాడలగొట్టేశాడు. సినిమాల్లో జరిగినట్లు అంతా సాగిపోయింది.

గంగరాజు ఆమె జుత్తు పట్టుకొని లాగాడు. ఆమె అర్చింది. తటాలున తలుపు తెరవబడింది. గుమ్మాని కటువైపున మాస్కు ధరించిన మనిషి నిలబడ్డాడు.

గంగరాజు అటువైపు చూసి భయంతో వెనక్కు పరుగెత్తాడు.

"నేను లేననుకొని నీ భార్యవైపు చెయ్యి ఎత్తకు! నేను నిన్ను అనుక్షణం గమనిస్తూనే వుంటాను" అన్నాడతను.

"నన్ను క్షమించు. నేను నా భార్యనూ, పిల్లల్నీ ఎప్పుడూ కొట్టను" అన్నాడు గంగరాజు.

"జాగ్రత్త!" అని హెచ్చరించి బయటనుంచి అతడు తలుపు మూశాడు.

అటుపైన తన భార్యను గంగరాజు తిట్టలేదు. మౌనంగా వెళ్ళి తనగదిలోని పరుపుమీద వాలిపోయాడు. కాస్సేపట్లో అతడికి నిద్రపట్టేసింది.

మర్నాటి రాత్రి పదింటికల్లా అతను యింటికి చేరుకున్నాడు. ఎక్కువగా తాగినట్లు లేదు.

"భోజనానికి రండి" అందామె.

"వడ్డించు, వస్తాను" అన్నాడతను.

అతడు భోజనం చేశాడు. ఆమెతో మాట్లాడలేదు. తిన్నగా తన పడగ్గదికి వెళ్లి పడుకున్నాడు.

రోజులు గడిచిపోతున్నాయి. కాని మునపటిలా అతడు ప్రవర్తించడం మానేశాడు.

అతదెవరో ఆమెకు తెలియదు. తన భర్తను అతడు కొడ్తుంటే ఆమె ఆనాడు విచారించింది. భయపెట్టి అతడు తన భర్తను మార్చినందుకు ఆమె యిప్పుడు సంతోషిస్తోంది.

తనతో ముభావంగా వుంటున్న తన భర్త త్వరలో యింకా మార్తాడనీ, మంచి మనిషిగా జీవిస్తాడనీ ఆమె విశ్వాసం.

## 2

ఏర్ కండిషండ్ హాల్లో ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

అది సౌండ్ప్రూఫ్ గది. గదిలో ఎంత అర్చినా బయటవాళ్ళకు వినబడదు.

కుషన్డ్ కుర్చీల్లో 120 మంది కూర్చుని వున్నారు. ప్రతి కుర్చీమీదా నంబరు వుంది. యెదురుగా వేదికమీద పర్చిన వెల్వెట్ దుప్పటి తళతళ మెరుస్తోంది.

గదిలోని వాళ్ళు ఏవేవో విషయాలు మాట్లాడుకుంటున్నారు. బజ్జర్ మోగింది. అందరూ మాట్లాడ్డం మానేశారు.

అందరి చూపూ వేదికవైపు వెళ్లింది. పొడుగ్గా, లావుగా వున్న ఒకతను వేదికమీదకు వెళ్లి కుర్చీలో ఆశీనుడయ్యాడు.

అతడి ముఖానికి నీలం రంగు మాస్కు వుంది. మాస్కు రంధ్రాల్లో నుంచి కళ్ళు, పెదిమలు కనిపిస్తున్నాయి. చెవుల ప్రాంతంలో మాస్కుకు నిలువుగా స్లిట్స్ వున్నాయి.

అతను సూటులో వున్నాడు. చేతులకు గ్లవ్స్ వున్నాయి. అందరి చూపూ అతడిమీదే నిల్చిపోయింది. అతనెవరో అక్కడ కూర్చున్న వాళ్ళెవరికీ తెలియదు.

అతడు వాళ్ళకు బాస్, నాయకుడు.

"డియర్ ఫ్రెండ్స్, మార్చి మాసం సమావేశానికి హాజరైన జోనల్ లీడర్లకు నా సుస్వాగతం. గడిచి పోయిన మాసంలో మీ పర్యవేక్షణలో చాలా విజయా లను మనం సాధించాం. మన సీక్రెట్ సర్క్యులర్స్ ద్వారా అంతా మీకు తెలిసే వుంటుంది."

అతడు ఆగాడు. జేబులోంచి కొన్ని పేపర్లు తీసి వాటిని చూస్తూ వుండిపోయాడు. గదిలో చాలా నిశ్శబ్దంగా వుంది.

"డియర్ ఫ్రెండ్స్, పోలీసు కమీషనర్ ఆఫీసునుంచి పట్నంలోని నేరాలను గురించి కొన్ని వివరాలు నాకు అందాయి. ఈ పట్నంలో నేరాలు నెలనెలా తగ్గిపో తున్నాయి. గత డిశంబరులో యాభైమంది యువతులు ఈవ్ టీసింగ్ గురించి పోలీసులకు రిపోర్టు యిచ్చారు. గత మాసంలో పోలీసు రిపోర్టిచ్చిన వాళ్ళు యిరవై మంది వున్నారు. ఇదేవిధంగా బస్సుల్లో జేబుదొంగల మూలంగా ప్రతిరోజూ కొన్ని వందలమంది వాళ్ళ పర్సులను పోగొట్టుకునేవారు. అది కూడా బాగా తగ్గింది. రేప్ కేసులు, హత్యలు తగ్గాయి.

"వాళ్ళ కృషిమూలంగా యిదంతా జరిగిందని పోలీ

కులు భావిస్తున్నారు. ఇదంతా తగ్గడానికి ముఖ్య కారకులు మీరని మనకు తెలుసు. ఇదంతా సాధించినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను."

గదిలోని వాళ్ళు చప్పట్లు కొట్టారు.

"ఇంతవరకూ వచ్చిన విజయాలతో తృప్తిపడి మనం విశ్రాంతి తీసుకోకూడదు. ఒక రాక్షసుడు పోతే మరో రాక్షసుడు యీ పట్నంలో తలెత్తుతూ వుంటాడు. అందువలన మనం ఎలర్టుగా వుండాలి. ఈ నాటి మనుషులలో ధైర్య సాహసాలు క్షీణించాయి. ఇది మంచిది కాదు. చెడును ఆపడానికి, మంచిని పెంచడానికి సిద్ధంగా వుండాలి. ఒక అమాయకుడిని యెవరైనా హింసిస్తూవుంటే మనం ఆ హింసకాండను ఆపాలి. మనుషులు అలా ధైర్యంగా ప్రవర్తిస్తే దేశంలో నేరాలు తగ్గుతాయి."

అతడు ఆగాడు. క్షణకాలం అందరివైపూ చూశాడు.

"డియర్ ఫ్రెండ్స్. చట్టరీత్యా మనం చేసేది ఒక విధంగా నేరం అవుతుంది. ప్రజలను రక్షించడం, దుష్టులను శిక్షించడం పోలీసులు, కోర్టులు చేస్తాయని మన చట్టం అంటుంది. ఇంతవరకూ వాళ్ళమీద ఆధారపడి ప్రజలు అధోగతి పాలయ్యారు. మనం తొందరగా రంగంలోకి దూకి నేరాలను ఆపగలం. నేరస్థులను రక్షించగలం. అందుకే ప్రజలు మనంచేసేది మెచ్చుకుంటున్నారు."

వుత్సాహంగా అందరూ చప్పట్లు కొట్టారు.

"ఫ్రెండ్స్, యిప్పటిలాగే మీరు నిర్విరామంగా కృషిచేస్తారని నమ్ముతూ యీ సమావేశాన్ని ముగిస్తున్నాను. అవసరాన్నిబట్టి మీరు నన్ను నా గదిలో

కల్పుకుని స్వయంగా నాతో మాట్లాడొచ్చు" అని అతడు కుర్చీలోంచి లేచాడు.

అందరికీ నమస్కరించి అతడు డయాస్ దిగి వెళ్లి పోయాడు. అతడు వెళ్లిన కొంత సేపటివరకూ హాలు వాళ్ళ చప్పట్లతో మారుమ్రోగింది.

## 3

బస్సు వేగంగా వెళ్లి ఒకచోట ఆగింది. అనేకమంది తోసుకుంటూ బస్సులో ఎక్కారు. మిస్ అనసూయ కిక్కిరిసి వున్న బస్సులో నిలబడింది. హేండ్ బాగ్ ను ఆమె జాగ్రత్తగా పట్టుకుంది.

ఆమెకు జీతం ఆవాళే వచ్చింది. హేండ్ బాగ్ లో తొమ్మిదివందల రొక్కం వుంది. ఆ డబ్బును జాగ్రత్తగా తీసుకువెళ్ళి ఆమె తన తల్లికి యిస్తుంది. యిద్దరు తమ్ముళ్లు, ముగ్గురు చెల్లెళ్ళు, తల్లి ఆమెమీద ఆధారపడి జీవిస్తున్నారు.

ఒక యువకుడు మెల్లిగా ఆమె వెనక్కు చేరాడు. అతడు పైకి అందంగా వున్నాడు.

పాంటు, స్లాక్ ధరించాడు. మెళ్ళో బంగారం గొలుసుంది. చేతికి ఖరీదైన సీకో వాచ్!

అతడు ఏదో పెద్ద ఉద్యోగంలో వుండివుండాలి! అనసూయ లోలోపల అతడిని గురించే ఆలోచిస్తోంది.

"అమ్మా, నీ వయసు 28 దాటింది. డబ్బు గడించి మమ్మల్నందర్నీ పోషిస్తున్నావు. కాని నీ భవిష్యత్తును గురించి నువ్వు ఆలోచించడంలేదు. నీకు పెళ్ళయితే మంచిదమ్మా" అంది తల్లి ఒక్కసారి.

"నా పెళ్ళి యిప్పుడు కాదమ్మా. తమ్ముడు బి.కామ్ పాసయ్యాక ఉద్యోగంలో చేర్తాడు. అప్పుడు పెళ్ళా

డాను. మిమ్మల్ని నట్టేట వదిలేసి నేను ఆనందించలేను" అంది అనసూయ.

"అలా కాదమ్మా యింకా వయసు వస్తే పెళ్ళి కావడం కష్టమవుతుంది. మనతో వుండే అల్లుడికోసం చూద్దాం" అంది తల్లి.

ఇదంతా ఆలోచిస్తూ ఆమె వెనక్కి తిరిగిచూసింది. ఆ యువకుడు లేడు. ఎక్కడో అతడు దిగిపోయివుండాలి. ఆమె లోలోపల నవ్వుకుంది. ఇలా అనేకమంది తనకు కనిపించి మాయమయ్యారు.

ఆమె చాలాదూరం వెళ్ళాలి. బస్సు ఆగుతోంది. మళ్ళీ ప్రయాణం సాగిస్తోంది.

ఒక బస్టేండులో దిగిన ఆ యువకుడు వేగంగా నడుస్తున్నాడు. అతడు దిగిన బస్సు వెళ్ళిపోతోంది. జేబులోంచి ఒక కవరుతీసి లోపలకు చూశాడతను. చాలా డబ్బుంది. తను అదృష్టవంతుడే!

అతడు కవర్ను జేబులో పెట్టుకుంటున్నాడు. ఎవరో అమాంతంగా అతడి చెయ్యిని పట్టుకున్నారు. అతడు ఆశ్చర్యంగా చూశాడు. తన చెయ్యి పట్టుకున్న వ్యక్తి మాస్కులో వున్నాడు.

మాస్కు మనిషి కవర్ని లాక్కున్నాడు.

"ఆ కవరు నాది" అర్చాడా యువకుడు.

సమీపంలో ఎవ్వరూ లేరు.

"ఈ కవరు ఆ యువతి హేండ్ బాగ్ లోది. హేండ్ బాగ్ ను బ్లేడుతో కోసి యీ కవర్ను పట్టుకుని నువ్వు దిగిపోయావు. నీ వెనకనే నేనూ దిగాను" అన్నాడు మాస్కు మనిషి.

"సగం వాది, సగం నీది!" అన్నాడా యువకుడు.

"నేను దొంగను కాను. ఈ కవర్ను ఆమెకు వాపసు చేస్తాను. నిన్ను పోలీసులకు అప్పగిస్తాను."

"ప్లీజ్, నన్ను పోనీయండి!"

మాస్కు మనిషి అతడివైపు సూటిగా చూశాడు.

"నువ్వు పైకి రోమియోలా వున్నావు. యెందుకిలా పిక్ పాకెట్ అయ్యావు?" ప్రశ్నించాడు మాస్కు మనిషి.

"వుద్యోగం దొరక్క."

"వుద్యోగం యిస్తే యీ పని మానేస్తావా?"

"ఇప్పించి చూడండి."

మాస్కు మనిషి ఒక కార్డు యిచ్చాడు.

"రేపు ఆ నంబరుకు ఫోన్ చేయి. నంబరు 99 యీ కార్డు యిచ్చాడని చెప్పు. వుద్యోగం దొరుకుతుంది. ఇటు పైన దొంగగా నువ్వు బతకనక్కర లేదు."

"తప్పక వెళ్తాను సార్" అన్నాడా యువకుడు.

బస్సు దిగి చాలా దూరం నడిచి మిస్ అనసూయ తన యింటికి చేరుకుంది.

"కాఫీ తెస్తానమ్మా! కాళ్లూ చేతులూ కడుక్కో!" అంది తల్లి.

అనసూయ ముఖం కడుక్కుంది. దుస్తులు మార్చుకుని కుర్చీలో కూర్చుంది. ఆప్యాయంగా తల్లి కాఫీ తెచ్చి యిచ్చింది. కాఫీ తాగుతూ అనసూయ తన తల్లివైపు చూసింది.

"అమ్మా, కవర్లో నా జీతం వుంది. తీసి దాచు!" అంది అనసూయ.

తల్లి హేండ్ బాగ్ తెచ్చి చూసింది. ఎక్కడా కవరు లేదు!

"కవరు లేదమ్మా!" అంది తల్లి.

కాఫీ తాగేసి అనసూయ తన హేండ్ బాగ్‌ను చూసింది. కవరు లేదు! ఆమె గుండె దడదడలాడింది. కవరు ఏమైంది?

ఆమె హేండ్ బాగ్ వైపు పరీక్షగా చూసింది. బ్లేడుతో ఎవరో హేండ్ బాగ్‌ను ఒకచోట అడ్డంగా కోశారు. గుడ్ గాడ్, తన జీతం కవర్ను ఎవరో కొట్టేశారు!

"అమ్మా, నేను వచ్చేటప్పుడు బస్సులో చాలా రద్దీగా వుంది. ఎవరో నా జీతాన్ని దొంగిలించారు!" అంది అనసూయ.

ఆమె కళ్ళలో జీవంలేదు. ఆమె భయపడ్తోంది.

"పోనీ అమ్మా! బాధపడకు! దొంగలకు మన కష్టాలు తెలియవు" అంది తల్లి. కూతుర్కి ధైర్యం యివ్వడానికి.

"ఈ నెల ఎలా గడుస్తుందమ్మా?" అంది అనసూయ ఏడుస్తూ.

"ఏడవకమ్మా! మన్ని పుట్టించిన దేవుడు జీవితాన్ని నెట్టుకపోయే విధానాన్ని సూచిస్తాడు" అంది తల్లి.

"అమ్మా, ఏమైంది? అక్క ఎందుకు ఏడుస్తోంది?" తమ్ముడు అడిగాడు.

ఎందుకో తెలియకుండా ముగ్గురు చెల్లెళ్ళూ ఏడ్వసాగారు. గదిలో అందరూ ఏడ్చేవాళ్ళే!

"తప్పు నాదమ్మా. నేను అజాగ్రత్తగా వున్నాను. అందుకే ఎవడో నా హేండ్ బాగ్‌ను కోయగల్గాడు" అంది అనసూయ.

"అమ్మాయి, చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభించదు. పోయిన డబ్బు పోయింది. మనసు పాడు చేసుకోకు!" అంది తల్లి.

తొమ్మిది దాటింది. అందరూ హాల్లో అలాగే కూర్చున్నారు. ఎవ్వరికీ ఆకలి లేదు.

"ఎవ్వరూ తిండి తినరా?" తల్లి అడిగింది.

"అక్కతో తింటాం" అన్నారందరూ.

ఎవరో తలుపును తట్టారు. అనసూయ పరుగెత్తికెళ్ళి తలుపు తెర్చింది.

అటువైపు నిలబడిన వ్యక్తిని చూసి వులిక్కిపడింది. మాస్కులో వుందతని ముఖం.

"ఎవరు మీరు?" అడిగిందామె.

"లోపలకొచ్చాక చెప్తాను" అన్నాడతను.

ఆమె సంశయిస్తూ వుండిపోయింది.

"బస్సులో మీ హేండ్ బాగ్ కోసి ఒక జేబుదొంగ మీ జీతం కవర్ను పట్టుకుపోయాడు. అది నేను చూశాను. అతడి దగ్గర్నుంచి అది లాక్కున్నాను. యిదిగో ఆ కవరు!" అన్నాడతను.

ఆమె కవర్ను తెర్చి చూసింది. జీతం అంతా సవ్యంగా వుంది. అతడివైపు ఆశ్చర్యంగా చూసింది.

"ప్లీస్, లోపలకు రండి!" అందామె.

"ఇప్పుడు కాదు. మరోసారి వస్తాను" అన్నాడతను.

"నాకింత సేవ చేసినందుకు మీకు నా ధన్యవాదాలు" అందామె.

"మీరు పనిచేసే కంపెనీ నాకు తెలుసు. కాని ఇంటి అడ్రెసు తెలియదు. మీ కంపెనీకి ఫోన్ చేసి ఈ అడ్రెసు కనుక్కుని యిక్కడికొచ్చాను. అందుకే ఆలస్యమైంది" అన్నాడతను.

"మీకు నేను ఏదేనా బహుమతిగా యివ్వొచ్చా?" అడిగిందామె.

"మిస్ అనసూయా, నేను దేశోద్ధారకుల సంఘం మెంబర్ని. బహుమతి కోసం మేము పనిచేయడంలేదు. లోకంలోని అన్యాయాన్ని, అధర్మాన్ని అరికట్టడానికి మేం కృషి చేస్తున్నాం. ఒక కంటి తడిని తుడవగల్గితే మేం ఎంతో ఆనందిస్తాం."

ఆమె ఆవేశంతో అతడి చేతులు పట్టుకుంది.

"ఎంత గొప్ప సంఘం మీది!" అందామె వుద్రేకంతో.

## 4

రమేష్ తన వాచ్ వైపు చూశాడు. టైము పది అయింది. ఆ వాచ్ నిజంగా తనది కాదు. అతడు దొంగలించాడు.

ఎక్కడా వుద్యోగం దొరక్క అతడు దొంగ కావలసి వచ్చింది. అతడు తల్లినీ, చెల్లెల్నీ పోషించాలి.

తండ్రి వున్నంతకాలం జీవితం హాయిగా సాగిపోయింది. గుండె నొప్పితో తండ్రి చనిపోయాడు. హఠాత్తుగా యింటి బాధ్యత అతడి భుజాలమీద పడింది.

గోవిందన్ సహాయంతో అతడు జేబుదొంగ అయ్యాడు. కాని ఎంతకాలం యిలా బతకడం?

తను జేబు దొంగని తల్లికి తెలిస్తే ఆమె తనని చీపుర్తో కొడుతుంది. ఇంట్లోంచి పొమ్మంటుంది.

రోజూ చిల్లర మల్లర పనులుచేసి డబ్బు గడిస్తున్నట్లు అతడు తల్లితో చెప్పాడు. ఆమె అతడి మాటల్ని నమ్మింది.

టెలిఫోన్ బూత్ వైపు అతడు నడిచాడు. మాస్కు మనిషి చెప్పినట్లు తనకు ఉద్యోగం వస్తుందా? ఏదో నాటకం ఆడి మాస్కు మనిషి డబ్బున్న ఆ కవర్ని

లాక్కుపోయాడు. అతడు తనని మించిన దొంగ కావచ్చు!

ఈ లోకంలో అందరూ మోసగాళ్ళే అనే భావం అతడిలో నాటుకుపోయింది.

అయినా ప్రయత్నించి చూస్తే ఏం పోతుంది? అతను బూత్ లోకి మారి గాజు తలుపు మూశాడు.

కార్డుమీదున్న నంబర్ను తిప్పాడు. చిల్లులో ఎనిమిదణాల కాయిన్ వేశాడు. అటువైపునుంచి, "హల్లో!" అన్నారు ఎవరో.

"నా పేరు రమేష్. నంబరు 99 మీకు ఫోన్ చేసి మీతో మాట్లాడమన్నాడు" అన్నాడతను.

"ఆల్ రైట్, సరిగ్గా మూడింటికిరా!"

"ఎక్కడకు రావాలి? కార్డులో అడ్రెసు లేదు!"

"హోటల్ జన్ పాత్ కిరా. నేను రూమ్ నంబరు 32లో వుంటాను."

"అలాగే, సార్" అని అతను రిసీవర్ పెట్టేశాడు.

సరిగ్గా మూడింటికి రమేష్ జన్ పాత్ హోటల్కి చేరుకున్నాడు. రూమ్ నంబర్ 32కి వెళ్ళాడు.

తలుపు తట్టాడు.

"కమిన్!" అందో కంఠం.

అతడు లోపలకు వెళ్ళాడు. గది మధ్యలో వున్న కుషన్డ్ కుర్చీలో బాస్ కూర్చుని వున్నాడు. అతడి వైపు సూటిగా చూశాడు.

"తలుపు మూసి యిలారా!" అన్నాడు. బాస్.

తలుపు మూసి అతడు బాస్ ముందుకు నడిచాడు.

"నంబర్ 99 నిన్ను ఎందుకు పంపాడు?"

"నేనొక పిక్ పాకెట్ ని. ఒక యువతి జీతం కవరు నేను కొట్టేశాను. నంబరు 99 అది నా నుంచి లాక్కు-

న్నాడు. ఆమెకిస్తాడనుకుంటాను" అన్నాడు రమేష్.

"నీకు వుద్యోగం కావాలి. అంతేనా?"

"అవును, సార్."

"ఎంత జీతం కావాలి?"

"కనీసం రెండువందలు."

"నీమీద ఆధారపడే వాళ్ళు ఎందరున్నారు?"

"అమ్మ, నా చెల్లెలు."

"నీకు రెండువందలు చాలదు. కనీసం ఐదువందలు వుండాలి."

రమేష్ మాట్లాడలేదు.

"మిస్టర్ రమేష్, నీకు 600 జీతంమీద వుద్యోగం యిస్తున్నాను."

"చాలా థాంక్స్, సార్."

"మిస్టర్ రమేష్, ఇవాళనుంచి నువ్వు మా దేశోద్ధారకుల సంఘంలో మెంబరుగా వుండాలి."

"వుంటాను, సార్."

"ఇలా రా" అన్నాడు బాస్.

అతడు బాస్ దగ్గరగా వెళ్ళాడు.

"నీ కుడిచెయ్యి చాచు!"

రమేష్ కుడిచెయ్యి చాచాడు.

బాస్ తన జేబులోంచి ఒక సూదిని పైకితీశాడు. తటాలున ఆ సూదిని రమేష్ చేతిలోకి గుచ్చాడు. సూదిని పైకి లాగేశాడు. రక్తం మెల్లిగా బయటకొస్తోంది.

"రమేష్, నువ్వు దేశోద్ధారకుల సంఘం మెంబరువి. ఇటుపైన నువ్వు ఏ నేరం చేయకూడదు. యెవర్నీ మోసగించకూడదు. ప్రజలకు అన్నివిధాలా సహాయపడాలి!"

"అలాగే చేస్తాను, సార్."

"నంబర్ 99ని ఎక్కడ కల్సుకోవాలో తెలుసా?"

"తెలియదు సార్."

అతడు ఒక కార్డును రమేష్‌కిచ్చాడు.

"ఆ నంబర్కి ఫోన్ చెయ్యి. తనని ఎలా యెక్కడ కల్సుకోవాలో నంబరు 99 చెప్తాడు."

"ఫోన్ చేస్తాను, సార్."

"మిస్టర్ రమేష్, నీ చెల్లెలు పెళ్ళికోసం నువ్వు డబ్బు కూడబెట్టనక్కరలేదు. ఆమె వివాహం నేను చేయిస్తాను. ఆ ఖర్చంతా నేను భరిస్తాను."

రమేష్ ఆశ్చర్యంగా అతడివంక చూశాడు.

"మిమ్మల్ని నేను ముందుగా కల్సుకోకపోడం నా దురదృష్టం" అన్నాడు రమేష్.

బాస్ గంభీరంగా నవ్వాడు.

"రమేష్, మనకు మేలుచేసే సంఘటనలు ఆలస్యంగా వస్తూంటాయి. డోంట్ బాదర్! ఆలస్యంగానైనా వచ్చినందుకు సంతోషించు!" అన్నాడు బాస్.

"మీరు నా జీవితాన్ని మార్చేశారు" అన్నాడు రమేష్ ఆవేశంతో.

## 5

మంగమ్మ బట్టలు వుతుకుతోంది. చీరకుచ్చిళ్ళు పైకెత్తి దోపుకుంది. బలమైన పిక్కలు, మోకాళ్ళు కనిపిస్తున్నాయి.

ఆమె వయసు పద్దెనిమిదేళ్ళు. ఆమె రెండేళ్ళుగా దేవరాజు యింట్లోనే పనిచేస్తోంది.

దేవరాజు ధనవంతుడు. అతడికి పదిమంది కొడుకులున్నారు. పెద్ద కుటుంబం. పెద్ద మేడలో అందరూ కలిసే జీవిస్తున్నారు.

వాళ్లో కొడుకు నరేష్ చూపు యెప్పుడూ మంగమ్మ మీదే వుండేది. అది ఆమె గుర్తించి లోలోపల నవ్వుకునేది. ఆమె యెక్కువగా సినిమాలు చూస్తూవుండేది. ఈనాటి సినిమా కథలు ఆమెలో ఎన్నో కోర్కెలను రెచ్చగొట్టాయి. పచ్చగా లేకపోయినా ఆమె అందంగా అంటుంది. ప్రతిరోజూ ఎక్కువగా పని చేయడంవలన ఆమె శరీరం ఆరోగ్యంగా, బలిష్టంగా అగుపిస్తుంది. వుందుకే ఆమె అంతగా నరేష్‌ని ఆకర్షించింది.

కాని ఆమెను ముట్టుకునే ధైర్యం అతడికి లేకుండా పోయింది. ఇది బయటకు పొక్కితే అందరూ పని మనిషితో సరసాలా అని వెక్కిరించవచ్చు. మరో ముఖ్య కారణం తండ్రి అనారోగ్య స్థితి!

ఏ క్షణంలోనైనా బకెట్ తన్నేసి పైకిపోయే స్థితిలో వున్నాడు తండ్రి.

రోజులు గడిచిపోతున్నాయి. మంగమ్మ అతడి గది తుడుస్తోంది. కళ్ళతో ఆమె అందాన్ని జుర్రేస్తున్నాడు నరేష్.

ఆమె మంచం దగ్గరగా వచ్చింది. ఆమెనుంచి వెలువడే ఏదో పరిమళం అతడిలో కోర్కెను రెచ్చగొట్టింది. అతడు అమాంతంగా ఆమె జడకొసను పట్టుకున్నాడు. ఆమె ముందుకు కదులూ ఆగి అతడివంక చూసింది.

"నరేష్‌బాబూ, ఏమిటిది?"

"నీ జడ బాగుంది. యింత పొడవైన జుత్తు నీకెలా వచ్చింది?" అడిగాడతను.

అతను జడను వదిలేశాడు. నవ్వుకుంటూ ఆమె వెళ్ళి పోయింది.

ఇంట్లో వాళ్ళందరూ హాస్పిటల్లో వున్నారు. తండ్రిని

చూసి నరేష్ తొందరగా యింటికి చేరుకున్నాడు. గేటు ముందు గూర్ఖా, మరికొందరు నౌఖర్లు మాత్రం వున్నారు.

మేడమీదున్న అతడి గదిలోకి వచ్చింది మంగమ్మ. వంగి చీపుర్తో తుడవడం ప్రారంభించింది. అతడు మంచం మీద కూర్చుని వున్నాడు. ఆ క్షణంలో మంగమ్మ దేవతలా కనిపించిందతనికి!

"మంగమ్మా!" పిల్చాడతను.

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది. ఆమె లోపల ధరించిన పావడా అతడికి కనిపిస్తోంది.

"నాన్న హాస్పిటల్లో చేరేసరికి యింట్లో యెందరో లేనట్టుంది" అన్నాడతను.

"హాస్పిటల్ కి వెళ్లి మీరు తొందరగా వచ్చేశారు!" అందామె.

"అవును, ఎందుకో తెలుసా?"

ఆమె అతడివైపు చూసింది. తీయగా నవ్వింది.

"మంగీ, నీకోసం!" అన్నాడతను.

చలనం లేనట్లు ఆమె నిలబడిపోయింది. మేడ భాగంలో ఎవ్వరూ లేరు. ఈ సమయంపోతే మళ్ళా రాదు.

అతడు లేచాడు. అమాంతంగా ఆమెను కౌగలించుకున్నాడు. ఆమె గింజుకుంది. కాని అతడు పట్టు వదల్లేదు.

"బాబూ, నన్ను వదలండి. పెళ్లిచేసుకున్న భర్తకి తప్ప మరెవ్వరికీ లొంగను!" అర్చిందామె.

"నిన్ను నేను పెళ్ళాడతాను!"

"మీ మాట నమ్మొచ్చా? నేను పనిమనిషిని. మీరు ధనవంతులు."

"పెళ్ళయినాక నువ్వూ ధనవంతురాలవుతావు."

ఆమెను ముద్దెట్టుకోబోయాడు. ఆమె పెదిమలను పక్కకు తిప్పేసింది.

"పెళ్ళయినాక!" అందామె.

"నామీద నమ్మకంలేదా?"

"వయసులో వున్న మనిషి కోర్కను తీర్చుకోడానికి ఏదైనా చెప్పొచ్చు!" అందామె.

"నేను అటువంటి వాడిని కాను. నిన్ను నేను అఖండంగా ప్రేమిస్తున్నాను. పెళ్లి అయ్యాక నువ్వు యిక్కడే మాతో వుంటావు. నీకు చదువు కూడా చెప్పిస్తాను. సంవత్సరం తిరిగే లోపల మా అందర్నీ నువ్వు మించిపోతావు!"

"అంత అదృష్టం వరదలా వస్తుందంటే నమ్మలేకుండా వున్నాను" అందామె.

"కొంతమందిని అదృష్టం తుపానులా చుట్టేస్తుంది"

ఆమె అతడి వంక తీయగా నవ్వుతూ చూసింది.

"నాలో ఏముంది మీరంతగా ప్రేమించడానికి?" అడిగిందామె అమాయకంగా.

"నా కళ్ళతో చూస్తే ఏముందో తెలుస్తుంది. బ్రహ్మదేవుడు ఒక అమోఘమైన సుందరిని సృష్టించి పొరపాటున ఆమెను పేదరికంలో పడేశాడు. నిన్ను అక్కడి నుంచి బయటకు లాగి, నీ అందాన్ని అందరూ గుర్తించేటట్లు చేయాలని నేను నిశ్చయించుకున్నాను."

ఆమె కళ్ళమ్మట జలజల నీళ్ళు కారాయి.

అమాంతంగా అతడామె పెదిమలను ముద్దెట్టుకుని, ఆమెను బలంగా హత్తుకున్నాడు.

ఆమెను మోసుకెళ్లి పరుపుమీద పడుకోబెట్టాడు. ఆమె ఖంగారుగా లేచింది. పక్కనే కూర్చుని అత

డామెను పడుకోమన్నాడు.

"అదంతా పెళ్లి అయ్యాక!" అందామె.

అతడామె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"నిన్ను నేను ముద్దాడిన క్షణంలోనే దైవం దృష్టిలో మన పెళ్ళి అయిపోయింది. నాకు దైవం ముఖ్యం, ప్రజలు కాదు."

వెల్లకిలా పడుకుని ఆమె అతడి చెయ్యి పట్టుకుంది.

"చేతులో చెయ్యేసి చెప్పండి, నన్ను తప్పక పెళ్ళాడతానని" అందామె.

ఆమె చేతిలో అతడు చెయ్యివేశాడు. "నిన్ను తప్పక పెళ్ళాడతాను. ఈ క్షణంనుంచీ నిన్ను నా భార్యగా స్వీకరిస్తున్నాను" అన్నాడతను వుద్రేకంతో.

ఆనందంతో తొణికిసలాడుతూ ఆమె ఎర్ర గులాబీ పువ్వులా విచ్చుకుంది. నరేష్ తన కోర్కెను తీర్చుకున్నాడు.

"నన్ను మర్చిపోవుగా?"

"అది నువ్వే చూస్తావు. మన పెళ్ళి యీ పట్నంలో సంచలనాన్ని సృష్టిస్తుంది" అన్నాడతను.

చీపుర్ని ఊపుతూ ఆమె హుషారుగా వెళ్ళిపోయింది.

# 6

ఎనిమిదింటిదాకా మేడమీద యితర గదుల్లో వుండే అన్నదమ్ములు లేవరు. అందువలన ఆరు ప్రాంతంలో మంగమ్మ పైకి వెళ్లేది. నరేష్ ఆమె రాకకోసం యెదురు చూస్తూ వుండేవాడు.

ఆమె రాగానే తలుపు మూసేశాడు. ఆటుపైన యిద్దరూ కొంతకాలంపాటు లోకానికి దూరమయ్యేవారు.

రోజులు గడిచిపోతున్నాయి. ఆమె గర్భవతి

అయింది.

"మన పెళ్ళి వెంటనే జరిగిపోవాలి" అందామె.

"అమ్మతో చెప్పాను. నాన్నతో అమ్మ మాట్లాడుతా నంది."

"పెళ్ళయితేగాని నేను తలెత్తుకు తిరగలేను!"

"ఏదో రేపు తేల్చేసుకుందాం" అన్నాడతను.

మర్నాడు ఆమె ఆత్రంగా వెళ్ళింది. నరేష్ ఆమె వైపు సీరియస్‌గా చూశాడు.

"మంగీ, డాక్టర్ శ్రీమతితో మాట్లాడాను. ఆమె కడుపు తీసేస్తుంది. ఖర్చు ఐదువందలు కావచ్చు. ఈ కవరులో 500 వుంది. తీసుకో!" అన్నాడు నరేష్.

"మన పెళ్ళి విషయం?"

"పెద్దలు ఒప్పుకుంటేగాని పెళ్ళికాదు. నేను నీకు అన్యాయం చెయ్యలేదు. ఇద్దరం ఆనందించాం, నే నొక్కడినే కాదు."

ఆమె అతడివైపు గాభరాగా చూసింది.

"మీరు నన్ను మోసం చేశారు. పెళ్ళాడ్తానని నమ్మించి నన్ను అనుభవించి యిప్పుడు తప్పుకోడానికి ప్రయత్నిస్తున్నారు. ఎంగిలి విస్తరిచేసి నన్ను బయట విసరడానికి చూస్తున్నారు" అందామె.

అతడు గంభీరంగా నవ్వాడు.

"మా యింట్లో పనిచేసిన యువతులందరూ నీలాగే నాతో వుండేవారు. వాళ్ళకిచ్చినట్లే నీకూ 500 యిచ్చి పొమ్మంటున్నాను" అన్నాడు నరేష్.

"ఎంత మోసం? నన్ను మీరు బలాత్కరించారు. ఎన్నో కలలు నాలో సృష్టించారు. ఇప్పుడు అదంతా కల్లని తెలుస్తోంది."

"ఇది నీ మొదటి అనుభవం. ఇటుపైన మళ్ళీ యిలా జరిగితే నువ్వెంతగా బాధపడవు! వచ్చేది రాబట్టుకుంటావు!"

"నేను పేద పిల్లను కావచ్చు కాని వేశ్యను కాను" అర్చిందామె.

"అరవకు! కవరు తీసుకొని వెళ్ళు!"

ఆమె కవరు తీసుకోలేదు. కోపంగా కిందకు వెళ్ళిపోయింది.

నరేష్ తల్లి ఆమెను పిల్చింది.

"ఏమే, పైన ఏం చేస్తున్నావు?" అడిగిందామె.

నరేష్ మాటలు ఆమె మెదడులో తిరుగుతున్నాయి.

"అమ్మా, ఆ మంగమ్మని పనిలోంచి తీసేసి పొమ్మను. నా వైపు కామంతో చూస్తుంది. అది నాకిష్టంలేదు" అన్నాడు నరేష్.

నరేష్ తల్లి ప్రశ్నకు ఆమె జవాబివ్వలేదు.

"చూడు మంగమ్మా, నువ్వు పని మానేసి వెళ్ళిపో!" అని ఆమె జీతం యిచ్చేసింది.

"ఎందుకమ్మా నన్ను పొమ్మంటున్నారు?" అడిగిందామె.

"మా వూరునుంచి మరో పనిమనిషి వస్తుంది" అందామె.

నరేష్ తల్లి గూర్ఖాను పిల్చింది. అతడు పరుగెత్తూ వచ్చాడు.

"ఈమెను బయటకు పంపు! ఎప్పుడూ లోపలకు రానీయకు!" అందామె.

ఆమెవైపు చూస్తూ, "ఛలో!" అన్నాడు గూర్ఖా.

ఏదో జరిగుండాలి! అందుకే ఆమె తనని పొమ్మంది.

నరేష్ తల్లితో తనను గురించి ఏం చెప్పాడో! ధనవంతుల కుటుంబాల్లో ఎంత నేరం చేసినా తల్లులు కొడుకులను సమర్థిస్తూనే వుంటారు.

జీతం డబ్బులు తీసుకుని ఆమె బయటకు నడిచింది. గూర్ఖా గేటు మూశాడు.

గేటు బయట ఆమె కొంతసేపు అలాగే నిలబడి పోయింది. కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

సినిమాలు చూసి నరేష్ నిజంగా తనను ప్రేమిస్తున్నాడని ఆమె అనుకుంది. అతడి మాటలు నమ్మి లొంగి పోయింది.

నరేష్ తన శీలాన్ని భంగపర్చాడు. అతడి తల్లి తన్ని పని మాని పొమ్మంది! ఏ తప్పూ చేయని తనకి ఎంత శిక్ష!

ఆమె మేడవైపు చూసింది. ఎక్కడా నరేష్ జాడ లేదు! తనేమైనా నరేష్‌కి లెఖ్ఖలేదు.

ఏడుస్తూ ఆమె పేవ్ మెంటమ్మట నడుస్తోంది. నరేష్ దుర్మార్గుడు! అతడిని శిక్షించాలి! అదెలా సాధ్యం?

ఎవరో ఆమెను పిల్చారు. ఆమె వెనక్కి తిరిగి చూసింది.

"ఎందుకమ్మా, ఏడుస్తున్నావు?" అడిగాడు ఒకతను.

అతడు పెద్దమనిషిలా వున్నాడు. పాంటు, షర్టు, మధ్యలో నల్లటి బెల్టు. వెనక్కి దువ్విన క్రాఫు!

"నా ఖర్మ!" అందామె.

అతడు ఆమె పక్కనే మౌనంగా నడవసాగాడు. ఆమె ఏడుస్తూనే వుంది.

"నువ్వు దేవరాజు యింట్లో పనిచేస్తున్నావా?" అడిగాడతను.

"ఇవాళ పనిలోంచి తీసేశారు."

"ఎందువలన?"

ఆమె ఆలోచిస్తూ నడవసాగింది. తనకు జరిగినదాన్ని గురించి పదిమందికి చెప్తే ఏం లాభం?

"చూడమ్మా, ఏదేనా అన్యాయం జరిగితే నాతో చెప్పు. నేరస్థులను శిక్షించడం నా డ్యూటీ" అన్నాడతను.

నరేష్ చేసినదంతా ఆమె వివరంగా అతడితో చెప్పింది. అతడు ఆమె భుజంమీద చెయ్యివేశాడు.

"చెల్లీ, నరేష్ గురించి యిటువంటివి కొన్ని రిపోర్టులు నాకు అందాయి. అతను నీలాగే మరికొందరు యువతుల్ని నమ్మించి, అనుభవించి వదిలేశాడు. ఈసారి అతడికి తగు విధంగా బుద్ధి చెప్తాం" అన్నాడతను.

"అన్నయ్యా, ఎవరు నువ్వు?" అడిగిందామె.

"దేశోద్ధారకుల సంఘం మెంబర్ని. నన్ను నంబర్ 25 అని పిలుస్తారు."

"అన్నయ్యా, మీరు నాకు ఎలా సహాయపడగలరు?"

"అనేక విధాల. ఒక పొరబాటు మూలంగా నీకు నెల తప్పింది. నీ కడుపును మేం తీయించేస్తాం. నీకు మరో వుద్యోగం వచ్చేటట్లు మేం చూస్తాం. నీలాటి అమాయకపు యువతుల్ని కాటేస్తున్న నరేష్ కోరలు పీకేస్తాం."

"ఇదంతా మీరు చేయగలిగితే మీ సంఘం చాలా గొప్పదయి వుండాలి" అందామె.

"అదంతా త్వరలో నువ్వే చూస్తావు" అని అతను వెళ్ళిపోయాడు.

## 7

టైము నాలుగు దాటింది. నరేష్ ఫియట్ కారును వేగంగా పోనిస్తున్నాడు.

బస్టేండులో నిలబడిన ఉషను చూసి అతడు కారు ఆపాడు. ఆమె తన పక్కింట్లో వుంటోంది. ప్రొఫెసర్ రంగారావు కూతురు. ఆమె కాలేజిలో బి.ఎ. చదువుతోంది.

తనింటి పై డాబామీదనుంచి నరేష్ పక్కింట్లోవున్న ఆమెను చూస్తూ వుండేవాడు.

"హైా!" అన్నాడతను ఆమె వంక చూస్తూ.

ఆమె కారు దగ్గరకొచ్చింది.

"కమాన్, నిన్ను దింపేస్తాను" అన్నాడతను.

"థాంక్స్" అని ఆమె ముందు సీటుమీద కూర్చుని తలుపు మూసింది.

"మీరెందాక వెళుతున్నారు?" అడిగిందామె.

"ఊగా థియేటర్ కి, అక్కడినుంచి యింటికి పోదాం."

"ఐ డోంట్ మైండ్!" అందామె.

కారును పోనిస్తూ ఓరగా అతడామెవంక చూశాడు. ఉష చలాకీ అయిన యువతి. పెద్ద కళ్ళు.

"ఉషా, నువ్వు మహా అందంగా వున్నావు!" అన్నాడతను.

"నిజంగా?"

"ఇంకా చెప్పాలంటే నిన్ను చూస్తే నాకు పిచ్చి ఎక్కుతోంది!"

"ఐయామ్ సారీ! నన్ను చూసి మీరు పిచ్చివాళ్ళవడం

నాకు నచ్చదు!" అందామె.

అతడు కారును పోనిస్తూ ఫిల్టర్ సిగరెట్ వెలిగించాడు.

"అమ్మా నాన్నా నన్ను పెళ్ళిచేసుకోమని తొందర పెడుతున్నారు!"

"చేసుకోండి" అందామె.

"సరైన పిల్ల దొరకాలిగా?"

ఆమె విచిత్రంగా నవ్వింది.

"లోకం గొడ్డుపోలేదు. చదువుకున్న అందమైన యువతులు ఎందరో వున్నారు."

"నీ అంత అందమైన యువతి నా కెక్కడా కనపడ లేదు!" అన్నాడతను.

"అయితే నన్నే పెళ్ళాడండి!" అందామె కొంటెగా.

అతడామె చెయ్యి పట్టుకున్నాడు.

"నన్ను నిజంగా పెళ్ళాడ్తావా? ఐ లవ్ యు!"

"నరేష్, చెయ్యి వదిలేయండి. పెళ్ళి ముందు నా ఒంటిమీద చెయ్యివేస్తే నాకు నచ్చదు."

"నా పేరు మీకు తెలిసే?"

"ఇరుగు పొరుగు వాళ్ళంగా, పేర్లు తెలియకుండా వుంటాయా?" అందామె.

అతడు ఈగా థియేటర్ కాంపౌండులో కారాపి దిగాడు.

"క్షణంలో వచ్చేస్తాను. టికెట్లు బుక్ చెయ్యాలి. పిక్చర్ కి నువ్వూ వస్తావా?"

"మా నాన్న ఒప్పుకోరు."

"ఇదంతా నాన్నకు తెలియాలా?"

"ఏం జరిగినా తలిదండ్రులకు చెప్పడం నాకు అల

వా డైపోయింది."

అతడు థియేటర్‌లోకి వెళ్ళాడు. ఆమె ఒంటరిగా కార్లో కూర్చుంది. ఒక అంబాసిడర్ కారొచ్చి పక్కనే ఆగింది. కారులో నలుగురు మొగాళ్ళు వున్నారు.

డ్రయివర్ సీటులో వున్నతను ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"సిస్టర్, నీలాంటి యువతి నరేష్‌లాంటి మోస గాడితో తిరగడం మంచిదికాదు. ఇప్పటికప్పుడే డజన్ మంది యువతులను నమ్మించి, అనుభవించి వదిలేసేడతను" అన్నాడతను.

ఆమె తలుపు తెర్చుకుని కిందకు దిగింది.

"మంచివాడేమో అని పొరబడ్డాను. మీరిచ్చిన అడ్వయిస్‌కి థాంక్స్. బస్సులో పోతాను" అని ఆమె వెళ్ళిపోయింది.

కాస్సేపట్లో నరేష్ ఈలవేస్తూ కారు దగ్గరకొచ్చాడు. ఆమెకోసం నలువైపులా చూశాడు.

"ఈ కారులో ఒకమ్మాయి వుండాలి. ఆమె ఎటు వెళ్ళిందో చూశారా?" నరేష్ అడిగాడు పక్క కారు లోని వాళ్ళను.

అంబాసిడర్ వెనుక తలుపు తెరవబడింది. ఇద్దరు కిందకు దిగారు. నరేష్‌ని లాక్కొచ్చి అంబాసిడర్ కారులో కూర్చోబెట్టారు.

"మీ రెవరు? మీ కేం కావాలి?" అర్చాడు నరేష్.

అంబాసిడర్ కారు బయటకు మాసుకుపోయింది.

"నన్ను వదిలేయండి!" అతడు వేడుకున్నాడు.

"షట్ యువర్ డర్టీ మౌత్!" అర్చాడు ఒకతను. నల్లటి గుడ్డను అతడి కళ్ళమీద కప్పి వాళ్ళు కట్టే

కారు. నోరు మెదపకుండా వుండేందుకు అతడి పెదిమలను సెలో టేప్ తో అతికించారు. నరేష్ భయంతో కూర్చున్నాడు.

ఆ నాటి రాత్రి పదింటికి ఫియట్ కారు నరేష్ ఇంటి గేటుముందు ఆగింది. గూర్ఖా కారువైపు వచ్చాడు.

కారులోంచి దిగినతను గూర్ఖావైపు చూశాడు.

"తప్పతాగి అతడు కారులో పడుకున్నాడు. కారును లోపలకు తీసుకుపో!" అని అతడు వెనుదిరిగి వెళ్ళి పోయాడు.

గూర్ఖా కారులోకి చూశాడు. నరేష్ వెనుక సీటు మీద పడుకుని వున్నాడు. అతడి పాంటుమీద రక్తం మరకలు వున్నాయి.

గూర్ఖా లోపలకు పరుగెత్తాడు. నరేష్ అన్న కారును లోపలకు తోలుకుపోయి ఆపాడు. నరేష్‌ని మోసుకెళ్ళి అతడి గదిలో పరుపుమీద పడుకోబెట్టారు.

ఎంత తట్టినా నరేష్ లేవలేదు. అతడు గాఢనిద్రలో వున్నాడేమో!

# 8

పోలీసు కమీషనర్ అరవిందన్ కారులోంచి దిగి విశాలమైన హాల్లోకి వెళ్ళాడు.

ఎనభై ఏళ్ళ దేవరాజు నవ్వుతూ అతడికి స్వాగతం యిచ్చాడు.

దేవరాజు చేతులు వణుకుతున్నాయి. ఏ క్షణంలోనైనా యీ లోకాన్ని విడిచి పోయేస్థితిలో వున్నాడు.

"దేవరాజుగారూ, నాకు ఎన్నో పనులున్నా మీరు రమ్మని ఫోన్ చేస్తే వెంటనే వచ్చాను" అన్నాడు అరవిందన్.

"అరవిందన్, మన పట్నంలో చాలా ఘోరాలు జరుగుతున్నాయి. యెవరో చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకుని, మనుషులను శిక్షిస్తున్నారు. ఇలా అంతా జరిగితే పోలీసులూ, కోర్టులూ ఎందుకో నాకు అర్థంకావడంలేదు" అన్నాడు దేవరాజు.

"ఏం జరిగిందో చెప్పండి!"

"రాజూ!" పిల్చాడు దేవరాజు.

పెద్దకొడుకు రాజా వెంటనే వచ్చాడు.

"అరవిందన్ గార్ని నరేష్ గదిలోకి తీసుకు వెళ్ళు అంతా చూస్తారు."

"అలాగే, నాన్నా" అన్నాడు రాజా.

పైకి రాజాతో వెళ్ళి అంతా చూసి, నరేష్‌తో మాట్లాడి పోలీసు కమీషనర్ అరవిందన్ కిందకు వచ్చాడు. దేవరాజు కెదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"అంతా చూశాను యెవరో కసితో నరేష్‌ని నపుంసకుడిగా చేసిపారేశారు. నరేష్‌కి ప్రాణాపాయంలేకుండా ఏ సర్జనో యిదంతా చేశాడని నాకు అనుమానంగావుంది. నరేష్‌తో మాట్లాడాను. అతడిని రిపోర్టివ్వమన్నాను. ఇదంతా యెవరు చేశారో నేను దర్యాప్తు చేయిస్తాను" అన్నాడు అరవింద్.

"నరేష్ స్థితి చూస్తూంటే భయమేస్తోంది. వాడికి జరిగినది యీ పట్నంలో ఏ యువకుడికేనా సంభవించవచ్చు. నరేష్‌ని నలుగురు లాక్కుపోయారు. ఒక ముఠా యిదంతా చేసుండాలి" అన్నాడు దేవరాజు.

అరవిందన్ సూటిగా దేవరాజువంక చూశాడు.

"నరేష్ ఎటువంటివాడు?"

"బుద్ధిమంతుడు. బి. ఎ. పాసయ్యాడు. మంచి సం

బంధంకోసం చూస్తున్నాను. కాని యిప్పుడు పెళ్ళిచేయ వలసిన అవుసరంలేదు" అన్నాడు దేవరాజు బాధతో.

"మంచివాడికి అంత ఘోరమైన శిక్ష యెవ్వరూ విధించరు!" అన్నాడు అరవిందన్.

"పోనీ చెడ్డవాడనుకోండి! అయినా అంత కఠిన శిక్షా? శిక్షించే హక్కు మనదేశంలో కోర్టులకు మాత్రం వుంది. దారిన పోయే దానయ్యే తనొక జడ్జినని భావిస్తూ తీర్పులు యివ్వడం మన చట్టానికే విరుద్ధం."

"అవును, నిజమే కాని ప్రజా శక్తి అనేది కూడా వుంది. ఒక కారు యాక్సిడెంట్ మూలంగా ఏ యువకుడో చనిపోయాడనుకోండి. అది చూసిన ప్రజలు ఆగ్రహంతో వెళ్ళి డ్రయివర్ని హింసించవచ్చు. అలాగే నరేష్ విషయంలో కూడా జరిగిందని నా అనుమానం. ఇదంతా చట్టానికి విరుద్ధం, అది నేను ఒప్పుకుంటాను."

"అరవింద్, మంత్రులదాకా దీని గురించి నేను వెళ్ళగలను. కాని మీతో మాట్లాడ్డం మంచిదని మిమ్మల్ని రమ్మన్నాను."

"దేవరాజుగారూ, నేను దర్యాప్తుచేయిస్తాను. ఆ ముఠాను పట్టుకుంటాం" అన్నాడు అరవిందన్.

"థాంక్స్, ఏదో తొందరగా చేయండి. ప్రస్తుతం నా కంపెనీలను నా కొడుకులే నడుపుతున్నారు. నేను విశ్రాంతి తీసుకుంటూ యింట్లో కూర్చుంటున్నాను. ఏదేనా తెలిస్తే ఫోన్ చేసి చెప్పండి."

పోలీసు కమీషనర్ అరవిందన్ సెలవు తీసుకుని బయటకు వెళ్ళి కార్లో కూర్చున్నాడు. వెంటనే కారు కదిలింది.

తండ్రి చేయిపట్టుకుని రాజా మెల్లిగా అతడిని పడ గ్గదిలోకి తీసుకు వెళ్ళి పరుపుమీద పడుకోబెట్టాడు.

## 9

నరేష్ తల్లివైపు దీనంగా చూశాడు.

"అమ్మా, ఆ మంగమ్మ ఏమైంది?"

"జీతం యిచ్చి పొమ్మన్నాను. ఏమైందో నాకు తెలియదు."

అతడు తల్లి చెయ్యి పట్టుకున్నాడు.

"ఒకసారి ఆమెను యిక్కడకు రప్పించు!"

"ఎందుకు?"

"నేను నీతో అబద్ధాలు ఎన్నో చెప్పానమ్మా. మంగమ్మ మంచిది. ఆమెను నేను మోసంచేశాను. ఒక్క సారి ఆమెతో మాట్లాడాలి. నన్ను క్షమించమనాలి."

"పనిమనిషి నిన్ను క్షమించడమేమిటిరా! దానిని ఏదో నువ్వు చేసివుండొచ్చు. కావలసిన డబ్బు యిచ్చేస్తే అది చాలు."

"నేను డబ్బిస్తే ఆమె తీసుకోలేదు. డబ్బుకోసం ఆమె నా దగ్గరకు రాలేదు."

"ఆమె రంభా ఊర్వసా నిన్ను ప్రేమించడానికి?" ప్రశ్నించిందామె.

"ఆమె ఎవరైనా నేను పురుషుడిని కానుగా ఇప్పటి వితిలో!" అన్నాడతను దీనంగా.

ఆమె మౌనంగా అతడివైపు చూస్తూ వుండిపోయింది.

"నరేష్, మంగమ్మ ఎక్కడుందో కనుక్కొని రమ్మంటాను" అందామె.

ఆ రోజే ఆమె గూర్ఖాతో మాట్లాడింది. అప్పుడప్పుడు మంగమ్మ రోడ్డమ్మట వెళ్తూంటే చూశానని గూర్ఖా

అన్నాడు.

"ఈసారి ఆమె కనిపిస్తే లోపలకు రమ్మను" అందామె.

గూర్ఖా తలాడించి వెళ్ళిపోయాడు.

మూడు రోజుల తర్వాత ఆమె గూర్ఖాకు కనిపించింది. అతడామెను పిల్చాడు. లోపలకు వెళ్ళి అమ్మను చూడమన్నాడు.

"ఎందుకు?" అందామె.

"నాకు తెలియదు" అన్నాడతను.

మంగమ్మ లోపలకు వెళ్ళింది. నరేష్ తల్లి నవ్వుతూ ఆమెను ఆహ్వానించింది.

"ఎందుకమ్మా?"

"మేడమీద కెళ్ళి ఒకసారి నరేష్‌ని చూసిరా. నీకోసం వాడు అడుగుతున్నాడు."

"ఆశ్చర్యంగా వుందమ్మా!"

మంగమ్మ మెల్లిగా మెట్లెక్కి పైకి వెళ్ళింది. నరేష్ గదిలోకి ప్రవేశించింది.

పరుపుమీద పడుకున్న నరేష్ ఆమెవైపు చూసి తటాలున లేచాడు. ఆమెను కౌగలించుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

"మంగీ, నన్ను క్షమించు. నేను నీకు ద్రోహం చేశాను. నిన్ను మోసం చేశాను. దేవుడు నన్ను శిక్షించాడు" అన్నాడతను.

ఆమె నిశ్శబ్దంగా వుండిపోయింది. అతడికి వాళ్ళిచ్చిన శిక్ష గురించి ఆమె వింది. నంబర్ 25 ఆమెకు చెప్పాడు. ఆమె లోలోపల బాధపడింది.

"ఇలా చేస్తేగాని ఆ దుష్టుడి జీవితంలో మార్పు

రాదు!" అన్నాడు నంబరు 28.

నరేష్ పక్కనే ఆమె పరుపుమీద కూర్చుంది. అత డామె కళ్ళలోకి చూశాడు.

"నా బిడ్డ ఏమైంది?" అడిగాడతను.

"మీ బిడ్డ మీకు కావాలా?"

"నీలో పెరిగే బిడ్డే నాకు యీ జీవితంలో మిగిలినది" అన్నాడతను ఆవేశంతో.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"బిడ్డను కని మీకిస్తాను" అందామె.

అతడామెవైపు చూశాడు. ఆమె చెయ్యి పట్టుకుని మెల్లిగా నిమిరాడు.

"మంగీ, ఆ పాపతో ఆడుకుంటూ నేనీ జీవితాన్ని సాగించవచ్చు. నా బిడ్డకు తల్లిగా నీ రూపం నా హృదయంలో శాశ్వతంగా నిల్చిపోతుంది."

కన్నీళ్ళతో ఆమె అతడివంక చూసింది.

"మీ జీవితం యింతగా మారుతుందని నేను ఊహించలేకపోయాను" అందామె.

అతడి తల్లి గదిలోకి వచ్చింది. ఆమెను చూసి మంగమ్మ లేచి నిలబడింది.

"అమ్మా నాలో నీతీ నిజాయితీ వుంటే మంగమ్మ నీ కోడలు అయివుండేది. కాని ఇప్పుడు నన్ను పెళ్ళాడమని ఆమెను నేను అడగలేదు. నన్ను పెళ్ళాడితే ఆమె జీవితం యెడారిలోని వెన్నెల్లా వ్యర్థమావుతుంది."

"అలా అనకండి. మిమ్మల్ని పెళ్ళాడ్డానికి నేను అప్పుడూ, యిప్పుడూ సిద్ధమే!" అంది మంగమ్మ.

అతడు పరిహాసంగా నవ్వాడు.

"మంగీ, నాకేం జరిగిందో నీకు పూర్తిగా తెలియదను

కుంటాను."

"ఏం జరిగిందో తెలుసు. జీవితంలో ముఖ్యమైనది దాంపత్య సుఖం ఒక్కటే కాదు. నేను మీతో వుంటాను. మనిద్దరం ప్రజలకు సేవ చేస్తూ ఆనందించవచ్చు."

నరేష్ ఆమె చెయ్యి పట్టుకుని దగ్గరగా లాగాడు.

"అమ్మా, ఆమె చెప్పింది విన్నావా?"

"విన్నానురా" అంది తల్లి.

"అమ్మా, నాన్నతో మాట్లాడి మా పెళ్ళికి ముహూర్తం పెట్టించమ్మా" అన్నాడతను.

"పెట్టిస్తానురా" అని తల్లి కిందకు వెళ్ళిపోయింది.

## 10

మంగమ్మ, నరేష్‌ల పెళ్ళి వైభవంగా సాగిపోయింది. ఆమె కలలు కన్నట్లే మంగమ్మ ధనవంతుల యింటి కోడలు అయింది.

ఆ రోజు రాత్రి దేవరాజు ఆరోగ్యం బాగాలేదు. అతడు భార్యను పిల్చాడు.

"ఒకసారి నరేష్‌ను నా గదికి రమ్మను."

"ఈ స్థితిలో ఏమి మాట్లాడగలరు?" అందామె.

"మళ్ళా మాట్లాడే అవకాశం గాక వుండక పోవచ్చు."

ఆమె పైకి వెళ్ళింది. నరేష్ పక్కనున్న మంగమ్మకు ఏదో కథ చెప్తున్నాడు. గదిలో లైటు వెల్గుతోంది.

"నరేష్, నాన్నగారు నిన్ను పిలుస్తున్నారు!" అందామె.

"ఆయనకెలా వుంది?"

"అంత బాగాలేదు. వెళ్ళి చూడు!"

నరేష్ వేగంగా కిందకు వెళ్ళాడు. తండ్రి గదిలోకి

అడుగు పెట్టాడు.

"తలుపు మూసిరా" అన్నాడు దేవరాజు.

తలుపుమూసి అతడు తండ్రి దగ్గరగా వెళ్లాడు.

దేవరాజు కొడుకు చెయ్యి పట్టుకున్నాడు. అతడి కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి.

"నాన్నగారూ, మీ ఆరోగ్యం బాగుపడ్తుంది. మీరు గాభరా పడకండి" అన్నాడు నరేష్.

"నరేష్, నేను బాధపడ్తున్నది చస్తానేమో అనే భయం మూలంగా కాదు. నేనొక పెద్ద పాపంచేశాను."

"అదేమిటో చెప్పండి! చేసిన పాపాన్ని గురించి చెప్పుకోడం ఒకవిధంగా ప్రాయశ్చిత్తం అవుతుంది" అన్నాడతను.

'నరేష్, నేనొక సీక్రెట్ సంస్థకు బాస్ని. ఎక్కడ అన్యాయం జరిగినా మా మనుషులు రంగంలోకి దిగుతారు. నరేష్, అనేకమంది యువతుల్ని నువ్వు మోసగించావు. మంగమ్మ నన్ను కల్సుకుని తనకు జరిగినదంతా చెప్పింది. నువ్వు నా కొడుకువని నాకు తెలుసు. అయినా నిన్ను ఘోరంగా శిక్షించమని నేనే ఆదేశించాను. పరాయివాడికిచ్చే శిక్ష నా కొడుకైనా నీకు కూడా యివ్వడం ధర్మమనిపించింది. నీ జీవితాన్ని నాశనం చేయించింది నేనే, నరేష్!" అన్నాడు దేవరాజు.

నరేష్ తండ్రివైపు చూసి కళ్ళు తుడుచుకున్నాడు.

"నాన్నా, మీరు చాలా గొప్పవారని రుజువుచేసుకున్నారు. చాలామంది తనవాళ్ళ దగ్గరకు వచ్చేసరికి పక్షపాతానికి బలైపోతారు. మిమ్మల్ని నేను మెచ్చుకుంటున్నాను" అన్నాడతను.

"నరేష్, నేను చేయించినదానికి నన్ను క్షమించు!"

"నాన్నా, పోయిందానికి నేను విచారించడంలేదు. ఇప్పుడు నా జీవితం మారిపోయింది. సరైన బాటమ్మట వెళ్ళగల్గుతున్నాను."

"నరేష్, రేపు రాత్రి పదింటికి దేశోద్ధారకుల సంఘం సమావేశం వుంది. నేను ఆ సమావేశానికి వెళ్ళలేను. ఇటుపైన ఆ సంస్థకు బాస్ నువ్వే. నువ్వా సంస్థను నడిపి లోకానికి మేలుచేస్తే నేను సంతోషిస్తాను" అన్నాడు దేవరాజు.

"అలాగే చేస్తాను, నాన్నా" అన్నాడు నరేష్.

"అలా కూర్చో కాస్సేపు!" అని దేవరాజు కొంత సేపు మౌనంగా వుండిపోయాడు.

"నాన్నా!" పిల్చాడు నరేష్.

అతడు కళ్ళుతెర్చి కొడుకువైపు చూశాడు. జేబులోంచి ఒక తాళంచెవుల గుత్తినితీసి అతడికిచ్చాడు.

"ఈ గది కింద ఒక ఏర్ కండిషండ్ సీక్రెట్ రూమ్ వుంది. దేశోద్ధారకుల సంఘం గురించి అన్ని వివరాలూ ఆ గదిలోకెళ్తే నీకు తెలుస్తాయి. అక్కడకు వెళ్ళిరా!" అన్నాడు దేవరాజు.

నరేష్ లేచి గది నలువైపులా చూశాడు. కింద గదికి తోవ ఎక్కడుంది?

నేలమీదున్న మూడు మొసాయిక్ రాళ్ళను పైకి ఎత్తాడు. కిందకు మెట్లు వున్నాయి. అక్కడున్న స్విచ్ నొక్కగానే లైట్ వెలిగింది.

మెట్లమ్మట అతడు కిందకు దిగాడు.

తన చేతిలో వున్న ఒక తాళంచెవితో తలుపు తెర్చాడు. లోపలకు వెళ్ళి స్విచ్‌లు నొక్కాడు. లైట్లు వెల్గాయి. ఏర్ కండిషనర్ శబ్దం వినబడింది.

విశాలమైన గది. అక్కడ అరగంటపాటు కూర్చుని, అంతా తెల్సుకుని నరేష్ పైకి వచ్చాడు. మొసాయిక్ రాళ్ళను మునపటిలా పెట్టేశాడు.

తండ్రి దగ్గరకు వెళ్ళి "నాన్నా!" అన్నాడు.

కాని దేవరాజు లేవలేదు. అతడు శాశ్వత నిద్రలోకి జారిపోయాడు.

తండ్రి శరీరాన్ని ముట్టుకు చూసి నరేష్ బయటకు పరుగెత్తాడు.

"అమ్మా! మంగీ!" ఏడుస్తూ అర్చాడతను.

"ఏమిటిరా?" అడిగింది తల్లి.

"నాన్న మనల్ని విడిచి వెళ్ళిపోయారు" అని అతడు గదిలోకెళ్ళి మంచం పక్కనే కూర్చుండిపోయాడు.

మంగమ్మ వచ్చి అతడి చెయ్యి పట్టుకుని పక్కనే కూర్చుంది. ఆమెవైపు చూశాడతను.

ఇటుపైన ఆమె తన పక్కనుంటుంది. ఇద్దరూ కలిసి మంచిని పెంచుతూ తృప్తికరంగా జీవితాన్ని సాగించాలి. తండ్రి కోరినట్లు లోకానికి మేలు చేయాలి!

—: అ యి పో యి ం ది: —

# పులి వేట

## బి. రాజేశ్వరి

"అదిగో దొరా, పులి వస్తున్న జాడ పొసగట్టింది" అన్నాడు కోయి సింగన్న.

మేజర్ చంద్రకాంత్ తక్కిన యిద్దరివైపు హెచ్చరిస్తున్నట్టు చూశాడు. రామరాజు, మాధవరావు అతని సంకేతాన్ని అర్థం చేసుకున్నారు.

దూరంగా పులి గాండ్రింపు వినిపించింది. సింగన్న అనుభవాన్ని అందరూ మనసులోనే మెచ్చుకున్నారు.

చంద్రకాంత్ దగ్గర డబుల్ బేరల్ రైఫిలుంది. కోటు జేబులనిండా బుల్లెట్సున్నాయి. రామరాజు దగ్గర రివాల్వరుంది. మాధవరావు దగ్గర ఆయుధాలేమీ లేవు గాని, అతను చెట్టుమీద సురక్షితంగా కూచుని ఆసక్తిగా జరగబోయే టైగర్ హంటింగ్ తిలకించటానికి సిద్ధంగా వున్నాడు.

సింగన్న చేతిలో విల్లమ్ములున్నాయి. చెట్టుకు ఆనించి బరిసె వుంది. అతని గురి ఏకలవ్యుడి గురిలాంటిది! శబ్దభేరి

విద్య తెలిసినవాడిలా చెవులు రిక్కించి పులి అడుగుల సవ్వడి వినటానికి ప్రయత్నిస్తున్నాడు.

మేజర్ చంద్రకాంత్ చెట్టు వెనకనుంచి ఆసక్తిగా తొంగిచూస్తున్నాడు. రైఫిల్ చేతిలో సిద్ధంగా పట్టుకుని వున్నాడు. అతని మిలిటరీ నైపుణ్యం చెక్కుచెదరనిది! ఏ క్షణంలోనైనా, నిద్రలో లేపి గన్ చేతికిచ్చినా టార్గెట్‌ను గురిచూసి కాల్చగల నేర్పరి!

రామరాజుకి హంటింగ్ కొత్త. అయినా రివాల్వర్ షూటింగ్ బాగా తెలిసినవాడు. చేస్తున్నది లెక్చరర్ వుద్యోగమయినా, హంటింగ్ పట్ల శ్రద్ధాశక్తులున్నవాడు! రెండుమూడుసార్లు అడవికి వేటకు వెళ్ళిన అనుభవం గడించాడు. ఓసారి చిరుతపులిని వేటాడాడు. మరోసారి కాస్తలో పెద్దపులిని వేటాడబోయి మిస్సయ్యాడు.

అసలు అనుభవం లేనిది మాధవరావు ఒక్కడికే. అతను డాక్టరు. అందునా పిల్లల వ్యాధుల స్పెషలిస్టు! అతని వృత్తికి తగినట్టే ఆయనది చిన్నపిల్లల మనస్తత్వం. తన కేసులేమిటో తనేమిటో తప్ప బయటి ప్రపంచంతో ఎక్కువ సంబంధం పెట్టుకున్న వ్యక్తి కాదు! కాకపోతే వేటవంటి సాహసకృత్యాలపట్ల, జంతువులపట్ల మంచి అభిరుచి వున్నవాడు. వన్యమృగ వారోత్సవాల్లో సరదాగా పాల్గొనే అలవాటున్నవాడు. అందుకే చిన్ననాటి స్నేహితుడు మేజర్ చంద్రకాంత్ రమ్మని పిలవగానే ఉత్సాహంగా అడవికి బయల్దేరాడు!

పులి గాండ్రింపు బాగా దగ్గర్లో వినిపించింది. సింగన్న అప్పటికే మాటు తయారుచేసి వుంచాడు. గొయ్యితీసి దానిమీద ఆకులు మట్టితో బోలుగా కప్పిపెట్టాడు. పులి కాదు, ఏనుగయినా వచ్చి గోతిలో పడి చిక్కాల్సిందే!

"సింగన్నా, నువ్వు అవసరమైతే తప్ప బాణం వెయ్యకు! దీన్ని నేనే స్వయంగా వేటాడతాను" అన్నాడు మేజర్.

"అలాగే దొరా! పులి బాగా పోతరించి వుంటుందని నా అంచనా! గాండ్రింపును బట్టి, అది పరిగెడుతున్న సవ్వడిని బట్టి అదెలాంటి పులో చెప్పెయ్యగలను. చాలా జాగ్రత్తగా వేటాడాలి దొరా!" అన్నాడు సింగన్న.

సింగన్న అడవిలో పుట్టి పెరిగినవాడు. అయితే ఎక్కువగా దొరలతో తిరిగినవాడు. చదువుకున్న వాళ్ళ మధ్య మసలినవాడు, తన కోయ యాస మరీ అంత ఎక్కువ లేకుండా స్వచ్ఛంగా మాట్లాడటం చూసి మాధవరావు, రామరాజు ఆశ్చర్యపోయారు.

పులి కనిపించింది. బాగా బలంగా ఎత్తుగా వుంది. మంచి వయసులో వుంది. చాలా తీక్షణమైన చూపు. గజానికో అంగ చొప్పున వేస్తోంది. నడుస్తూంటే పరుగెడుతున్నంత వేగం కనిపిస్తోంది దాని గమనంలో.

మేజర్ రైఫిల్ గురిచూసి పట్టుకున్నాడు. చటుక్కున షూట్ చేశాడు!

కాని మొదటిసారిగా అతని గురి తప్పింది.

గుండు పులికి వెంట్రుకవాసిలో తప్పిపోయింది.

పులి రాబోయే ప్రమాదాన్ని గుర్తించినట్టు పెద్దగా గర్జించింది. ముందుకు ఉరకబోయింది. ఇంతలో గాల్లో సుయ్యిన దూసుకుంటూ సింగన్న బాణం వచ్చి తాకబోయింది.

కాని ఎవరూ ఊహించనిరీతిలో పులి పక్కకు దూకింది. సరిగ్గా అదే సమయంలో రామరాజు రివాల్వర్ గర్జించింది. గుండు పులికాలికి తగిలింది.

అప్పుడు అరిచిన పులి గర్జింపుకి అడివంతా ఒణికి

నట్టనిపించింది. క్షణంలో పొదల మధ్యకి దూకి ఎటో మాయమయింది.

ఈలోపల మేజర్ మరోసారి కాల్చాడు. కాని అప్పటికే పులి టార్గెట్‌నుంచి చిత్రంగా తప్పించుకుని పారిపోయింది.

చంద్రకాంత్, రామరాజువంక కోపంగా చూశాడు.

"అనవసరంగా కల్పించుకుని పులిని బెదరగొట్టేశావు. దాన్ని హతమార్చినా సంతోషించి వుండేవాడ్ని!" అంటూ చిరాకుపడ్డాడు.

"పులి పక్కకు పరుగెడుతుందని ఎలా ఊహించ గలం? అది ముందుకు ఉరకబోయి క్షణంలో తన గమనాన్ని దిశ మార్చుకుంది. అలాంటి పరిస్థితుల్లో టార్గెట్ మిస్సవకుండా ఎలా వుంటుంది?" అన్నాడు రామరాజు. అతని కంఠంలో కూడా రవంత కోపం తొణికిస లాడింది.

"మీ లో మీ రు వాదులాడుకోమాకండి దొర్లూ! ఎప్పుడూ తప్పని నా బాణం గురితప్పిపోయింది. నా అనుభవంలో యింత తెలివైన పెద్దపులిని నే జూడలేదు. నా గురి సాదారణంగా తప్పదు. అలాంటిది తప్పింది! ఊరుకోండి. బంగలాకి పోదాం, పట్టండి!" అన్నాడు సింగన్న సమాధానపరిచే ధోరణిలో.

మాధవరావు చెట్టు దిగి వచ్చాడు.

"ఇందులో యెవరి పొరపాటూ లేదు. పైనుంచి చూస్తూన్న నేనే అదిరిపోయాను పులినిచూసి. అదీగాక ముగ్గురి గురి తప్పిందంటే అది మీలో ఒక్కరి లోపమూ కాదు. ప్రయత్న లోపం అసలేకాదు! పులి చాలా

చురుగ్గా ప్రమాదాన్ని గుర్తించి తప్పించుకుంది! ముందు
కొచ్చివుంటే కనీసం మాటులోపడి చిక్కివుండేది! అది
కూడా తనకు ముందే తెలిసినట్లు చాలా ఏక్టివ్‌గా
తప్పించుకు పారిపోయింది" అన్నాడు.

మేజర్ చంద్రకాంత్ ఇంకా గుర్రుగానే వున్నాడు.
పదిహేనేళ్ళ తన మిలిటరీ సర్వీసులో పరాజయం
పొందని తను, అఫ్టరాల్ ఓ పులిని వేటాడలేకపోయానే
అన్న పరాభవ చిహ్నాలు అతని ముఖంనించి యింకా
పూర్తిగా తొలగిపోలేదు!

రామరాజుకూడా ఫ్రీగా మూవ్ కాలేక పోతున్నాడు.
చంద్రకాంత్ బొత్తిగా చిన్న పిల్లాడికింద తనని జమకట్టి
మాట్లాడటం అతని అంతరాంతరాల్లో అలజడిని సృష్టిం
చింది. సాధ్యమైనంతవరకు తననితాను నిగ్రహించుకోవ
టానికి ప్రయత్నిస్తున్నాడు.

మాధవరావు అతని భుజంమీద స్నేహపూర్వకంగా
తట్టి "యీ రాత్రికి రెస్టుతీసుకుందాం రాజా! పదండి,
ఫారెస్టు బంగళాకి పోదాం!" అన్నాడు.

ముందు సింగన్న దారితీయగా అతని వెనుక చంద్ర
కాంత్, మాధవరావు, రామరాజు అనుసరించారు.

బంగళాకి వెళ్ళే సరికి రాత్రి పదిగంటలు దాటింది.
వాచ్‌మాన్ కిరోసిన్ హరికేన్ లాంతరు వెలిగించాడు.
బాగా మారుమూల ఏజెన్సీ ప్రాంతం! ఇంకా ఎలక్ట్రిఫి
కేషన్ కాలేదు.

బంగళా కుక్ వంట పూర్తిచేసి వాళ్ళకోసమే ఎదురు
చూస్తున్నాడు. పదార్థాలు చాలా రుచికరంగా చేశాడు.
కాని రామరాజు, చంద్రకాంత్ వాటి రుచిని ఆస్వా
దించే స్థితిలో లేరు! ఇద్దరిలోను పరాభవాగ్ని రగులు

తోంది!

మాధవరావు మాత్రం సంకోచించకుండా తృప్తిగా తిన్నాడు. పోషకాహారానికి ఆరోగ్యానికి వున్న అవినాభావ సంబంధం గురించి మరొకప్పుడైతే డాక్టరుగా చక్కటి సుదీర్ఘోపన్యాసం యిచ్చివుండేవాడే! కాని మిత్రులిద్దరి మూడ్ సరిగాలేనందున అతనుకూడా మౌనం వహించి మెదలకుండా భోంచేసి లేచాడు.

"నేపోయివస్తూనా దొరా!" అన్నాడు సింగన్న వాళ్ళ భోజనాలు పూర్తయ్యాక, చంద్రకాంత్ నుద్దేశించి. చంద్రకాంత్‌తో అతనికి చాలా ఏళ్ళ పరిచయం. ఓ విధంగా స్నేహము, చనువు వున్నాయని చెప్పొచ్చు!

మేజర్ మౌనంగా తలూపాడు.

"రేపు ఆ పులిని ఎలా వేటాడాలో నేను బాగా ఆలోచనచేసి వుంచుతా దొరా! ఆయిగా పడుకోండి!" అన్నాడు సింగన్న.

## 2

ఉదయం నిద్రలేస్తూనే, "హలో యంగ్ మాన్, ఏమిటీ యింకా నిద్రనుంచి లేవలేదేమిటీ?" అంటూ మేజర్ చంద్రకాంత్ రామరాజు కప్పుకున్న దుప్పటీ లాగిపారేశాడు.

రామరాజు మెలకువగానే వున్నాడు. తెల్లారేసరికి అతనిలో కూడా గత రాత్రి చిరు సంఘటన తాలూకు బాధ మరుగున పడిపోవచ్చింది. నిన్న మేజర్ వుండిన పరిస్థితిలో అలా చిరాకుపడటం సహజమే! స్నేహంలో అవన్నీ పట్టించుకుంటే ఎలా?—అని తనను తాను సమాధాన పరచుకున్నాడు.

చంద్రకాంత్ ముఖం స్వచ్ఛంగా వుంది! చిరునవ్వుతో

రామరాజుని చూసి "గుడ్ మార్నింగ్!" అన్నాడు.

రామరాజు తనూ నవ్వి "గుడ్ మార్నింగ్ మేజర్!" అన్నాడు.

మాధవరావు అప్పటికే తన పనులన్నీ పూర్తిచేసుకుని వేడిగా తేనీరు సేవిస్తున్నాడు. వాళ్ళిద్దర్నీ చూసి నవ్వుతూ పలకరించాడు.

"ఈ రోజు నేను చూడవలసిన కొన్ని అర్జంటు కేసు లున్నాయి నన్నొదిలెయ్ చంద్రా!" అన్నాడు మేజర్‌తో.

"రేయ్ మధూ, తీసుకొచ్చింది నేను! నేను పొమ్మనే వరకు పోవటానికి వీల్లేదు. ఇది నా సామ్రాజ్యం! ఈ అడవితో నాకు పదేళ్ళ సాన్నిహిత్య సంబంధాలున్నాయి. నేను కూచోమంటే కూచోవాలి, నించోమంటే నించోవాలి, తెల్సిందా!" అన్నాడు చంద్రకాంత్ చనువుగా మాధవరావు షర్టు ఫెల్టు పట్టుకుని.

మేజర్ చంద్రకాంత్ చేయెత్తు మనిషి. పదేళ్ళక్రితం మేజర్ పదవినుంచి విరమించుకుని మిలిటరీనుంచి వచ్చేశాడు. సన్నటి కోరమీసం, అతని వయసులో పదేళ్ళు తక్కువ చూపిస్తుంది. దాదాపు ఏభై ఏళ్ళ వయసు మీదపడ్డా నలభైలోపే అన్నట్టుంటాడు. కండలుతిరిగిన శరీరం!

సింగన్న రాకతో మళ్ళా వాతావరణంలో కొత్త ఉత్సాహం వచ్చింది.

"రేత్రికి సిద్ధంగా వుండండి దొర్లూ! ఈ ఏళ ఏమైనా గాని పులిని కొట్టి తీరాలి!" అన్నాడు సింగన్న.

"లేకుంటే అంత తేలిగ్గా వదుల్తామనుకున్నావా సింగా! ఈ రోజు దాని అంతు చూడాలి" అన్నాడు

చంద్రకాంత్.

"రాజూ, ఛాన్స్ నువు తీసుకుంటావా? నన్ను తీసుకో మంటావా?" అన్నాడు రామరాజువంక చూసి. తనకన్న బాగా చిన్నవాడుకావటంవల్ల ఏకవచనంతోనే అతన్ని సంబోధిస్తాడు మేజర్.

"మీరే తీసుకోండి! ఏ కారణంచేతనైనా అది తప్పించుకు పారిపోతే నేను కలగజేసుకుంటాను. అంత వరకు నేను జస్టు అబ్జర్వర్‌ని!" అన్నాడు రామరాజు చిన్నగా నవ్వుతూ!

"కాని నేనైతే వదల్ను దొరోయ్! ఈ ఏళ నా వింటి పస ఆ జెంతువుకి రుచి చూపిస్త!" అన్నాడు సింగన్న.

# 3

రాత్రి ఎనిమిదిగంటల సమయం.

అప్పటికే పులి తిరిగే స్పాట్‌కి చేరుకున్నారు నలుగురు.

మాధవరావు మామూలుగా చెట్టెక్కాడు. రామరాజు నిన్నటి స్థలంలోనే చెట్టు చాటుగా పొదలమధ్య కూచుని వున్నాడు. రివాల్వర్ సిద్ధంగా చేతిలో వుంచుకున్నాడు. ఆ రివాల్వర్ కూడా మేజర్‌దే! ఆయనకు గన్‌తో అలవాటెక్కువ! గురి బావుంటుందని ఎప్పుడూ గన్‌తోనే హంటింగ్ చేస్తుంటాడు.

మేజర్ చంద్రకాంత్ మాధవరావుకి కొంచెం దూరంలో మరో పొదమాటున నక్కి కూచున్నాడు. మాధవరావు రెండు టార్చిలైట్లు చెరో చేత్తో పట్టుకుని వెలుతురుకోసం మధ్యమధ్య ఫోకస్ చేసి, ఆర్పుతున్నాడు.

సింగన్న విల్లు భుజానికి తగిలించుకుని పిల్లిలా అడుగులు

వేస్తూ నాలుగుపక్కలా వేటకుక్కలా కాచుకుంటూ చెవులు రిక్కించి వింటున్నాడు.

"నిన్నటి ఏళయింది దొరా! జాగర్త. ఏ చెనంలోనైనా రావచ్చు!" అన్నాడు సింగన్న హెచ్చరికగా.

అందరూ పులిరాకకోసం వెయ్యి కళ్ళతో యెదురు చూస్తున్నారు.

సింగన్నకి బాగా నమ్మకం—దెబ్బతిన్న పులి ఖచ్చితంగా వచ్చి తీర్తుందని!

రామరాజుకైతే ఏ మాత్రం నమ్మకంలేదు — పులి వస్తుందని. ఒకసారి దెబ్బతిన్నాక మళ్ళీ వస్తుందా! మాధవరావు చాలా లోతుమనిషి. తన అభిప్రాయాన్ని అంత తొందరగా బయటపెట్టడు.

ఎండుటాకులు గలగల శబ్దమయ్యాయి.

సింగన్న ఎలర్టుగా చూశాడటువైపు.

మేజర్ చేతులు గన్ మీద బిగుసుకున్నాయి.

రామరాజు రివాల్వర్ గురిచూసి పట్టుకున్నాడు.

మాధవరావు ఊపిరి బిగించి చూస్తున్నాడు.

చెవులపిల్లులు రెండు ఒకదాన్ని తరుముకుంటూ మరొకటి చెలగాటాలాడుతూ కేరింతలు కొడుతూ వచ్చాయి.

అందరు రిలాక్సయ్యారు.

మళ్ళీ అంతలోనే ఆకులమీద జరజరమని చప్పుడు!

మళ్ళీ అందరి దృష్టి అటు తిరిగింది. మాధవరావు చేతిలోని టార్చిల్లో ఒకటి వెలిగి ఆరింది. ఆ వెల్తుర్లో పొడవాటి గోధుమ తాచు జరజరమని పాకుతూ వెళ్ళటం కళ్ళపడింది!

అందరి గుండెలు జల్లుమన్నాయి!

పాము వెళ్తున్న దిశ సరాసరి మేజర్ పాదవైపు!

మేజర్ అది గమనించటంలేదు!

రామరాజు మేజర్‌కి రాబోయే ప్రమాదాన్ని క్షణాల మీద గుర్తించాడు.

రివాల్వర్ గురిచూసి నేలబారుగా కాల్చాడు.

పాము గిజగిజ కొట్టుకుంది. మేజర్ చంద్రకాంత్ అదిరిపడి చూశాడు. సింగన్న పరుగున మేజర్ వున్న పాద దగ్గరికి వెళ్ళాడు. మాధవరావు చేతుల్లోని టార్చ్‌లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. తిన్నగా ఆ దృశ్యం మీదే స్పష్టమైన వెలుగు!

పాము కొట్టుకోవటం ఆగిపోయింది.

సింగన్న బాణం కొనతో దాన్ని వెల్లకిలా తిప్పాడు. కృష్ణ పాదాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి!

"చాలా అదురుష్టం మేజర్‌బాబూ! ఆ సినబాబు చాలా కరెక్టుగా గురిచూసి కొట్టిండు. లేకుంటే ఇది నిన్ను కాటందుకునుందేది!" అన్నాడు సింగన్న.

"థాంక్యూ మై బోయ్! థాంక్యూ వెరీమచ్!" అన్నాడు చంద్రకాంత్, రామరాజువంక కృతజ్ఞతగా చూసి.

"దట్సాల్‌రైట్! మమ్మల్ని ఎలర్టుగా వుండమని మీరు పరధ్యానంగా వున్నట్టుందే!" అన్నాడు రామరాజు ఛలోక్తిగా.

"మావాడికి యింటి దగ్గర భార్యామణి గుర్తొచ్చి వుంటుంది రాజా!" అన్నాడు మాధవరావు చిన్నగా నవ్వుతూ.

సింగన్న చటుక్కున "ఉష్!" అంటూ మాట్లాడ వద్దని వారించాడు.

అందరు చటుక్కున మాటలు ఆపేశారు,

సింగన్న చెవులు రిక్కించి విన్నాడు.

రామరాజు తను యిదివరకు కూచున్న పొద దగ్గరికి పోయి చాటుగా కూచున్నాడు.

మాధవరావు టార్చి ఆపేశాడు.

అంతటా చీకటి. నక్షత్రాల వెలుగు చెట్ల ఆకులమధ్య నుంచి గుడ్డి వెలుగును ప్రసారం చేస్తోంది.

“దొరా, జాగ్రత్త పులి వొచ్చేస్తోంది!” అన్నాడు సింగన్న స్పష్టంగా.

ఎక్కడా పులి గాండ్రింపు వినబడటంలేదు.

అయిదు నిమిషాలు గడిచినా పులి వస్తున్న జాడ కనిపించలేదు.

కాని, సింగన్న చెప్పినమాట వ్యర్థంకాదు! అది అతని వయసుతోపాటు పెరుగుతున్న అనుభవం!

దగ్గర్లో ఎండుటాకుల గలగల చాలా స్పష్టంగా వినిపించింది. ఏదో జంతువు నడుస్తున్న శబ్దం నెమ్మదిగానే అయిన స్పష్టంగా చెవులకు తాకుతోంది.

ఒక్కసారిగా వాతావరణంలో అనుకోని నిశ్శబ్దం.

“దొరా, జాగ్రత్త! పులి వచ్చేసింది” గుసగుసగా సింగన్న మాటలు వినిపించాయి.

పదినిమిషాలసేపు అందరూ ఊపిరి బిగపట్టారు. ఎలాంటి అలికిడి వినిపించలేదు. అంతలో చప్పుడు చెయ్యకుండా అమాంతం రామరాజున్న పొదమీదికి ఉరికేసింది పులి! గుర్రుమన్న చప్పుడు అప్పుడు వినిపించింది అందరికీ!

ఆ అదురుకు రామరాజు చేతిలోని రివాల్వరు ఎగిరి అవతల పడింది.

సింగన్న మేజర్ని చూసి అరిచాడు, “కాల్చు

దొరా!" అన్నాడు. తను బాణం సంధించాడు.

మేజర్ తుపాకి గర్జించింది.

పులి పెడబొబ్బ పెట్టింది. కాని పారిపోలేదు. నేల వాలలేదు. మరోసారి మేజర్ తుపాకి పేలింది. కానీ అదికూడా పులిని గాయపరచలేదు.

సింగన్న అమాంతం రామరాజు మీద పడబోతున్న పులిమీదకి లంఘించాడు. క్షణంలో రామరాజుకి ప్రాణ గండం తప్పింది.

అయితే పులి తనమీదపడిన సింగన్న ముఖంమీద బలంగా పంజాతో కొట్టి గాయపర్చింది.

రామరాజు రివాల్వర్ అందుకున్నాడు. మేజర్ తుపాకి మరోసారి గర్జించింది.

అయితే చిత్రంగా పులి అంతర్థానమయిపోయింది. ఎండుటాకులమీద దూరంగా చప్పుడయింది.

## 4

మేజర్ చంద్రకాంత్, రామరాజు ఒక్క పరుగున సింగన్న దగ్గరకు చేరుకున్నారు. అతని ముఖం రక్తసిక్త మయిపోయి, ధారలు కట్టింది నెత్తురు!

మాధవరావు అతని నాడిపట్టి చూసి, "ఫరవాలేదు, త్వరగా ఇతన్ని బంగళాకి తీసుకుపోదాం, పట్టండి! బంగళాలో నా మెడికల్ కిట్ వుంది! గాయం బలంగా నే తగిలినట్టుంది" అన్నాడు.

ముగ్గురు సింగన్నను సాయంపట్టి బంగళాకు తీసుకు పోయారు. అంత బాధలోను తను నడిచిరాగలనన్నాడు సింగన్న. కాని వాళ్ళు వారించి చేతులమీద బంగళాకు చేర్చారు.

మాధవరావు తన చెస్టు తెరిచి చకచక టి.టి, ఏంటి

బయాటిక్స్ యిచ్చాడు సింగన్నకి.

"నువ్వీ రాత్రి ఇక్కడే పడుకో సింగన్నా! ఉదయం మరోసారి యింజక్షన్ చేసి నీ కండిషన్ చూస్తాను. అవసరమయితే హాస్పిటల్‌కి పంపవచ్చును రేపు!" అన్నాడు మాధవరావు.

అక్కడికి యాభై కిలోమీటర్ల దూరంలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రముంది. ఆ చుట్టుపట్ల అరవై డబ్బయి కోయ గూడేలకు అదొక్కటే 'పెద్ద' ఆసుపత్రి. అయినా యెంతో మొండిజబ్బయితే తప్ప ఆటవికులు ఆ పి. హెచ్. సి. జోలికిపోరు. ఆకుపసురులు, మూలికలే వాళ్ళకు దివ్యౌషధాలు!

ఆ రాత్రి ఎవరికీ సరిగా నిద్రపట్టలేదు. తమ మధ్య చలాకీగా హుషారుగా తిరిగిన సింగన్న మంచంమీద ఆ సితిలో వుండటం అందరికీ బాధాకరంగా వుంది. ముఖ్యంగా రామరాజుకి!

నిస్వార్థమైన ఆ ఆటవికుడు తనను సమయానికి వచ్చి రక్షించకుంటే తను పులికి ఆహారమయిపోయి వుండేవాడే సరికి! ఆ సంఘటన తలుచుకుంటేనే అతనికి గుండె గుభిల్లుమంటోంది. చేత విల్లమ్ములున్నా అపాయాన్ని ఎదుర్కోవటానికి నిరాయుధంగా పెద్దపులిమీదకు దాడి వెళ్ళిన సింగన్న సాహసం ఎన్నటికీ మరుపురానిది!

రామరాజు, సింగన్న పక్కనే కుర్చీలాక్కుని కూచున్నాడు. బాధ తెలియకుండా మాధవరావు బాబాయి యిచ్చిన మత్తు యింజక్షన్‌తో కదలకుండా నిద్రపోతున్నాడు సింగన్న. అతని ఉచ్ఛ్వాసనిశ్వాసాలు బరువుగా వున్నాయి.

"ప్రమాదంలేదుకదా బాబాయ్!" అన్నాడు మాధవ

రావుతో రామరాజు.

"ఏం ఫరవాలేదు! పులి పంజా దెబ్బకదా! సెప్టిక్ కాకుండా ఏంటిసెప్టిక్స్‌తో గాయాలు వాష్ చేశాను. టెంపరేచర్ రాకుండా పెరాసెటిమాల్ యిచ్చాను. గాయాలు మానటానికి ఏంటిబయాటిక్స్ యిచ్చాను. ఉదయం కండిషన్ చూశాక అవసరమయితే హాస్పిటల్‌కి రిఫర్ చేద్దాం!" అన్నాడు మాధవరావు.

మేజర్ చంద్రకాంత్ ముఖం చాలా గంభీరంగా వుంది. సింగన్న విషయమై అతను చాలా బాధపడుతున్నాడని గ్రహించారు యిద్దరు. ఏనాడూ గురితప్పని మేజర్ తుపాకీ మూడుసార్లు గురితప్పటం మాధవరావుకి చాలా ఆశ్చర్యమనిపించింది.

చంద్రకాంత్ పులి నెందుకు చంపలేకపోయాడు? మూడుసార్లు కాల్చినా ఒక్క గుండు కూడా పులిని ఎందుకు తాకలేకపోయింది? మేజర్ అంత గంభీరంగా ఎందుకున్నాడు? పరాజయం కలిగినందుకు అవమానం తోను, చిన్నతనంతోను బాధపడుతున్నాడా? ఏమో, తన ఊహాకందలేదు మాధవరావుకి.

కుక్, వాచ్‌మన్ కూడా సింగన్న మంచం పక్కనే పక్కలు వేసుకుని పడుకున్నారు.

## 5

ఓ రాత్రప్పుడు అకస్మాత్తుగా మెలకువ వచ్చింది రామరాజుకి. కుర్చీలోనే కూచుని నిద్రపోయాడు రాత్రంతా.

తన మెలకువకి కారణం వెంటనే బోధపడలేదు రామరాజుకి. లేచి తన పక్కమీద దిండుకింద పెట్టిన రివాల్వర్ వెదికి చేతపట్టుకున్నాడు.

తలుపులు వేసివున్నాయి. గదికున్న గ్లాస్‌విండోస్ మీద దేంతోనో బలంగా మోదుతున్న చప్పుడు. గ్లాస్ పగిలి ఆ సందులోనుంచి పులి పంజా వికృతంగా కనిపించింది రామరాజుకి.

తానున్న గదిలోనే సింగన్న, కుక్, వాచ్‌మన్ వున్నారు. పక్క గదిలో మాధవరావు, మేజర్ చంద్రకాంత్ పడుకున్నారు.

పులి మళ్ళీ మరోసారి బలంగా మోదింది గాజు తలుపుమీద.

రామరాజు సంకోచించకుండా రివాల్వర్ గురిచూసి కాల్చాడు పులికి. కాని మేగజైన్ బర్రున చప్పుడయిందే గాని గుండు బయటికి రాలేదు.

మేగజైన్ విప్పాడు, గుళ్ళులేవు!

రివాల్వర్ లోడ్ చేసిం తర్వాత ఉపయోగించినవి రెండే గుళ్ళు! క్రితం రాత్రి పులిని గాయపరిచిన గుండు ఒకటి! పామును చంపటానికుపయోగించిన గుండు మరొకటి! ఇంకా నాలుగు బుల్లెట్స్ వుండాలి. ఏమయినట్లు?

ఈలోపల కుక్, వాచ్‌మన్ లేచి కట్టెల్ని గదిలోనే పేర్చి గబగబ మంట వెలిగించారు.

మంట చూసిన పులి లోపలికి రాకుండా పారిపోయిందిగాని లేకుంటే దాని ధాటికి తట్టుకోవటానికి వాళ్ళెవరూ సిద్ధంగా లేరు!

సింగన్న మంచంమీద అలా పడి నిద్రపోతూనే వున్నాడు. మత్తు యింజక్షన్ ప్రభావం అతన్ని నిద్ర నుంచి లేవకుండా చేసింది.

కుక్, వాచ్‌మన్‌లవద్ద ఆయుధాలేవీ లేవు!

తనవద్ద వున్న రివాల్వర్‌లో గుళ్ళులేవు!

రామరాజు చటుక్కున పక్క గదివైపు చూశాడు. ఇంత జరిగినా మాధవరావుగాని, మేజర్ చంద్రకాంత్ గాని నిద్రనుంచి లేచి రాలేదు.

అంత గాఢంగా నిద్రపోతున్నారా? రామరాజుకి సహజంగా అనిపించలేదు వాళ్ళ నిద్ర!

రెండు గదులకి మధ్య తలుపు ఒక్కటే అడ్డు!

తలుపులు తోశాడు. గడియ పెట్టలేదు. భళ్ళున తెరుచుకున్నాయి తలుపులు.

లోపల రెండు మంచాలమీద మాధవరావు, మేజర్ చంద్రకాంత్ నిద్రపోతూనే వున్నారు! దగ్గరగా వెళ్ళి చూశాడు రామరాజు.

ఉచ్ఛ్వాసనిశ్వాసాలనిబట్టి వాళ్ళిద్దరు గాఢనిద్రలో వున్నట్టు గమనించాడు. మాధవరావు రాత్రి పన్నెండు గంటలవరకు సింగన్నకు చికిత్స చేస్తూ మేలుకుని వున్నాడు. మేజర్ బాగా అలిసిపోయాడు సింగన్నని చేతులమీద మోసి మోసి.

రామరాజు వాచీ చూసుకున్నాడు. రేడియం డయల్ ఆటోమేటిక్ వాచీ నాలుగు గంటలు చూపిస్తోంది. తెల్లవారటానికి యింకా టైంలేదు! ఆ టైంలో గాఢ సుషుప్తిలో వుండటం చాలా సహజంగా జరిగేదే!

రామరాజు వాళ్ళని లేపి జరిగింది చెప్పాలనుకుని, నిద్రాభంగం కలికలిగించలేక వెనుతిరిగి తన గదిలోకి వచ్చాడు.

"బాబూ! చాలా అదృష్టవంతులం! ఏం చెయ్యకుండా నే పారిపోయింది పెద్ద పులి!" అన్నాడు కుక్, రామరాజుని చూసి.

వాచ్‌మన్ చెప్పాడు. "అ పులి పగబట్టినాది దొరా!

అందుకే యీ ఏలప్పుడొచ్చి దాడిచేసింది. సింగన్న తమ్ముడికి, యింకా గూడెపోల్లకి సెప్పి దాన్ని కేపెలా గైనా మాకేసి జంపాల! లేకుంటే మీ అందరి సెత్తురూ కల్లజూ సది."

రామరాజు సాలోచనగా చూశాడతనివంక.

భక్ కూడా వాచ్‌మన్ మాటల్ని సమర్థించాడు. "నిజం బాబూ! ఇదివరలో మీలాంటి బాబే ఒకాయన పులిని గాయపరిచాడు. అది తప్పించుకుపారిపోయింది. ఆయన రాత్రి వచ్చి యిక్కడే పడుకున్నాడు. ఓ రాత్రి సమయంలో తలుపు చప్పుడైతే ఏమీ ఆలోచించకుండా వెళ్ళి తలుపు తీశాడు. అంతే, ఒక్కసారిగా దెబ్బతిన్న పులి ఆ బాబు కంఠంపట్టి రక్తం తాగేసింది. ముక్కలు ముక్కలుగా అతన్ని చీల్చి తినేసింది. అంచేత పగబట్టిన పులి అంతు చూసేదాకా వదలదు బాబూ!" అన్నాడు.

రామరాజు మౌనంగా వాళ్ళు చెప్పింది విన్నాడు.

తెల్లవారాక, ఆ పులి విషయం ఏం చెయ్యాలో అందరూ ఆలోచించి ఓ నిర్ణయానికి రావటం మంచిదని అభిప్రాయపడ్డాడు.

## 6

"ఏమిటీ, యింత ప్రమాదం తప్పిందా? రాత్రే మమ్మల్ని లేపి చెప్పలేదేం?" అన్నాడు చంద్రకాంత్ ఆశ్చర్యంగా.

మాధవరావు కూడా బాగా ఆశ్చర్యపడి, "అదేమిటి రాజా, మేము అంత మొద్దునిద్రపోయామా? ఏమాత్రం మాకు తెలియదే!" అన్నాడు.

"అది సరే, యిప్పుడేం చెయ్యాలన్న విషయం ఆలోచించాలి! ఆ పులి నిజంగా పగబట్టిందనుకోవాలా?

మనల్ని వదిలి రాజా నే అది వెంటాడుతుందంటే పగబట్టిన విషయం నిజమేననిపిస్తోంది నాకు!" అన్నాడు చంద్ర కాంత్.

మాధవరావు వెంటనే మాట్లాడలేదు.

మాధవరావు సింగన్నని పరీక్ష చేశాడు. సింగన్న కాస్త ఉల్లాసంగానే కనిపించాడు. కాకపోతే ముఖం కొంచెం వాచింది. మాట బరువుగా వుంది. ఎక్కువగా మాట్లాడలేకపోతున్నాడు.

"సింగన్నా, రెండురోజులు మందులిస్తే సరిపోతుంది. ఇక ఆస్పత్రికి వెళ్ళాల్సిన పనిలేదు" అన్నాడు మాధవ రావు.

సింగన్న చేతులెత్తి నమస్కరించి, "ఆస్పత్రిలో నాకు యిలా చూసేవాళ్లెవరు దొరా! నీ మేలు మరవను" అన్నాడు కృతజ్ఞతాపూర్వకంగా.

మాధవరావు అతని చేతుల్ని తన చేతులతో పట్టుకుని "నాకు దణ్ణం పెట్టాల్సినంత గొప్ప పనేమీ చెయ్య లేదు నేను! అసలు నేను, మా రాజా నీకు ఋణపడి వున్నాం. నువ్వు ధైర్యంగా పులి నెదుర్కొని వుండక పోతే మా రాజాగతి ఏమయ్యేదో! చేతిలో ఆయుధముండీ అతను ఏం చెయ్యలేకపోయాడు. చేత ఏమీ లేకుండానే నువ్వు పులిని తిప్పికొట్టావు" అన్నాడు.

సింగన్నకు తెల్లవారుఝామున పులి వచ్చినట్టు తెలి సింది. "బాబూ, యివ్వేళ దాని అంతు చూసేద్దాం. అది మనపై పగబట్టింది. అలా వదిలేస్తే మనందరి అంతూ చూసేద్ది. అవసరమయితే మా గూడెపోళ్లని కూడా వెంట తెస్తాను" అన్నాడు.

మేజర్ కల్పించుకుని, "ఇంకెవరూ అక్కర్లేదు!

నేనే దాన్ని వేటాడతాను. సింగన్నా, నువ్వు రాలేవు. వుండిపో! నేను, రాజు, మాధవా వెళ్తాం. అది ఎందుకు లొంగదో చూస్తాను. ఈ రోజు దాని అంతు నేను చూస్తాను" అన్నాడు. అతని ముఖం జేవురించి వుంది. కళ్ళు ఎర్రగా రక్తజీరలతో భయంకరంగా వున్నాయి.

"పంతాలకు పోవద్దు దొరా! దెబ్బతిన్న పులిని కొట్టడం నువ్వనుకున్నంత తేలిగ్గాదు. అందులోను—పగ బట్టిన పులితో చెలగాటం పెమాదం దొరా! నామాటిని ఈ ఒక్కసారి నన్ను రానియ్యి. లేదా నా గూడెంలో నా తమ్ముడు, యింకా ఆరితేరినోళ్ళు వున్నారు. ఆల్ల నెవర్నయినా తోడిచ్చి పంపుతాను. నామాట కాదనకు!" అన్నాడు సింగన్న ప్రాధేయపూర్వకంగా.

మేజర్ చంద్రకాంత్ వినలేదు. "ఈ మేజర్ శక్తిని చాలా తక్కువగా అంచనా వేస్తున్నావు సింగా. నా కెవరి సహాయము అక్కర్లేదు! ఆ మాటకొస్తే నేనొక్కడిని పోయి పులిని వేటాడగలను!" అన్నాడు పౌరుషంగా.

సింగన్న ఏం మాట్లాడలేదు. మాధవరావు వారించబోయి ఊరుకున్నాడు. రామరాజు దీర్ఘంగా ఆలోచిస్తూ వుండిపోయాడు.

## 7

"రాజూ, కాసేపు అలా బయట తిరిగొద్దాం రా!" అన్నాడు మాధవరావు, రామరాజుతో.

రామరాజు నిద్రపోతున్న మేజర్ వంక ఓ క్షణం చూసి "పద బాబాయ్!" అన్నాడు.

ఇద్దరు బంగళా బయటికొచ్చారు.

"ఎక్కువ దూరం పోవద్దు. ఎందుకంటే పులి పగబట్టి వున్నది. పగలు కూడా దాడిచేసే ప్రమాదం లేక

పోలేదు!" అన్నాడు మాధవరావు.

"పులి పగబడుతుందని నువ్వు నమ్ముతున్నావా బాబాయ్!...." ఆశ్చర్యంగా అతని వంక చూశాడు రామరాజు.

"పగబట్టింది పులి కాదు రాజా, మేజర్ చంద్రకాంత్! ఎవరిమీదో కాదో, నీ మీద!" చల్లగా అన్నాడు మాధవరావు.

రామరాజు ఉలిక్కిపడ్డాడు. "ఏమిటి బాబాయ్, నువ్వు చెప్పేది? మేజర్ నా మీద పగబట్టాడా? కారణం?" అన్నాడు విస్మయంగా.

"నేను రాత్రి చూచాయగా గ్రహించాను. నిన్న పెద్ద పులి నీమీద దూకినప్పుడు మేజర్ కావాలనే గురి తప్పించి కాల్చాడు. అప్పుడే మొదటిసారిగా నాకను మానం వచ్చింది. రెండు రోజులుగా నేను అతను రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపోకపోవటం, కలవరించటం కూడా గమనించాను. ఆ కలవరింతల్లో నీ పేరు దొర్లటం కూడా జరిగింది...." మాధవరావు ఓ క్షణం ఆగాడు.

రామరాజు అయోమయంగా చూశాడు.

"మేజర్‌కి నామీద కక్ష దేనికి? ఆయనకు నేనేం అపకారం చేశాను?....కావాలని గురితప్పించి కాల్చాడన్నావు. ఆ సంగతి నీకెలా తెలుసు?" ప్రశ్నల వర్షం కురిపించాడు రామరాజు.

"మేజర్‌కి నువ్వేం అపకారం చేశావో, అతనెందుకు నీపై పగబట్టాడో నాకు తెలియదు. ఇక గురి తప్పించాడని నేనెలా చెప్పగలిగానంటే, మేజర్ తన టార్గెట్ విషయంలో అపజయం పొందింది యిప్పటిదాకా లేదు.

అతను ఎంత దూరాన్నుంచయినా కరెక్టుగా గురిచూసి కాల్చగలడు. మొదటి రోజు రాత్రి పులి పక్కకి ఉరికి నందువల్ల అతని గురి తప్పిందికాని, రాత్రి పక్కనే పులి నీమీద దాడిచెయ్యటం చూసి కావాలనే కొంతసేపు కాల్చకుండా ఆగిపోయాడు. సింగన్న హెచ్చరించేవరకు తుపాకీ ఉపయోగించలేదు.

అప్పుడయినా మూడు గుళ్ళలో ఒకటైనా యెందుకు పులికి తగల్లేదు? మేజర్ చాలా పక్కకు చూసి గాల్లో వదిలేశాడు గుళ్ళను! సింగన్న అందుకే అమాంతం పులి మీదపడి ఎదుర్కొన్నాడు. బాణం సంధించి విడిచేంత వ్యవధికూడా లేదు. అదీగాక మేజర్ స్వయంగా తనే పులిని కాలుస్తానని, ఎవర్నీ కలగజేసుకోవద్దని ముందుగా హెచ్చరించటంవల్ల సింగన్న బాణం వెయ్యలేదుగాని, సింగన్న ఒక్క బాణంవేస్తే చాలు పులి నేలకరిచి వుండేది! పైనుంచి చూస్తున్నానుకదా, నాకంతా తున్నాంగా తెలుసు" అన్నాడు మాధవరావు.

రామరాజుకి జరిగిన విషయం కళ్ళకు కట్టినట్టు కనిపించింది. అవును, మేజర్ కావాలనే పులిని చంపలేదు! అది తన ప్రాణంతీసినా ఫరవాలేదని, దానికి తను ఆహారమయిపోవటమే తనకి కావలసిందన్నట్టు మేజర్ ప్రవర్తించాడు. పులి పారిపోయేటప్పుడు కూడా దాన్ని గురిచూసి కాల్చకుండా, దూరంగా పారిపోయాక వూరకే ఓ.సారి కాల్చాడు, అంతే! మరొకరు మరొకరయితే గురి తప్పిందనుకోవచ్చు! కాని పదిహేనేళ్ళు సైన్యంలో పని చేసివచ్చిన మేజర్ గురి తప్పటమా?

రామరాజు మెదడు ఆలోచనలతో వేడెక్కిపోయింది. మేజర్‌కి ఎందుకు తనమీద కక్ష? ఎందుకు పగబట్టాడు?

సమాధానం వెంటనే తట్టింది! అవును.... అదే కారణమయివుండాలి! మేజర్ తనని అపార్థం చేసుకున్నాడు. తనని అనుమానించాడు. అందుకే ... అందుకే .... వేట పేరుతో తనని యీ అడవికి ఆహ్వానించి తీసుకువచ్చాడు. వేట సాకుతో తనని యీ అడవిలో మట్టుపెట్టాలని ప్లాన్ వేశాడు. ఇప్పుడు తనకి పూర్తిగా అర్థమవుతోంది. బాబాయి చాలా కరెక్టుగా వూహించాడు.

మేజర్ కావాలనే తనని అడవికి తీసుకువచ్చాడు, అనుమానంలేదు!

ఆ సంఘటన.... అవును అదే.... మేజర్ పగబట్టడానికి అదే కారణం! అదే....

• • •

"మేజర్ గారున్నారాండీ...." లోపలికొస్తున్న రామరాజు చటుక్కున ఆగిపోయాడు. తలుపులు తట్టకుండా తను లోపలికి రావటం తప్పయిపోయింది.

మేజర్ భార్య రూప అప్పుడే స్నానంచేసి ఒక్క తుండుగుడ్డ మాత్రం చుట్టుకుని బాత్ రూంనుంచి హాడావిడిగా వస్తోంది. తనని చూసి విస్తుపోయినట్టు చూసింది. తర్వాత నవ్వేసుకుని సిగ్గుపడుతూ లోపలికి పారిపోయింది!

రామరాజు నాలిక్కరుచుకుని వెనుతిరగబోయాడు.

"ఆ..ఆ.. వెళ్ళిపోకండి. వచ్చేస్తున్నాను, కూచోండి" అన్నది లోపలినుంచి రూప. ఆమెకు అతని మనోభావాలు అర్థమయినట్టుంది!

అయిదు నిమిషాల్లో చీరకట్టుకుని వచ్చింది రూప.

రామరాజు చూడకూడదనుకుంటూనే ఆమె వంక రెండు క్షణాలు కళ్ళు ఆర్పకుండా చూశాడు.

రూప తలస్నానం చేసినట్టుంది! తుండు జుట్టుకు పిడచ

కట్టుకుని వుంది. కనకాంబరం రంగు ఫాగెన్ నైలెక్స చీర ఆమె ఒంటి వంపుల్ని దాచలేకపోతోంది. మేచింగ్ బ్లౌజు ఆమె వంటికి ఉల్లిపొరలాగా పట్టివుంది. దోసగింజంత సన్నటి తిలకం ఆమె ముఖంమీద ఎర్రటి సూర్యుడిలా వెలిగిపోతోంది. పాలు కారేటట్టున్న చెక్కిళ్ళకు పౌడరు పల్చగా అద్దింది. సెంటువాసన అదోరకమైన మత్తు కలిగిస్తోంది.

"ఏమిటలా చూస్తున్నారు?" అన్నది నవ్వుతూ. ఆ నవ్వు కవ్వింపులా వుంది.

రామరాజులో సంస్కారం, వివేకం మేల్కొన్నాయి.

"సారీ తలుపు తట్టకుండా వచ్చేశాను. మిమ్మల్ని ఆ స్థితిలో...." నీళ్ళు నమిలాడు.

"ఇప్పుడేమయిందని? సారీ చెప్పుకునేటంత పొరపాటు మీరు చెయ్యలేదు. పొరపాటుచేసినా మీరు సారీ చెప్పుకోనక్కర్లేదు!" రూప అతని కళ్ళలోకి కొంటెగా చూసి ఫక్కున నవ్వింది. మనోహరమైన నవ్వు గిలిగింతలు పెట్టే నవ్వు!

"మేజర్ గారు లేనట్టుంది, నేను వెళ్తాను!" అన్నాడు రామరాజు లేవబోతూ.

ఆమె చటుక్కున అతన్ని వారించింది. ఆమె చెయ్యి అనుకోకుండా అతని పెదాలకు తాకింది. ఆమె నవ్వింది.

రామరాజు యిబ్బందిగా సోఫాలో కదిలాడు. రూప తన స్నేహితుడి భార్య! అయితే మేజర్ కి ఆమెకు వయసులో సగానికి పైగానే భేదముంది! మేజర్ మొదటి భార్య పోయింది. మిలిటరీనుంచి వచ్చాక అయిదేళ్ళక్రితం రూపను పెళ్ళిచేసుకున్నాడు.

ఇప్పుడు రూపకు నిండా పాతికేళ్ళు లేవు! ఏభై ఏళ్ళ

మేజర్‌కి రెండవ భార్యగా ఆ యింట్లో మోడులాంటి జీవితం గడుపుతోంది! రామరాజుకి ఆమెపట్ల సానుభూతి వుంది. తన బాబాయ్ కారణంగా మేజర్‌తో పరిచయం స్నేహం వరకు దారితీసింది.

ఈ రోజు ఛెస్ ఆడటానికి మేజర్ తనని నాలుగు రోజుల్నించీ ఆహ్వానిస్తున్నాడు. తనకి క్లాసులతో, పాఠాలతో తీరిక రావటంలేదు....పరీక్షలు దగ్గరపడటం వల్ల ప్రయివేటు క్లాసులు కండక్టు చేస్తున్నాడు కాలేజీలో. తీరా తనొచ్చేసరికి మేజర్ యింట లేడు.

"మేజర్‌గారు...."

"క్లబ్బుకి వెళ్ళారండి, మీరొస్తారని ఆయనకు తెలియదేమో...."

"అబ్బే, ఈ రోజు కూడా ఫోన్ చేసి చెప్పారండి. అందుకే వచ్చాను...."

రూప "అబ్బా!" అంటూ కన్నుమీద చేయి వుంచుకొని రుద్దసాగింది.

"ఏమండి, ఏమయింది?" అన్నాడు కంగారుగా రామరాజు.

రూప రామరాజు దగ్గరగా వచ్చి సోఫాలో అతని పక్కనే కూచుని, "ఏదో నలక పడినట్టుంది, చూడండి! బహుశా దీపం పురుగేమో! కన్ను భగ్గున మండిపోతోంది!" అన్నది దాదాపు అతనిమీద వాలిపోతూ.

"అలా నలపకండి. ఏదీ నన్ను చూడనివ్వండి!" అంటూ ఆమె గడ్డం పట్టుకుని, మరో చెయ్యి తలమీద ఆనించి ఆమె ముఖాన్ని దగ్గరగా తీసుకుని కన్ను రెప్పలు విదిలించాడు.

"అబ్బే, ఏం లేదే!...." అన్నాడు కొన్నిక్షణాలు

పరీక్షగా చూసి.

రూప కిలకిల నవ్వేసింది. రెండు చేతులు అతని మెళ్ళో వేసి చటుక్కున అతని తలను గట్టిగా హృదయానికి హత్తుకుంది.

ఊహించని యీ హఠాత్సంఘటనకు రామరాజు అదిరిపోయాడు.

"ఏమిటండీ, తప్పు, లేవండి!" అన్నాడు ఆమెనుంచి విడిపించుకుని దూరంగా జరుగుతూ.

"హుఁ! ఏం మగాళ్ళండీ!...." అన్నది మూతి ముడుచుకుని రూప.

"హల్లో యంగ్ మాన్, ఎంత సేపయింది వచ్చి?...." మేజర్ చంద్రకాంత్ గొంతు కంచుగంటలా వినిపించి యిద్దరు ఉలిక్కిపడి గుమ్మంవైపు చూశారు. తలుపులు తీసే వున్నాయి. ఎదురుగా నవ్వుతూ చంద్రకాంత్.

"ఇప్పుడే .... అయిదు నిమిషాలయిందండి. మీరు రారేమో వెళ్ళిపోదామనుకుంటున్నాను" రామరాజు కంఠంలో స్పష్టంగా తడబాటు ధ్వనించింది.

మేజర్ నవ్వాడు. అతనలా మాటిమాటికీ ఎందుకు నవ్వుతున్నాడో రామరాజుకి అర్థమవుతోంది. అతను మామూలుగా నవ్వటంలేదు. ఏదో అర్థం ఆ నవ్వులో తనకి ధ్వనిస్తోంది. లేక తనే గిల్టీ కాన్షస్ నెస్‌తో ఫీలవుతున్నాడనిపించింది కాసేపు.

చంద్రకాంత్ రూపతో తను సన్నిహితంగా వున్న క్షణంలో చూశాడా? చూసివుండొచ్చు. అందుకే భావయుక్తంగా నవ్వుతున్నాడు.

రూప మాత్రం అదేం గమనించనట్టు చాలా మామూలుగా వ్యవహరిస్తోంది. తను మాత్రం అలా మూవ్

కాలేకపోతున్నాడు.

ఓ పదినిమిషాలు పావుల్ని ఎలాగో చదరంగం బల్ల మీద నడిపి మేజర్ చేతిలో రెండుసార్లు ఓడిపోయి "తల నొప్పిగా వుంది సార్, పోతాను!" అంటూ మేజర్ సమాధానం కోసం చూడకుండా లేచి వచ్చేశాడు రామరాజు.

• • •

అయితే.... ఆ సంఘటనే మేజర్ తనమీద పగబట్టడానికి కారణమా? మేజర్ తనని అపార్థం చేసుకున్నాడా? ఆ సంఘటన కేవలం యాదృచ్ఛికం! తన తప్పేముంది? రూప క్షణికోద్రేకానికి లోనై తనను పట్టుకుంది. తనేమీ ప్రోత్సహించలేదే!

అయితే సరిగ్గా ఆమె తనని సన్నిహితంగా తీసుకున్న క్షణంలోనే చంద్రకాంత్ చూసివుంటాడు. అందుకే అతని మాటల్లో నవ్వులో అంత భేదం స్పష్టంగా కనిపించింది తనకి!

ఆ తర్వాతి రెండు రోజుల్లోనే యీ అడవికి హంటింగ్ ప్రోగ్రాం పెట్టాడు. తనతో చాలా మామూలుగా మూవ్ అవుతూ, యీ అడవికి వేటకు ఆహ్వానించాడు. తను వీలుకాదంటే బాబాయితో చెప్పించాడు. ప్రాక్టీసు వదులుకుని బాబాయి కూడా బయల్దేరాడు. ఇద్దరూ బలవంతం చెయ్యటంతో తను కాదనలేక వచ్చాడు.

అయితే, మేజర్ చంద్రకాంత్ తనమీద కక్షతో పగ తీర్చుకోవటానికే ఈ ప్రోగ్రాం ఏర్పాటుచేశాడన్న విషయం యిప్పుడర్థమవుతోంది.

"చాలా జాగ్రత్తగా వుండాలి రాజా! నేను మేజర్‌తో యిందాకే అన్నాను—తిరిగి వెళ్ళిపోదామని!

కాని మేజర్ చాలా పట్టుదలగా వున్నాడు. పులిని వేటాడితీరాలంటున్నాడు. అంతుచూస్తే గాని తిరిగి పోకూడదంటున్నాడు! అతను చూస్తానంటున్నది పులి అంతుకాదని నీకీసరికి అర్థమయ్యే వుంటుంది!" మాధవ రావు మాటలు చాలా గంభీరంగా వున్నాయి.

"నా రివాల్వర్‌లో నాలుగు గుళ్ళుండాలి. అవి యెవరో తీసేశారు" అన్నాడు రామరాజు.

"ఇప్పుడు తెలిసిందా? యెవరు తీసేశారో నేను వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను."

రామరాజు సాలోచనగా తలూపాడు.

"బాబాయ్, నాకు కొన్ని బుల్లెట్సు కావాలి! మేజర్‌కి తెలీకుండా తెచ్చిపెట్టగలవా?"

"తప్పకుండా తెస్తాను. కాని ఒక షరతు! మేజర్ నాకు చిన్ననాటి స్నేహితుడు! అతను నీమీద పగబట్టడం నిజంగా దురదృష్టం! నీ ప్రాణరక్షణకు తప్పితే మేజర్‌ని కావాలని చంపటానికి నేనంగీకరించను. మేజర్ కూడా డైరెక్టుగా నిన్ను చంపడని నాకనిపిస్తోంది! ఏదో విధంగా తనమీదకు రాకుండా నీ అంతు చూడాలని మాత్రం అతని ప్లాన్‌లా వుంది. కాబట్టి ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుని నిన్ను నువ్వు రక్షించుకో! నీ వెనక నేనుంటాను. నీ ప్రాణరక్షణకు నా శక్తివంచన లేకుండా కృషి చేస్తాను.

ఇంకో విషయం! ఈ రాత్రికి ఎలాగో గడిపెయ్యి. రేపు ఏదో సాకుతో నిన్ను నేను తీసుకుని సిటీకి వెళ్ళి పోతాను. అందుకేదో ఉపాయం మేజర్‌కి అనుమానం రాకుండా నేను ఆలోచించి ఉంచుతాను. బి కేర్‌ఫుల్!"

అన్నాడు మాధవరావు.

బాబాయివంక కృతజ్ఞతగా చూశాడు రామరాజు.

## 8

రాత్రి ఎనిమిది గంటలయింది.

యథావిధిగా పులికోసం మేజర్, రామరాజు తమ పొజిషన్‌లలో కాచుకుని వున్నారు. మాధవరావు చెట్టు మీద కూచుని చేతుల్లో టార్చ్ లైట్సుతో సిద్ధంగా వున్నాడు. సింగన్న బంగళాలోనే వుండిపోయాడు.

ముగ్గురిలోను టెన్షన్! రామరాజు రివాల్వర్ లోడ్ చేసుకున్నాడు! మాధవరావు బుల్లెట్స్ తెచ్చి రహస్యంగా రామరాజుకి అంతక్రితమే అందించాడు. ఆరు గుళ్ళు లోడ్ చెయ్యగా మరో ఆరు స్పేర్ వున్నాయి. మేజర్ దృష్టిలో తన చేతిలో ఖాళీ రివాల్వర్ వున్నట్టే లెక్క!

పరిస్థితి ఎలా వుంటుందో చూడాలి!

ఎక్కడో ఆకుల గలగల శబ్దం వినిపించింది.

అందరు చెవులు రిక్కించారు.

రామరాజు వెంటనే గ్రహించాడు. అది పులి వస్తున్న సవ్వడికాదు. అటు యిటు కుందేళ్ళు పరుగెత్తున్నాయి. పక్షులు కిలకిలారావాలు చేస్తున్నాయి. పులివచ్చేముందు వాతావరణమే వేరుగా వుంటుంది. యెక్కడా పశు పక్ష్యాదుల సవ్వడి వినిపించదు—ఒక్కసారిగా వాతావరణంలో ప్రత్యేకమైన నిశ్శబ్దం నెలకొంటుంది! అది నిన్న రాత్రి తనకు అనుభవమయినదే!

మేజర్ ఎంత క్రూరహృదయుడు! తన చేతిలో గుళ్ళు లేని రివాల్వర్ వుందని తెలుసు! పులి దెబ్బతిని పారిపోయి పగబట్టివుందని తెలుసు! తను పులివాతపడి నిర్దా

క్షుణ్యంగా చావాలని మేజర్ 'కోరిక! చూసేవాళ్ళకు పులివల్లనే తను చనిపోయినట్లు కనిపించాలి! అతని పని పూర్తికాగానే ఎటూ పులిని చంపితీర్తాడు. ఆ విష యంలో మాత్రం అనుమానంలేదు.

రామరాజు చెవులు రిక్కించాడు. పైన కూచునివున్న మాధవరావు 'ఇస్'మంటూ సిగ్నల్ యిచ్చాడు. వాతా వరణం ఒక్కసారి స్తంభించిపోయింది!

తుఫాన్ ముందుండే వాతావరణం అది! పులి వచ్చే సిందనటానికి ప్రత్యక్ష నిదర్శనం!

ఈ లోపల రామరాజుకి చక్కటి ఆలోచన వచ్చింది. అంతవరకు తానున్న పొద పక్కనుంచి మెల్లగా మరో పొద పక్కకు పిల్లిలా నక్కుతూ వెళ్ళాడు. ఆ పొదనుంచి మరో పొద దగ్గరకు జరిగాడు. ఇదివరకు పులి తనమీద దుమికిన పొదనుంచి దాదాపు నాలుగైదు గజాలదూరం జరిగిపోయాడు!

మేజర్ మాత్రం క్రితం రాత్రి వున్న పొద దగ్గరే కాచుకుని వున్నాడు. రామరాజు క్రితం రాత్రి పొద దగ్గరున్నట్టే లెక్క అతనికి! అయితే మాధవరావు మాత్రం రామరాజు సంకేత స్థలంనించి పాకిపోవటం గమనించాడు. అతనికి రామరాజు మనోగతాభిప్రాయం అర్థమయింది.

పులి ఒక్కసారిగా క్రితం రాత్రి పొదమీదకే ఉరికింది. కాని, పులి అంచనా ఘోరంగా తప్పింది. అక్కడ రామరాజు లేకపోవటంతో ఉక్రోషంతో గట్టిగా గర్జించింది.

మాధవరావు వెంటనే మేజర్‌కి టార్చ్‌తో సిగ్నల్ యిచ్చాడు పులిని కాల్చమని! అనుకున్నట్టే మేజర్

కాల్చలేదు!

పులి చకచక వెతికేస్తోంది పొద పక్కనే. అటు యిటు పిచ్చిగా తిరిగేస్తోంది. ఆసరికి రామరాజు మేజర్ కూచున్న పొద పక్కకు వచ్చేశాడు.

మేజర్ పక్కన చప్పుడవటంతో చటుక్కున తిరిగి చూశాడు. రామరాజు కనిపించాడు. కాని రామరాజుకి మేజర్ కనిపించటంలేదు. అందుకే అతను మేజర్ కి అంత సమీపంగా వచ్చేశాడు!

పులి అటు యిటు చాలా వేగంగా వెతుక్కుంటోంది. అది వెతుకుతున్నది తనకోసమేనని రామరాజుకి అర్థమయి పోయింది. రివాల్వర్ గురి చూసుకున్నాడు.

మేజర్ చటుక్కున రామరాజు కూచున్న పొద దగ్గర తన రైఫిల్ తో శబ్దం చేశాడు!

అంతే పులి రివ్వున ఆ పొద దగ్గరకు దూసుకొచ్చేసింది. రావటంతోనే రామరాజు మీదపడింది. రామరాజు సంకోచించకుండా కాల్చేశాడు పులిని. పులి మరో సారి దెబ్బతిని పెడబొబ్బ పెట్టింది. కాని రామరాజు చేతిమీద విసురుగా పంజాతో కొట్టింది.

రామరాజు ఆ అదురుకు తట్టుకోలేకపోయాడు. అతని చేతిలోని రివాల్వర్ ఎగిరి దూరంగా పడిపోయింది! మరు క్షణంలో అతిన్ని పులి పొట్టన పెట్టుకునేదే!

కాని రామరాజు సమయస్ఫూర్తితో ఒక్క పరుగున పులికోసం వేసిన మాటుపక్కగా దూసుకుపోయాడు.

పులి అందబోయిన టార్గెట్ దూరంకావటంతో మహోద్రేకంతో రామరాజువైపు పరుగెత్తింది. రామరాజు గోతి అంచు వెంబడే దాన్ని రెచ్చగొడుతూ తిరిగాడు అటు, యిటు.

కోపంమీద వున్న పులి అతన్నందుకోవటానికి ముందుకి ఉరికింది. అంతే, అమాంతం గోతిలో పడిపోయింది. ఉక్రోషంతో అది అరుస్తున్న కేకలకి అడివంతా ప్రతిధ్వనిస్తోంది!

అయితే అదేక్షణంలో మేజర్ చేతిలోని తుపాకీ గర్జించింది.

కాని ప్రమాదాన్ని శంకించిన మాధవరావు, రామరాజువైపు తుపాకీ గురిచేసిన మేజర్ చేతిమీదికి టార్చ్ బలంగా విసిరాడు, అంతే, గుండు రామరాజుకి అడుగు ఎడంగా దూసుకుపోయింది.

మేజర్ అదురుపాటునుంచి తేరుకునేలోపల మాధవరావు చెట్టుమీదనుంచి మేజర్ మీదకి ఉరికేశాడు.

మరోసారి తుపాకీ రామరాజుకి గురిచేసిన మేజర్ ప్రయత్నం ఘోరంగా విఫలమయింది.

"మధూ, నాకు అడ్డు రాకు!" అంటూ మాధవరావుని బలంగా నెట్టేసి, చకచక గుళ్ళు నింపుకున్నాడు మేజర్.

ఆ క్షణాన్ని చాలా తెలివిగా ఉపయోగించుకున్నాడు రామరాజు. అదృష్టవశాత్తు మాటుకి దగ్గరోనే అతని చేతినుంచి ఎగిరిపడ్డ రివాల్వర్ పడివుంది! దాన్ని చేతిలోకి అందుకున్నాడు.

మేజర్ చేతికి గురిచూసి కాల్చేశాడు రామరాజు. ఊహించని యీ దాడి నెదుర్కోవటానికి సిద్ధంగాలేడు మేజర్. అతని చేతిలోని తుపాకి జారిపడిపోయింది.

అయితే, ఊహించని విధంగా రామరాజు దగ్గరికి బాణంలా దూసుకుపోయాడు మేజర్. ఒక్క క్షణంలో రామరాజుని పులివేటకు తయారుచేసిన మాటులోకి తోసేసి వుండేవాడు. కాని మాధవరావు అతనికి కాలు

అడ్డువేయటంతో మేజర్ చంద్రకాంత్ ఆ వేగానికి నిల దొక్కుకోలేక తనే గోతిలోకి పడిపోయాడు.

రామరాజు రివాల్వర్ సరిచూసుకునేంతలో మేజర్ గోతిలో పడిపోయాడు. గోతిలో పులి మహోద్రేకంతో మేజర్ మీద పడి క్షణాలలో ఖండఖండాలుగా చీల్చే సింది!

"బాబాయ్, ఎంత పని చేశావు? నువ్వేనా యీ పనికి పూనుకున్నది? మేజర్ని చంపకూడదనే నేను చేతిమీద కాల్చి వూరుకున్నాను! నేను చేసిన నేరమేమిటో మేజర్ని అడగాలనుకున్నాను. అతని అపార్థాలు తొలగించాలను కున్నాను. కాని యింతలోనే...." అంటున్న అతని మాటల్ని మధ్యలోనే తుంచేశాడు మాధవరావు.

"మేజర్ పగబట్టిన పులి! ఆ పగబట్టిన పెద్ద పులికన్న మేజర్ చాలా ప్రమాదకరమైన వ్యక్తి! నిన్ను ఉత్త పుణ్యానికే అపార్థం చేసుకుని కక్ష కట్టాడు. నువ్వు యిందాకా చెప్పేవరకు నాకు అసలు విషయం తెలియదు. నువ్వెంత నిప్పులాంటి మనిషివో నాకు తెలుసు! రూప కేరక్టర్ విషయం కూడా నాకు తెలుసు. తప్పెవరిదో గ్రహించాను.

మేజర్కి నిజం చెప్పినా అర్థంకాదు. అతను మూర్ఖుడు! తను పట్టిన పట్టు వదలడు। అందుకే నాకెంతో సన్ని హితుడు, బాల్యమిత్రుడు అయిన మేజర్కి యిదే సరైన శిక్ష అని నిర్ణయించాను!" అన్నాడు మాధవరావు.

గోతిలోని పగబట్టిన పులి మేజర్ని చంపేసి హాయిగా ఆరగిస్తూంది.

—:అయిపోయింది:—

సీరియల్

# విషసర్పాలు

## సికిందర్

(గత సంచిక తరువాయి)

యశ్వంత్ తిరిగి బెడ్ మీద కూలబడ్డాడు, "సరే, ఇప్పుడు మన కార్యక్రమమేమిటి? పోలీసులు రిలాక్స్ అవుతూంటే మనమేం చేస్తున్నాం....శంభూ, ఇంకో అవకాశం చూడరాదూ?"

"ఎక్కడ బాస్?"

"లెటర్ బాక్సులలో."

వాళ్ళిద్దరు ఉలిక్కిపడ్డారు. "బాస్ అది ప్రమాదం.."

"ఎందుకు ప్రమాదం?"

శంభూనాథ్ ఏదో చెప్పాలని నోరు తెరుస్తూ తిరిగి మూసుకున్నాడు.

"లేదు శంభూ, ప్రమాదంలేదు. వాళ్ళకా అయిడియా తట్టి వుంటుందంటావా? లేదు, వాళ్ళ హెచ్చరికలూ బెదిరింపులతో ఇంకెవరూ ఉత్తరాలు వ్రాయరనుకుని మనం విరమించుకున్నాం. కానీ వాళ్ళెన్ని జాగ్రత్తలు హెచ్చరించినా ఫలితం లేకపోయింది కదూ? ఎవరూ పోలిస్ స్టేషన్ లలో ఆ ప్రకారం డిటెయిల్స్ దాఖలు చేయలేదు. వాళ్ళంతా చచ్చారు. వ్రాసిన వాళ్ళంతా

క్షేమంగా వున్నారు. ఈ విషయం వాళ్ళకి తెలుసు.... వాళ్ళింకో ఛాన్స్ తీసుకుంటారని ఎందుకనుకోకూడదు, ఈ పరిస్థితుల్లో?"

"బాస్..."

"వెళ్ళండి! గుంపుని తోలండి బావుల్లమీదికి! సాయంత్రానికి ఓ రౌండు పూర్తిచేసి చూడండి! అవకాశం మున్నప్పుడు వినియోగించుకోవాలి."

"అలాగే, బాస్. చేస్తాం."

"గుడ్, ఇవ్వాళ కలెక్షన్ ఫిగరెంత?"

జింబో లిస్టుతీసి చెప్పాడు, "వన్ క్రోర్ టెన్, బాస్."

"ఓహ్—వెల్—వెళ్ళండి. మళ్ళీ నన్ను డిస్టర్బ్ చెయ్యకండి" యశ్వంత్ పడుకుంటూ చెప్పాడు. మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చి అడిగాడు, "ఆ జంట గుర్రాలు ఇక్కడ కన్పించాయెందుకు శంభూ, ఉదయం చూశాను?"

"ఎవరు, బాస్?"

"సంతోష్, సుభాష్. వాళ్ళిక్కడేం చేస్తున్నారు? వాళ్ళ డ్యూటీ బోలెన్ పల్లిలో డిటెక్టివ్ లాల్‌ని కనిపెట్టడం కాదా?"

ఉలిక్కిపడ్డారు శంభూనాథ్, జింబోలు.

"వాళ్ళు—బాస్—వాళ్ళిక్కడలేరు—" అనేశాడు జింబో.

"లేరా? ఉదయం చూశానే ..."

"వాళ్ళు—వాళ్ళు కారు, బాస్...."

"కారా? నేను బాగా చూశానే...." దిగ్గున లేచి కూర్చున్నాడతను, "నిజం—నిజం చెప్పండి, బాస్టర్డ్స్!

వాళ్ళిక్కడ లేరూ? ఇప్పుడూ లేరు? నే వెళ్ళి చూస్తాను."

"బాస్ ...." అతన్నాపుతూ అన్నాడు శంభూనాథ్ బెదిరిపోయి, "వాళ్ళు—వాళ్ళిక్కడే వున్నారు, బాస్. రాత్రే వచ్చారు....డిటెక్టివ్ లాల్—"

"డిటెక్టివ్ లాల్—?"

శంభూనాథ్ గతుక్కుమని వెనక్కి జరిగాడు, "ఏమీ లేదు బాస్, ఏమీ లేదు....

యశ్వంత్ కళ్ళు తీక్షణమయ్యాయి. అతని ముఖం వెంటనే ఎరుపెక్కింది. అతనొక్క ఉదుటున మంచం దిగేశాడు అరుస్తూ, "డిటెక్టివ్—ఆ డిటెక్టివ్ తప్పించుకున్నాడు! మీరు నాకు చెప్పడంలేదు! ఏమిటీ నాటకం, వెధవల్లారా? ఏమిటి మీ ఉద్దేశం?"

"క్షమించండి, బాస్. క్షమించండి. మీకు చెప్పాలనే అనుకుంటున్నాను...."

"నాకు చెప్పాలనుకోలేదు! అది నాకు తెలియకూడదనుకున్నారు—" యశ్వంత్ ముఖం బిగుసుకుంది. అతని కళ్ళు జింబో చేతిలో ట్రాన్సిస్టర్ మీద పడ్డాయి. "ఆ ట్రాన్సిస్టర్—దాన్ని మీరే, పాడుచేసి పెట్టారు! యూ బ్లడీ బాస్టర్డ్స్, నేను వార్తలు వినకూడదనుకున్నారు! డిటెక్టివ్ తప్పించుకున్నాడని నాకు తెలిస్తే."

అతను వూగిపోతూ పరుపుకిందనించి రివాల్వర్ తీశాడు.

"ఆగండి, బాస్, ఆగండి! మనకు ప్రమాదంలేదు, నా మాట నమ్మండి! ఆ డిటెక్టివ్ ఏమీ చేయలేడు!"

"పారిపోండి!" గర్జించాడతను రివాల్వర్ గురిపెట్టి, "పారిపోండి, వెధవల్లారా! లేకపోతే షూట్ చేస్తాను! యాసిడ్‌లో పడేస్తాను! చెక్కేయండిక్కడ్నించి, దరిద్రపు మొహం కొడుకుల్లారా!

వాళ్ళిద్దరక్కడ్నించి దబదబమని పరుగు తీశారు.

అతను ఆవేశంతో వూగిపోతూ రివాల్వర్ ని విసిరి కొట్టాడు. కాళ్ళు విసురుకుంటూ, కళ్ళెర్రచేస్తూ దేవుడి పటం దగ్గరికెళ్ళాడు. దాన్ని దింపి పట్టుకొని, గొంతెత్తి తిట్టసాగాడు బూతులు.

రెండు చేతుల్తో చెవులు మూసుకుని, పరుగెత్తింది దేవయాని అక్కడ్నుంచి.

* * *

ఎంత సుహాసినీ పక్షీయులైనా లాల్ ప్రకటన చాలా బాధించింది యువకులకి. అతను విరమించుకుంటాననడం వాళ్ళు కలలో కూడా వూహించని విషయం. లాల్ అంత తొందరపడి ఎందుకీ నిర్ణయం తీసుకున్నాడో అర్థమవక సానుభూతితో వుండిపోయారు వాళ్ళు. సుహాసినిని సమర్థించడం మానలేదు.

ఆ మధ్యాహ్నం రేడియోలోనూ, సాయంత్రం పత్రికల్లోనూ పోలీసులు చేసిన ప్రకటనలు విస్మయపరార్చాయి ప్రజలందర్నీ.

వాళ్ళింకా హత్యలు జరగవని హామీ ఇస్తున్నారు!

ఇదెంతవరకు నిజమవుతుందో చూద్దామని వాళ్ళు (ప్రజలు) ఆసక్తితో యెదురుచూడసాగారు.

ఆ సాయంత్రం వివిధ పోస్టాఫీసులనుంచీ పోలీసులకి అందిన సమాచారాన్నిబట్టి, మొత్తం స్నేక్ సొసైటీ కోసం ప్లాంట్ చేసిన ఉత్తరాలు అన్నీ అదృశ్యమై పోయాయి, లెటర్ బాక్సులలోంచి.

హడావుడి మొదలైంది. మొత్తం అన్ని అడ్రసుల వద్దా నియోగించబడ్డ అధికారులు ఇహ సుహాసిని దర్శనం

కోసం ఎదురుచూస్తున్నారు.

ఈ రోజు సుహాసిని ఎలా వస్తుందో తెలియదు. ప్రజల్ని హెచ్చరించకపోయినా, యెవరి జాగ్రత్తలో వాళ్ళుంటున్నారు. పోలీసులు తమ మామూలు పాట్రోలింగ్ ప్రారంభించారు.

ఆ ఉదయం డి.జి.పి.తో సమావేశం తర్వాత లాల్ ఆఫీసుకు తిరిగి వచ్చి సుహాసిని అన్న సతీష్‌కోసం వాళ్ళింటికి ఫోన్ చేశాడు. కాని రెస్పాన్స్ లేదు. అప్పుడతను ఇంటికి బయలుదేరి వెళ్ళాడు.

గేటుకి తాళం వేసి వుంది. ప్రక్క ఇంటివాళ్ళు అతని గురించి తమకేమీ తెలియదని చెప్పారు. రెండుమూడు రోజులుగా అతను యింట్లో సరిగ్గా వుండడంలేదని అన్నారు. ఎదురింటివాళ్ళు అసలతను రాత్రిళ్ళు ఇంట్లోనే వుండడంలేదని అన్నారు. పగలు రెండు మూడు గంటలు వుంటున్నాడు. అయితే ఈ రోజు ఉదయమే ఎక్కడికో వెళ్ళిపోయాడు—

తల్లి మరణం తర్వాత అతను చాలా దిగజారి పోయాడని అందరూ అన్నారు. అతను మనిషిలా లేడని కొందరు అన్నారు. చూస్తే భయమేస్తుందని మరి కొందరూ, అసలు దగ్గరికెళ్తే ఏం చేస్తాడో తెలియదని మరికొందరూ తమ ఆందోళనని వెలిబుచ్చారు.

వీధిలో అతనికి తెలిసిన యువకుడినుంచి అతని స్నేహితుడొకడి అడ్రసు తీసుకుని బయల్దేరాడు లాల్. కానీ అక్కడ సతీష్ లేడు. స్నేహితుడు వున్నాడు.

సతీష్ నిన్న మధ్యాహ్నం కన్పించినట్టు మాత్రం చెప్పాడతను. అప్పుడు తను చాలా మామూలుగా వున్నాడనీ, విపరీతంగా ఏమీ ప్రవర్తించలేదనీ కూడా

అన్నాడతను. సతీష్ తను ఎక్కడ వుంటున్నాడో, ఏం చేస్తున్నాడో చెప్పలేదు. మళ్ళీ కనిపిస్తే తనకు వెంటనే ఫోన్ చేయమని నొక్కి చెప్పి, లాల్, అతనికింకా ఎందరు స్నేహితులున్నారో తెలుసుకుని బయల్దేరాడు.

ఆ నల్గురిలో ఇద్దరు తమకి అతను కన్పించలేదన్నారు. మూడో అతను ఆందోళనగా కొన్ని విషయాలు చెప్పాడు. సతీష్ హంతకులకోసం తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడనీ, ఎక్కడెక్కడో బాగా తిరుగుతున్నాడనీ, తన దగ్గరకొచ్చి తన తండ్రి రివాల్వర్ కోసం అడిగాడనీ, తను తిరస్కరిస్తే వెళ్ళిపోయాడనీ, మళ్ళీ నిన్న వచ్చి ఇంకోసారి ప్రయత్నించాడనీ, అప్పుడూ తిరస్కరిస్తే దూషించి స్నేహం తెంచుకుని వెళ్ళిపోయాడనీ, ఇక తనకి ముఖం చూపడనీ చెప్పుకొచ్చాడు.

లాల్ నాలుగో అడ్రసుకి వెళ్ళాడు. అది బషీర్ బాగ్‌లోని అపర్ణా అపార్టుమెంట్స్‌లో రెండో అంతస్తులోని ఫ్లాట్. అందులో వుంటున్నది ప్రభాకర్ అనే బ్రహ్మచారి, రైల్వే ఉద్యోగి.

అతనక్కడ లేడు. రెండు మూడు రోజులుగా అతను సరిగా రావడంలేదని చెప్పారు, ప్రక్క ఫ్లాట్ వాళ్ళు. అయితే అతనితోపాటు మరో యువకుడు తిరుగుతున్నాడని చెప్పారు. వాళ్ళెప్పుడొస్తారో, యెప్పుడు పోతారో తెలియదు. వాళ్ళెవ్వర మాట్లాడుకోరు. వాళ్ళ ప్రవర్తన అసహజంగా వుంటోంది. వాళ్ళమీద అనుమానాలు పెరుగుతున్నాయి....

లాల్ అనుమానాలు పెంచుకోవద్దని చెప్పి వాళ్ళొస్తే వెంటనే ఫోన్ చెయ్యమని నొక్కిచెప్పాడు. అక్కడ్నించి ఆలోచించుకుంటూ ఆఫీసుకు తిరిగివచ్చేశాడు.

కానీ సాయంత్రం ఆరుగంటలవరకూ ఫోన్ రాలేదు.

లాల్ ఇంకా వేచి చూశాడు, ఇతర పరిణామాల్ని గమనిస్తూ.

మరో గంట గడిచినా రాలేదు.

లాల్ అప్పుడు మరి కాస్సేపు చూసి, ఎటూ కదలలేని పరిస్థితిలో కృష్ణన్‌కి ఫోన్ చేసి, జరుగుతున్న ఏర్పాట్ల గురించి తెలుసుకున్నాడు.

ఆ ఉత్తరాలన్నీ స్నేక్ సొసైటీ అనుకున్నట్టే కాకేసింది. అయిడియా సక్సెసయింది. ఆ ముప్పైరెండు ఉత్తరాలలోని వ్యక్తుల్లో ఆరుగురు ధనికులు వున్నారు. మిగతావాళ్ళు మధ్య తరగతి ఉద్యోగస్తులు. ధనికులూ, ఉద్యోగస్తులూ తమకేం జరిగేదో గ్రహించిన తర్వాత పోలీసులతో సహాకరించడానికి సంసిద్ధతను వ్యక్తం చేశారు.

వెంట వెంటనే ముప్ఫైరెండుమంది ప్లెయిన్ క్లాత్ ఆఫీసర్లు ఆయా వ్యక్తుల స్థానాల్లోకి వెళ్ళిపోయారు, ఆయుధ సాధనాల సమేతంగా.

వాళ్ళంతా సుహాసిని రాకకై ఎదురుచూస్తున్నారు.

బయట పోలీసులు ముమ్మరంగా తమ కార్యక్రమాలకి పూనుకుంటున్నారు.

చీకటి అంతకంతకూ చిక్కబడుతోంది....

నిమిషాలూ గంటలూ దొర్లిపోతున్నాయి....

కానీ లాల్‌కి తను ఎదురుచూస్తున్న ఫోన్ మాత్రం రావడంలేదు.

• • •

ఒక భారమైన నిట్టూర్పుతో కూర్చున్న సోఫాలోంచి లేచి అతను టైము చూసుకున్నాడు. ఎనిమిదిన్నర.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

రెండుగంటల నిరీక్షణ అతన్ని విసుగుపర్చింది. అతనికి సహనం తక్కువ. నిరీక్షణ అంటేనే అతనికి చిరాకు. అతనికి టైమ్ సెన్స్ ఎక్కువ. అన్నీ చకచకా జరిగి పోవాలనుకుంటాడు.

ఎట్టకేలకు అతడాశించిన ఫోన్ రానే వచ్చింది. అతను పరుగున వెళ్ళి దాన్నెత్తాడు.

"హలో—" అంది అవతలి గొంతు వెంటనే.

"హలో?" అన్నాడతను ఉద్రేకం అణచుకుంటూ.

"పద్మనాభంగారేనా?"

"అవును.... నేనే!"

"మిష్టర్ పద్మనాభం, నే చెప్పేది జాగ్రత్తగావిను—"

"హలో, ఏమిటీ! మీరెవరు?"

"అది అనవసరం. నే చెప్పేది జాగ్రత్తగా విను— జేను స్నేక్ సొసైటీనించి మాట్లాడుతున్నాను. నీమీద ఉత్తరం అందింది మాకు. మాధవీ లత అట—వ్రాసింది. నువ్వామెని ఏదో చేయబోయావట నీ తమ్ముడి పెళ్ళిలో?"

"నేనేం చేయలేదు!"

"నోర్మూసుకుని విను. ఇక్కడ వాదనకాదు. నువ్వేం చేసిందీ నీకు తెలుసు కాబట్టి జాగ్రత్తపడు. మా గురించి నీకంతా తెలుసనుకుంటాను. నీ గురించి సుహాసినికి చెప్పమంటావా, వద్దా?"

"చెప్పకు! ఓహ్, చెప్పకు!"

"మేమూ అదే అనుకుంటున్నాం. అయితే మా మౌనానికి కొంత మూల్యం చెల్లించుకోవాలి. అప్పుడే నువ్వు యోగక్షేమాలతో వుండగల్గుతావు."

"ఓహ్, ఎంత—ఎంత కావాలి?"

"మూడు లక్షలు. ఈ సంగతి పొక్కిందా, వెంటనే బుల్లెట్లు కురుస్తాయి నీమీద. అర్థమైందా? గుర్తుంచుకో. రేపు రాత్రి పన్నెండున్నరకి ఆ డబ్బుతో కూకట్ పల్లివైపు బయల్దేరు. అది దాటాక నీకు ఎడమవైపు కూలిపోయిన మసీదు కన్పిస్తుంది. అక్కడికి చేరుకోవాలి."

"అలాగే, అలాగే!"

"నువ్వు నువ్వేనని తెలియడానికి ఈ కోడ్ చెప్పాలి."

"చెప్పు—ఏం చెప్పాలి?"

"కొస ప్రాణం—కాసుల బేరం."

"అలాగే, అలాగే!"

"గుడ్ విషస్, మిస్టర్ పద్మనాభం, రేపు రాత్రి పన్నెండున్నరకు మూడు లక్షలు. సంగతి పొక్కకూడదు—బై!"

లైను కట్ అయింది.

అతను పెట్టేస్తూ ఉద్రేకపడ్డాడు.

కొస ప్రాణం—కాసుల బేరం!

కూకట్ పల్లి దాటాక కూలిపోయిన మసీదు!

వెంటనే ఈ విషయం తన సుపీరియర్స్‌కి చేరవేయడానికి ఆదరాబాదరా బయల్దేరాడు పద్మనాభం ఉరఫ్ ఇన్‌స్పెక్టర్ రమణారెడ్డి.

• • •

ఆమె చకచక నడుస్తోంది. ఆమె అడుగులు పెద్దగా చప్పుడు చేయడంలేదు సిమ్మెంట్ రోడ్డుమీద. రబ్బర్ సోల్ చెప్పులు ఆ నిశ్శబ్ద రాత్రిలో కనీసం ఊరకుక్కలైనా మేల్కొల్పడంలేదు. ఆమె మాటిమాటికీ టైమ్ చూసుకుంటోంది. రిస్టువాచీలో ముల్లు పదకొండు మీదనుంచి వేగంగా కదిలిపోతోంది.... (ఇంకావుంది)

